శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల
హిందూపురము. పుష్పము ౨౭.

శ్రీ

# రాయలసీమ రచయితల చరిత్ర -౨-

— రెండవ సంపుటి —

ఈ సంపుటితోచేరి, 20వ శతాబ్దపు రాయలసీమ కవిరత్నముల
చరిత్రలు, ఏర్చి, కూర్చి, తీర్చబడి ఏబదియొక్క
రత్నహారముగా తెలుగుతల్లి కంఠసీమ
నలంకరించినది.

గ్రంథకర్త
కవిభూషణ, కవితిలక, కల్లూరు అహోబలరావు

* Ist Edition
Copies 1200
1977 JULY.

* Rayalaseema Rachayithala Charitra-2

* Kavibhushana, Kavi Thilaka KALLUR AHOBALA RAO,

* Book Publishers & Distributors
Sree Krishna Devaraya Grandha Mala.
H I N D U P U R – 515 201

* Cover Design:–
Babu Arts & Kallur Rao, Hindupur A. P.

* PRINTERS:
*Selected Power Printers, Hindupur. A. P.*



* "Paper used for the Printing of this book has been available by the Government of India at Concessional rate"

* **Price Rs. 6–00**

# సంపాదకీయము

## మా సీమ ఖ్యాతి

రాయలసీమ, రాళ్ల సీమకాదు. ఈ సీమ, గొడ్డుపోలేదు. రాళ్లలో రత్నములు దొరికినవి. ఇచ్చట యోగులు, భోగులు, త్యాగులు, మహాత్ములు, యుద్ధవీరులు, శూరులు, కవి పండితులు వెలసినారు. శాతవాహనులేలిరి. గండు గుండెలుగల పరమదాతలగు వెంగళరెడ్డి ప్రభృతులు వెలసిరి. వేమనయోగి జననమంది, 'విశ్వదాభిరామ-వినురవేమ' అను ఆటవెలదుల'నా బాలగోపాలమునకు పంచిబెట్టిరి, 'రాణా ప్రతాప సింహ చరిత్రము' 'అశోకసామ్రాట్టు' 'శివభారతము బ్రహ్మాండ పురాణము' 'పండరీ భాగవతము' మొదలైన ఉద్గ్రంథ 'ములు, మన రాయలసీమలోనే వెలువడినవి. శ్రీ పుట్టపర్తి వారు తమపుట్టలోని, వివిధ రకములైన నాగుబాములను వెలికిదీసి, 'శివ తాండవ' మొనరించిరి. వీరి ప్రతిభను గమనించియేకదా! ఆంధ్ర ప్రభుత్వము వారిటీవలనే, వారి పుస్తక ముద్రణమున కిరువదైదు వేలరూప్యంబుల మంజూరుచేసిరి. కడప జిల్లా కలెక్టరుగారీ సరస్వతీ పుత్ర పుట్టపర్తి కవివరేణ్యులను, గొప్ప సభలో సన్మానించి, పది వేల నూటపదునార్లను సమర్పించిరి. (1977—మే నెల) సెబాసు! ఇప్పటికికదా! రాయలసీమ ధన్యమైనది !!

'పుట్టపర్తి' (పెనుకొండ తా॥ అనంతపురం జిల్లా) గ్రామము కవివరేణ్యులకే కాక, ఆధ్యాత్మిక సందేశమును ప్రసాదించు మహాత్ములకు కూడ పుట్టినిల్లయినది. ఈ ప్రశాంత నిలయమునకు, భారతదేశ మంచన్ని మూలల నుండియేకాక, విదేశములనుండి పాశ్చాత్యులుకూడా ఆకర్షింపబడు చున్నారు. ఎవ్వరేమనుకొన్న

నేమి? ఈ కేంద్రము గుండా విజ్ఞానజ్యోతి విశ్వవ్యాప్తిగా ప్రసరించు చుండుట ముదావహము.

కట్టమంచివారు, ' ముసలమ్మకట్ట ' పై కీర్తించిరి. శ్రీ విశ్వంగారు, విశ్వమోహనమైన ' మాణిక్యవీణ ' పై ఆలాపించు చున్నారు. చిత్తూరు జి॥ శంకరంబాడి సుందరాచారిగారు 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ ' అనుచక్కని పాటవ్రాసి ఆంధ్రదేశ ప్రభుత్వమువారి మన్ననల బడసి, అనతికాలములో కీర్తికాంతను జేబట్టి, కాలగర్భమున కలసిపోయిరి. ఇది దురదృష్టము.

రా య ల సీ మ సా హి తీ పీ ఠ ము

శ్రీ విజయ నగర సామ్రాజ్యము నఖండ ఖ్యాతితో పరిపాలించిన శ్రీ కృష్ణదేవరాయల 'హంపీ–విజయనగరము' కర్ణాటకములో కలసిపోయెను. మనకు చింతకలుగలేదు. 'నటశేఖరుడు'గా వెలసిన శ్రీ రాఘవగారి బళ్లారి పట్టణము కన్నడ రాజ్యములో చేరిపోయినను, మనకు దుఃఖము కలుగలేదు. దేశ పటములలో అడ్డుగీతలు గీచిన మాత్రమున, బళ్లారిలో వెలసిన ఆంధ్ర పండిత కవులు కర్ణాటకు లగుదురా? వారు మన రాయలసీమవారు కారా? నాటకపితామహులైన ధర్మవరము రామకృష్ణమాచార్యులు, గోపాల కృష్ణమాచార్యులు, కోలాచలము శ్రీనివాసరావు, మొదలైనవారు మన రాయలసీమ వారేకదా? వారి జీవితచరిత్రలు, వారాంధ్రభాషకు చేసిన సేవలు, మనము మఱవజాలము.

1931 వ సంవత్సరమున, బళ్లారిలోనే, శ్రీ కృష్ణదేవరాయల వారి దివ్యనామ మహర్నిశము, సంస్మరించుటకై, ఈ గ్రంథమాల ' శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల ' అనుపేరిట స్థాపింపబడెను.

కొన్ని సంవత్సరంబులు మధ్యలో ఈ గ్రంథమాల అజ్ఞాతవాస మనుభవించినను, ఈ 46 సంవత్సరంతో, ఇంతో భాషా సేవ చేయుచు, నేటికిని జీవించియున్నది.

బళ్లారిలో 'స్వార్థత్యాగము'తో జన్మించినది. స్వలాభాపేక్ష లేదు. రాయలసీమ కవుల గ్రంథ ప్రచురణమే, ప్రధానోద్దేశ్యము. అచ్చట 9 పుస్తకములు ప్రచురణమాయెను. తరువాత కారణాంతరములచే, గ్రంథమాల అనంతపురమునకువచ్చి, అచ్చట ముద్దు ముచ్చటగా పెరిగి, 3 పొత్తములను వెలువరించెను. ప్రకృత మీ గ్రంథమాల, హిందూపురములో అభివృద్ధిజెంది 11 గ్రంథములను ప్రకాశింపజేసెను. ఇయ్యది 23 వ పుష్పము. (మొదటిభాగములో గ్రంథమాల, సంగ్రహ చరిత్ర వ్రాసినాము)

మా ధ్యేయము, మా కృషి

'Who is Who of Rayala Seema Writers' రాయలసీమలో అనగా, అనంతపురము, కడప, కర్నూలు, చిత్తూరు, జిల్లాలే కాక, బళ్లారి పట్టణము నందున్న తెలుగు రచయితలు (పద్య-గద్య గ్రంథకర్తలు)ఎవ్వరెవ్వరే గ్రంథముల వ్రాసినారు? వారి ప్రతిభా విశేషము లెట్టివి? సంగ్రహ కుటుంబ విశేషములు (చిత్రములతో సహా కీర్తిశేషులు.సజీవులు) వ్రాసి, రాయలసీమ రచయితల చరిత్ర అను పేరితో ఎన్ని కష్టములకైనా. ఓర్చి ఈ చరిత్రమును సాంగోపాంగముగా ప్రకటించుటయే, ధ్యేయముగా పెట్టుకొని, ఇప్పటికి ప్రథమ భాగములో 20 మంది కవుల చరిత్రములను, రెండవ భాగములో 31మంది కవులచరిత్రములు వెలువరించినాము. భావితర

మువారికి, చరిత్రకారులకు ఈ చరిత్రలు' ఎన్సైక్లోపీడియా ' గా Encycloped ia) ఉండి పనికివచ్చుననియే మా భావము. మహా (కవులైన తిక్కన, బమ్మెరపోతన్న, శ్రీనాథుడు, మొదలైన వారి జన్మస్థానములనుగురించి, వారి జన్మకాలముల గురించియు, నేడు వాదోపవాదములు జరుగుచున్నవి కదా! వారి చరిత్రములే వ్రాయ బడియున్నచో, ఇప్పటి కలహములకు తావు లేకుండెడిదిగదా!

పూర్వమున కన్నను, ఈ 20వ శతాబ్దములో కవులెక్కువైనారు. గ్రంథములెక్కువగా వెలువడినవి. అపూర్వమైన కావ్యములు, వెలువడినవను మాటలో అసత్యములేదు. ప్రతి జిల్లాలోను, నూటికి పైగానే కవులుగలరు. స్త్రీ రచయితలును, అభివృద్ధి చెందుచున్నారు. ఇప్పుడు నవకవులు,భావకవులు,వచనకవిత్వమును, ఛందోబద్ధముగ, రాగ తాళముల, కనువైన పద్ధతిలో, వ్రాయుచున్నారు. కాలానుయుక్తముగా వేషభాషల యందును, మార్పులు కలుగుచున్నవి. తథాస్తు.

ఇప్పుడు వ్రాసిన 51 మంది కవులుగాక, చేర్చదగిన వారింకను పలువురున్నారు. చిత్తూరుజిల్లా వారు, కర్నూలు జిల్లావారు చాలమంది కలరు. అనంతపురము, కడపజిల్లాలవారు మఱికొందరు గలరు. రాయలసీమలో జననమొంది,మైసూరు, బెంగళూరు, మదరాసులలో, ఉద్యోగవశమున, నివసించుచు, కవనమల్లుచున్నవారు కూడ కలరు. ఒక విషయమేమనగా, రాయలసీమ కవి పండితులకు 'చొఱవ' లేదనను కాని. దామాషాలో ఉత్తరాది వారికంటె తక్కువ. అని చెప్పవచ్చును. తమ్ముదాము అవిష్కరణమొనర్చుకొను అలవాటు వారికి లేదు. ఇతరులు వారిని పొడిచి, పొడిచి లేపవలెను. హనుమంతుడు బలవంతుడైనను. తనబలమెఱుగడు.

ఇతర కపివీరులు 'హనుమా! లెమ్మా! నీ సరిసమానులులేరు. వారిధి లంఘించుటకు నీవే శక్తుడవు' అని ప్రోత్సహించు వఱకు లేవలేదు. లేచిన తర్వాత కార్యము సాధించువఱకతడు విడువలేదు. (కిష్కింధ- మన రాయలసీమలోనిదే) త్రేతాయుగములోనే ఇట్లుండిన కలియుగములో చెప్పవలసిన పనిలేదు.

ఇప్పుడు ప్రతి జిల్లాలోను, రచయితల సంఘము లేర్పాటగు చుండుట ముదావహము. ఆయా సంఘములవారు, తమ జిల్లా రచయితల చరిత్రలు వ్రాసి ముద్రించుచుండుటయు సంతోషకర మైన విషయమే. మేము చిత్తూరుజిల్లా రచయితలకు కొందరికి వ్రాసితిమి. వారు బదులివ్వలేదు. కొందఱికి బదులు కార్డులు వ్రాసి తిమి. జవాబులేదు. వంశగౌరవము కాపాడుకొను ఆశ వుండును కదా! అని, కీర్తిశేషులైనవారి వంశీయులకు, వారి తండ్రుల, తాతల, చిత్రపటములను పంపవలయునని కోరితిమి. ప్రత్యుత్త రము లేదు. తండ్రి పండితుడు, కళాభిమాని కావచ్చును. పుత్రునకా భాగ్యముండదు. అందుకే 'పండిత పుత్రః' అను నానుడి ప్రాధాన్య మైనది.

ఇందుకు, సంపాదకుడేమి చేయవలయును ? ప్రతిచోటికి, పోయి రావలయునన్న సాధ్యమా? ఈవృద్ధాప్యములో (76సంవత్స రములు) కాయపటుత్వము, ఆరోగ్యము, అర్థసంపద, ఉండవల యును కదా! ఉత్సాహమున్నది. పట్టుదలయున్నది. కార్యదర్శిగా, నాపుత్రుడు చి॥ కల్లూరు రాఘవేంద్రరావు, వ్రాతకోతలను ముగిం చుచు, పట్టుదలతో ప్రూఫులు, మొదలైనవి ముగించుచు, గ్రంథ మాల కార్యముల యందుత్సాహముగా పాఠాడుచున్నాడు. కాన, నేనింతమట్టుకు దైవానుగ్రహమున పనిచేయుచున్నాను.

విద్యయున్న, ధనముండదు. ధనమున్నవానికి సరస్వతి దూరము. రెండుగలవారికి, దాతృత్వముండదు. మూడు గుణములు కల వారు లక్షకొకరు. అట్టివారిని మేము దర్శింపవలెను. సరస్వతికి లక్ష్మి అత్తగారు కదా! అత్తగారి పెత్తనము తప్పదు.'భిక్షాందేహి' యనుట మాకు తప్పలేదు.

" ధనమూలమిదం, జగత్ "

హైదరాబాదు 'సాహిత్య అకాడమీ' వారు. 'రాయలసీమ రచయితల చరిత్ర' ప్రథమభాగమునకు రూ. 1500/ గ్రాంటు నొసగిరి.సంతోషించితిమి. రెండవ భాగమునకార్థిక సహాయమర్థించితిమి. ఈతూరి సాధ్యము కాదన్నారు. మావలెనే, వారిసహాయమడుగువారు మఱికొందరు. వారికివ్వవలదా? ఢిల్లీ గవర్నమెంటు వారు, వివిధభాషలలో ప్రచురింపబడు పొత్తముల కార్థిక సహాయమొనరింతుమని, వారే కొన్ని ఫారములను పంపిరి. ఆఫారములను భర్తీచేసి, ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వము ద్వారా 1975లోనే పంపుకొన్నాము. ఇంతవఱకు ఫలితార్థము తెలియలేదు. కాంగ్రెసు ప్రభుత్వము మాఱినది. జనతాప్రభుత్వము వచ్చినది. వేచి చూచెదముగాక!

కలకత్తాలో, రామమోహన్‌రాయల వారి సంస్థయొకటి కలదు, వారన్ని దేశభాషలలో ప్రచురింపబడిన, పొత్తములనుకొని, గ్రంథకర్తలకు డబ్బుచెల్లించి,అన్ని జిల్లాల లైబ్రరీల కాపుస్తకముల నుచితముగా పంచిపెట్టెదరన్న శుభవార్తవిని, రెండేండ్ల క్రిందటనే మాపొత్తములను వారు కోరినమేఱకు డిస్‌కౌంట్లతో సప్లయి చేసెదమని విన్నవించుకొంటిమి. ఇంతవఱకు వారినుండి జవాబు లేదు

ఏకార్యమునకేనియు అర్థమావశ్యకమైయున్నది. ఈరెండవ భాగ ముద్రణమునకీ క్రిందివారు తమ విరాళములనొసగి మమ్ము ప్రోత్సహించిరి. వారికభివందనములు సమర్పించుచున్నాము.

1 శ్రీ అనంతరామయ్యశ్రేష్ఠిగారు, హిందూపురము
2 ,, గుంటూరు సుబ్బరాయుడుగారు, అనంతపురము.
3 ,, గుంటుపల్లి రాధాకృష్ణమూర్తిగారు, ,,
4 ,, ప్రభాకరు C/o కీ॥శే॥ ఎద్దీరప్పగారు, ,,
5 ,, నాగసముద్రము రామరావుగారు, ,,
6 ,, పైడి లక్ష్మయ్యగారు, ,,
7 ,, శ్రీవేంకటనారాయణగారు, యం.యల్.ఎ. పెద్ద కౌకుంట్ల.
8 ,, రాచెర్ల తిప్పయ్యగుప్తగారు, అనంతపురము.
9 ,, కగ్గల్లు సుబ్బరత్నముగారు, హిందూపురము.
10 ,, జూటూరు రమణయ్యశ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు.

హిందూపురము, మునిసిపలు కమీషనరుగారు మా గ్రంథమాల పుస్తకములను, తమ హైస్కూళ్ల లైబ్రరీలకు గొని, మమ్ము ప్రోత్సహించిరి. వారికభివందనములు. కేంద్రప్రభుత్వము వారు,రాష్ట్రప్రభుత్వముద్వారా మా పుస్తకములను ప్రచురించుకొనుటకు చౌకధరలో తెల్లకాగితములు సప్లయి చేసియున్నారు. వారికి మా అభివందనములు. ఇదివఱలో మా గ్రంథమాలకు,దాతలుగా పోషకులుగా చేరినవారు, ఈ పుస్తకము వారికందినతోడనే తమ విరాళముల సమర్పింపవలయునని వేడికోలు.

ముసుముందు మా కృషి :

శ్రీ పరమేశ్వరు డనుగ్రహించి, రావలసిన ఖిరాశములు, త్వరగావచ్చి, ప్రభుత్వసహాయము లభించిన 'రాయలసీమ రచయితల చరిత్ర' మూడవసంపుటిలో మిగత వారినందరినిచేర్చి, ఈ కార్యక్రమమును, సాంగోపాంగముగ ముగించెదము, 'మాచరిత్ర' ఈ రెండవసంపుటిలోకూడా రాలేదే! అని మాత్రము ఏరచయితలు నిరుత్సాహపడనవసరములేదు. మమ్ము దూషింపవలదు. మాకు జాతి - మత కులభేదములులేవు. మాది సారస్వతజాతి. సద్విద్య యుండదే చండాలు నందు? అని యొక కవివాక్కు. మా కార్యక్రమమునకు రచయితలుకూడా 'ఉడుత కుడుతాభక్తి' గా సాయ మొనరింప మనవి.

అనంతపురము జిల్లా, రచయితలసంఘమున కధ్యక్షులై, శ్రీ పైడి లక్ష్మయ్యగారు, జిల్లా రచయితలకందరికి ప్రోత్సాహ మొసంగుచున్నారు. శ్రీవారి సారస్వతసేవ అపారమైనది. ఇంత కాలము, మా గ్రంథమాల వర్ధిల్లుటకు ఆర్థికసహాయమొసరించిన హిందూపుర పట్టణ ప్రముఖ వైశ్యశిఖామణులకు, అనంతపురపట్టణ వైశ్యప్రముఖులకు, తదితరుల కభివందనములు సమర్పించుచు ఇకమీదకూడ, వారి దాతృత్వ విరాళములు, యథారూపమున గ్రంథమాల కర్పింపవలయునని హృదయపూర్వకముగా వేడుచు, ఇంతటితో ముగించుచున్నాను.

ఇట్లు, విన్నవించు,
కవిభూషణ, కవితిలక,
కల్లూరు అహోబలరావు
సంపాదకుడు.

శ్రీకృష్ణ దేవరాయ గ్రంథమాల
హిందూపురము. 4—6—77

# పీఠిక

(కవి, చకోర చంద్రోదయ, శ్రీ పైడి లక్ష్మయ్య, బి.ఎ.బి.యల్.,
మాజీదేవాదాయ కమీషనరు, మాజీ పార్లమెంటు సభ్యులు.)

'అశోక సామ్రాట్టు'ను మహా కావ్య, రచనతో, ననుపమ కీర్తి గడించిన, శ్రీ కల్లూరు యజమాన వేంకటనారాయణరావుగారు శ్రీ కల్లూరు, అహోబలరావు గారి 'రాయలసీమ రచయితల చరిత్ర' ప్రథమభాగమునకు 'మున్నుడి' యనుపేర 'పీఠిక' వ్రాయుట యెంతయు సముచితము, సమంజసము. ఇరువురును పండిత కవీంద్రులు, చిరకాలము విద్యాశాఖలో నుద్యోగములొనరించి. పదవీ విరమణగావించి, ప్రస్తుతము విశ్రాంతిగొనుచు, తమ శక్తికొలంది యిరువురు భాషాసేవ, సలుపుచున్న విద్వద్వరేణ్యులు. శ్రీ కల్లూరు అహోబలరావు దాదాపు నాలుగు దశాబ్దములుగా,దాను బళ్లారిపురములో, నుపాధ్యాయ పదవిలో నుండినదాది, అనంతపుర మండలమున తిరుదెంచి, యెన్నియో పల్లెలలో, పాఠశాలలందు నుద్యోగమొనరించి తుదకు పదవీ విరమణగావించిహిందూపురమున నివాసము గావించుకొని, బళ్లారిలోఁదానున్న కాలమున స్థాపించిన శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాలను, నేఁటిదనుక, నిరంతరాయముగ జరిపించుచు మన రాయలసీమ సారస్వతమునకును, మన సీమలోని కవీంద్ర బృందమునకును, జేసిన, చేయుచున్న యమూల్య సేవలకు, నభినుతు లొనరించి, యీ 'రచయితల చరిత్ర' ద్వితీయ భాగమునకు పీఠిక వ్రాయఁగడంగితిని. ఈ సీమలో నెందఱో మహా కవులు, మాన్యులైన పండితులుండగా, నేనీకార్యమునకు బూనుట, సాహసకృత్యమే, కాని యీ కవికుల తిలకుఁడగు శ్రీ అహోబలరావు మనసీమలో వెలసిన అజ్ఞాతకవుల, నెంతమందినో చరిత్ర వెలుఁగులోనికి దెచ్చి, అనన్య సామాన్యపద్ధతిలో నహర్ని

శలు రాయలసీమకేకాదు, ఆంధ్రరాష్ట్రమునం దలరారెడి నాంధ్ర సాహిత్యానికి,ఆంధ్రపాఠక లోకానికి సలుపుచున్న, యనుపమభాషా సేవా నిరతికి దీక్షకు, నే బొందిన పరమానందము, నన్నీ బృహత్కార్యమునకు బురిగొల్పినది ' మంచికార్యమును మచ్చరము లేక కీర్తించుట మానవతాలక్షణముగదా'!

భారత సామ్రాజ్య రమాదేవికి, స్వర్ణమయ రత్నస్థగిత పాద పీఠికయై, యమూల్య రత్న, హేమాది ఖనిజ సంపత్తులతో శోభిల్లు దక్కను పీఠభూమియందు, రాయలసీమ చిరకాలము 'రత్నాలసీమ' గా రాజిల్లి, దిగంత విశ్రాంతకీర్తి గడించియుండె ననుట జగద్విదితము. సాహితీ సమరాంగణ సార్వభౌముండైన శ్రీ కృష్ణదేవరాయల పరిపాలనలో, నీసీమలో భౌతిక, సాహితీ, యాధ్యాత్మిక సంపదలకేకొఱతయు, కొదువయులేమి; దేశము సుభిక్షమై వెలయ, ప్రజలష్ట ఐశ్వర్యములతో,హాయిగ,సుఖశాంతులు గల్గి జీవించుచుండగ శ్రీ భువన విజయమండపములో నాంధ్ర భాషావధూటి, యాహ్లాద కరముగ, నవరసభరిత, నవీనకావ్య ప్రబంధ కుసుమాళినిదాల్చి, నూత్నభంగిమలతో విజయ నృత్య మొనరించెననుట లోకవిదితము. అయ్యది మనసీమకెంతయో గర్వహేతువు, కాని కలకాల మావెన్నెల రాత్రులుండవయ్యె. క్రమేణ ఆ రాత్రులు గడచిపోయెను. అది ప్రకృతి నైజము. యవనుల దండయాత్ర పరంపరలచే ప్రజలకు సుఖశాంతులు సన్నగిల్లెను. భయాందోళనలు పరిఢవిల్లెను. వర్షాభావముచే పంటలు కఱవయ్యెను క్షామపిశాచము చేఁజిక్కి దేశము క్రుస్కిపోయెను.నూఱేండ్ల నాఁటి యీ సీమచరిత్ర పరిశీలించిన రెండేండ్లకొక పరి, క్షామ పిశాచము సాక్షాత్కరించడము, ప్రజానీకాన్ని పీల్చి పిప్పిచేయడము దుర్భర దారిద్ర్యాన్ని యెదుర్కొని ప్రజలు కన్న కష్టాలకు గుఱియై;

ఆకలితో నలమటించడము. దీనస్థితికి దిగజారడము సంభవించినది. ఈ దారిద్ర్యమును చిమ్మ చీకటులు, నసదృశ శోభతో నలరారి రత్నాల సీమయని ఖ్యాతిగాంచిన రాయలసీమను ' రాళ్లసీమగా ' మార్చెను. కాలమొకే రీతియుండదుగదా! జమీందారులు, జహాగీరు దారులు, ధనికవర్గములేమిచే సారస్వతమున కంత ప్రాపు, దాపు లభింపదయ్యేను. 'నిరాశ్రయా నశోభంతే పండితావనితాయతా' అను విబుధోక్తి సార్థకమయ్యేను. కాని 'క్షేమము లెన్నివచ్చిన రసజ్ఞత యించుక చావలేదు' అనియొక మహాకవి వచించినటుల నీసీమ జనులలోని రసజ్ఞత, యింతదనుక మిగిలియుండుట యీ సీమయొక్క భాగ్య మనదగును, అదేమి చిత్రమోగాని, రాయలసీమ జనులలో ననన్య సామాన్యమైన ప్రత్యేక విశిష్ట గుణములు గొన్నికాన్పించు చున్నవి. ఒక కవిరాజు, నుడివినటుల,

సీ॥ పగబట్టిరా—యెంత—బలవంతుడలనైన ద్రుంచుదాక, కరాసీ—దించలేరు
పిర్తియమందిరా — బికారిగ ద్రిమ్మరిలువాని బైకివచ్చేడుదాక— వదల లేరు
మెచ్చిరా—విద్వస్సముచ్చయములు తన్వి గనుదాక, వేగ పొమ్మనగలేరు

.........................................................................................

గీ॥ ఆవని రాయలసీమ, మానవులసాటివారు, ముమ్మాటికనిలేరు—లేరు. లేరు "

" అచట బుట్టిన జివురు గొమ్మైనచేవ " అను మహాకవి వాక్యము ఉండనేయున్నది.

ఇంక దాతలన్ననో చేతనుండవలయుంగాని, ఉంచెనా ఒసంగిరా యర్థిజనోత్కరములకోర్కె లుడుపుదాక కరమ్ము లుడుప లేరు ఇయ్యవి యెల్ల తెలింగిన సత్యములు ఇంకపండిత కవిరాజులలో ఏ మహానుభావుని.యాశ్రయము, నాదరణలేకయున్నను.ఏకోటీశ్వరుని పోషణ ప్రోత్సాహములు లేకయున్నను సాంద్రగర్భిత

రత్నములఁబగిది, మట్టిలో మాణిక్యములఁబోలి, యనేకమంది కవిరత్నము తీసీమలో వెలసిరి. ఒకప్పుడు సరస్వతీ పుత్ర శ్రీపుట్టపర్తి వారినిగూర్చి.

"పుట్టలివి, వట్టివని చాకఁబోతిగాని. ఫణిమణిరశ్మి యొకఁడుగ—న్పొపఁబొడిచె!
వెలికిరాబోక తమవెలుం—గులనుదాచి!యెన్నియో యున్నవోలోన—నెవతికెఱుక!

అను శ్రీ రాళ్లపల్లి వారివాక్యములు యథార్థములు. మఱుఁగుపడిన మాణిక్యాలెన్నియో యీ సీమలో నున్నవి. రాయల తరువాత యొకటి రెండు శతాబ్దములు. తంజావూరు రాజుల యాశ్రయములో, ననేక ప్రబంధములు వెలువడినవి. కాని యెందఱోకవులు పాపమీసీమలో,నజ్ఞాతముగా కావ్యరచనసాగించి,అడవిమొల్లలవలె నంతరించిరి. శ్రీ హనుమచ్ఛాస్త్రిగారు, 'మాసీమకవుల'ను గ్రంథములో మూలనున్న కవులను గొందఱిని ముంగిటఁదెచ్చి మన సీమ జనుల గౌరవ విశ్వాసములకును, కవుల కృతజ్ఞతకు పాత్రుఁడయ్యెను "రాయలసీమ రచయితల చరిత్ర" ప్రథమ భాగములోను ద్వితీయ భాగమందును, శ్రీ కల్లూరు అహోబలరావు 51 మంది కవులను జీకటినుండి చరిత్ర వెలుఁగునకు దెచ్చి, మఱింత పుణ్యముఁగట్టుకొనిరి. ఇట్టి నిస్వార్థపరులైన భాషాసేవాసక్తులు మన సీమలోనుండుట, మనభాగ్యము, జగతినుపకర్తలకు నిస్వార్థసేవ సహజగుణమనికదా! భర్తృహరివాక్యము,

ఈ సీమలోగూడ పండితులు,కవులు, గలరా అను పెరవారి సందియము, శ్రీ రాజశేఖర శతావధాని "రాణాప్రతాపసింహచరిత్ర" శ్రీ గడియారమువారి శివభారత కావ్యరచనలతో దీరినది. జనమంచి వారి కావ్యరాజములతో నిటపండిత కవులు లేరను అపోహ మంతరించెను. శ్రీ రాళ్లపల్లివారి సునిశిత విమర్శనాత్మక సరసవచన రచనలతో, రాళ్లలో నమూల్య రత్నములున్న

ననుటఁదేటగా జాటఁబడెను. పుట్టపర్తి వారి రచనలతో విశేషించి "శివతాండవముతో" రాయలసీమసారస్వతము తాండవించి పెరవారి దురభిమానము సంపూర్ణముగా డొలఁగి పోయెననియు, రాయల సీమలోని పుట్టలు వట్టివి కావ, నిగ్రహించి రనియందురు.

నాఁడేకాదు నేఁడును,లెక్కలేనన్ని రసవత్కావ్యాలు వెలు వడుచున్నవి. పలువురు కవులు, స్వశ్లాఘాపరాయణులుగారు గాన బయట గాన్పించక,మట్టిలో మాణిక్యాలు బోలి మఱుగు పడియున్న వారు అట్టి కవులనుదెరబాటునుండి బయటఁదెచ్చుటయే యీ గ్రంథకర్తగారి యుద్దేశము. రాయలసీమ రత్నఖని. జాతిరత్నము లెన్నియో యిందున్నవి. అన్వేషించి కనుగొనవలసిన భారము, బాధ్యత గ్రంథకర్తగారిది. అందులకెంతయు ఓర్పు, నేర్పు, తీర్పు కూర్పు, అనుగుణములు వలసియుండును. ఇయ్యవి యీ గ్రంథ కర్తలొ,నిమిడియున్నవని నా విశ్వాసము. అనంతపురమండలమున గల నూత్న తటాకపురమున (క్రొత్తచెరువు గ్రామములో) శ్రీ అప్పప్ప అనుకవి భటాగ్రిజకులస్థుడు 'శశిరేఖాపరిణయమ'ను నవరస భరితమైన కావ్యము ద్రాక్షాపాకములో రచించినవారు. వీరు అజ్ఞాత కవి గణములోజేరినవారే. బెడుదూరు హరిశ్చంద్ర నాటకము. బైచాపుర హరిశ్చంద్ర నాటకము, చుక్కలూరు రామనాటకము. మున్నగు గ్రంథకర్తలుగలరు. శ్రీ గరుడచేడు హనుమంతప్పగారి ద్రౌపదీ వస్త్రాపహరణ నాటకము, లేపాక్షి రామాయణనాటకము ప్రశంసాపాత్రములు, తృతీయ భాగము రచించి అట్టి బయలు నాటక కవులను. ప్రబంధ కవులను చరిత్ర వెలుఁగుకు గొనిరావల యును. శ్రీవావిలికొలను సుబ్బరావువంటి సుప్రసిద్ధకవుల జీవితాలు సాహితీ వేత్తల జీవితాలు ఏనాడో రచింపఁబడినవి. శ్రీ గార్లదిన్న

సుబ్బరావు, మరూరు లక్ష్మీనరసప్పవంటి కవుల జీవితములు చాల మందికి తెలియవు. అట్టి వారి గ్రంథములు వెలుగులోనికిదెచ్చి ప్రశంసలగన్న శ్రీ కల్లూరు అహోబలరావు ధన్యులు చరితార్థులు రాయలసీమలో అష్టావధానములు అవలీలగాజేయుచున్న శ్రీ సి. వి. సుబ్బన్న శతావధాని ప్రఖ్యాతి గన్నవారు. కీ॥ శే॥ బీరము సుబ్బారెడ్డిగారు కడపజిల్లా బవిశెట్టిపల్లి నివాసి వారు. విద్యార్థిదశలో ఈ పురమునందనేక యవధానము లొనర్చి కీర్తిఁగాంచిరి. మంచి పౌరాణికులు అట్టివారల జీవిత విశేషములు సేకరించి తృతీయ భాగములోఁజేర్చు టొప్పు.

శ్రీ కల్లూరు అహోబలరావు పట్టుదలగల కార్యశూరుఁడు. వారేకార్యమునకు బూనినను ఎన్నియంత రాయములైన నెదుర్కొని సాధించగలరు. పిన్ననాటనే వీరు, బరోడారాజుగారి బంగారు పతకముఁబడసిరి. శ్రీ కూరత్తాళ్వారయ్యంగారు, శ్రీ రాష్ట్రాటిసుబ్బ దాసు, శ్రీ షేకుదావూద్‌సాబు శ్రీ పెళ్లూరిసెట్టి రంగబ్రహ్మారావు నాయుడు, శ్రీ లంకా కృష్ణమూర్తి, శ్రీ రాచెర్ల తిప్పయ్యగుప్త మొదలగు అజ్ఞాత కవులను ఇందులోఁజేర్చి వారిగ్రంథములను గూర్చి వ్రాసిరి. ఇట్టి అజ్ఞాత కవులనేకులు, వీరికి ఋణపడిరనవల యును. కాని యీ గ్రంథము సమగ్రముకాదు. మఱియొక సంపుటములో సంపూర్ణముగ నెల్లఱి కవుల జీవిత విశేషములు, శ్రమించి సేకరించి, పూర్తిచేయగలరని నా మనవి. వీరియుగాది స్వర్ణ భారతి వీరి కవితాప్రతిభ జాటుటయేగాక, వీరి కార్య దీక్షకు చిహ్నముగా నున్నది.ఇట్టి లోకోపకారములైన గ్రంధములు మఱి కొన్ని రచించి సారస్వత సేవ సలుపుటకొఱకు, వీరికి శ్రీనివాసుఁడు సిరిసంపత్తు లొసంగి,చిరాయురారోగ్య భాగ్యములుప్రసాదించుగాక

రూ. 116/- సమర్పించిన దాతలు (చిత్రములలో లేనివారు)

1 శ్రీ కాశంశెట్టిగారి, రాధాకృష్ణయ్యగారు. కల్లూరు ఆర్. ఎస్.

2 ,, గొంగడి రామప్ప అండు సన్సు, హొన్నేలింగప్పగారు
దుర్గా ఆయిలు మిల్స్, అనంతపురము.

3 ,, మేడా రామయ్యశ్రేష్ఠిగారు ..

4 ,, మేడా సుబ్బయ్యశ్రేష్ఠిగారు ..

5 ,, పరమేశ్వరరెడ్డిగారు భూస్వామి, నగరూరు.

6 ,, గొల్లాపిన్ని రామకృష్ణశాస్త్రిగారు, కడప.

7 ,, జూటూరు రమణయ్యశ్రేష్ఠిగారు, పొద్దుటూరు.

8 ,, తాటి ములకన్నగారు. మౌక్తికపురము.
ముద్దనాయనపల్లి పోస్టు, కల్యాణదుర్గము తాలూక.

9 ,, జి. నాగిరెడ్డిగారు. భూస్వామి. దాడితోట. తాడిమఱ్ఱి పోస్టు.
ధర్మవరము తా॥ (అనంతపురం జిల్లా.)

10 ,, కట్టా లక్ష్మినారణయ్యగారు, హిందూపురం.

11 ,, యమ్. వి. వి. చలంగారు, హిందూపురం.

12 ,, స్వర్గీయ కె. కొండప్పగారి కృప శ్రీ కె.సి, మణి బి.కాం.
హిందూపురం (అనంతపురం జిల్లా.)

13 ,, దాసా గోవిందయ్య శ్రేష్ఠిగారు. హిందూపురం.

14 ,, శ్రీరాం నరసయ్యశ్రేష్ఠిగారు. బెంగళూరు.

15 ,, మాకం కృష్ణమూర్తిగారు, సెక్రెటరీ. నరహరిసద్గురు
సేవాసంఘము - హిందూపురము.

16 ,, కరణము, వేంకట నారణప్పగారు. సర్పంచు, లేపాక్షి.

17 ,, యం. వి. కృష్ణమూర్తి బి. ఎ., రిటైర్డు తహసీలుదారు కళాప్రియులు, కళాపోషకులు, కవులు, అనంతపురము.

18 ,, దుత్తలూరు రామారావుగారు. కళాపోషకులు ధర్మవరం.

19 ,, పాణ్యం చంద్రమౌళిగారు 'సినీసుందరి' హిందూపురం.

రూ. 58/– చెల్లించిన ఉద్ధారకులు

1 శ్రీ పురుషోత్తం చిన్నగుండయ్యగారి కృష్ణయ్య ఎస్. ఎస్. అశ్వత్థయ్యగారు. హిందూపురం.

2 ,, బి. ఎస్. శ్రీధర్ గారు బి. ఎస్. ట్రాన్సుపోర్టు ,,

3 ,, కగ్గల్లు సుబ్బరత్నముగారు వైశ్యబ్యాంకు ,,

4 ,, కరణము రాజారావుగారు– ,,

5 ,, హెచ్. బొజ్జిరెడ్డిగారు, ప్రెసిడెంటు. గట్టేహాళ్లి కో–ఆపరేటివు సొసైటి ఆలూరు. (కర్నూలు జిల్లా.)

6 ,, డాక్టరు పి. వి. రామచంద్రారెడ్డిగారు, యం. బి. బి. ఎస్. కస్తూరిదేవి నగరు, నెల్లూరు.

7 ,, సెక్రెటరీ, కళాజ్యోతి, ధర్మవరము.

రూ. 25/– చెల్లించిన పోషకులు.

1 శ్రీ అణికార్ బ్రహ్మరాయప్పగారు, హిందూపురం.

2 ,, జయం సత్యనారాయణశ్రేష్ఠిగారు జవుళి వ్యాపారం హిందూపురం.

3 ,, కట్టా శ్రీరాములుగారు మర్చెంటు, హిందూపురం.

4 ,, త్రిపురాంతకం బసప్పగారి కుమారులు. ,,

5 ,, డాక్టరు హెచ్. గోపాలరావు, యం. బి.బి.ఎస్. ,,

6 ,, నరసేపల్లి శ్రీ సత్యమయ్యగారు. పామిడి.

7 ,, జి. యం. మహానంది ఈశ్వరయ్యగారు, సూపరింటెం
డెంటు, సెంట్రలు ఎక్సయిజ్, క్వీన్సురోడ్డు, బెంగళూరు-1
8 ,, కాసంసెట్టి లక్ష్మయ్యగారు, పామిడి.
9 ,, కరణము ఛాయప్పగారు భూస్వామి, మలుగూరు.
10 ,, డాక్టరు యం. మునిరెడ్డిగారు, పామిడి.
11 ,, భైరపురెడ్డి రెడ్డినారాయణరెడ్డిగారు, రాయవరం. కడపజిల్లా.
12 ,, బిక్కి రామాంజనేయులుగారు, మున్సిఫు మేజస్ట్రేటు
సిద్దిపేట-(మెదక్ జిల్లా.) తెలంగాణ
13 ,, కాలేరు ఆంజనేయులుగారు—గగనమహలు రోడ్డు
దోమలగూడ-హైదరాబాదు.
14 ,, రెడ్డివారి నారాయణరెడ్డిగారు నాయనపల్లి. హిందూపురం
15 ,, గంగవరము సి. వి. సుబ్బయ్యశెట్టిగారు,
డో. నెంబరు 3—164 న్యూటవున్, అనంతపురం.
16 ,, సంజీవరెడ్డిగారు, మానేపల్లి. (హిందూపురము తా॥)
17 ,, లంకా కృష్ణమూర్తిగారు, ఇందిరానగరు, బెంగళూరు.
18 ,, జి. సుబ్బయ్యశాస్త్రిగారు ఇందిరానగరు, బెంగళూరు.
19 ,, హెచ్. సత్యనారాయణశాస్త్రిగారు, సంస్కృతపండితులు—
ఓరియంటల్ మునిసిపల్ హైస్కూలు, హిందూపురము.
20 ,, చేగు ఆదెయ్యశ్రేష్ఠిగారు అండుసన్సు, హిందూపురము.
21 ,, యం. గోవిందరావుగారు, డాక్టరు, బవరంపల్లి
22 ,, వై. నాగేశశర్మగారు, 215-5 క్రాసురోడ్డు రెండవబ్లాకు
బెంగళూరు—2.
23 ,, రాధాకృష్ణ సత్యనారాయణగారు, ఆయిల్‌మిలు. హిం॥

24 ,, కె. తిప్పేస్వామిగారు S/o లింగణ్ణగారు సేవామందిరం.
25 ,, బి. సి. ఓబశేసప్పగారు. అడ్వొకేటు, అనంతపురము.
26 ,, ఐ. ఓబయ్యగారు యం. యల్. సి. కంబదూరు.
27 ,, ఎగవీధి చితంబరరెడ్డిగారు, పెడబల్లి.పి.ఓ.పెనుకొండ తా॥
28 ,, శెట్టి కొండయ్యగారు, పాతూరు, అనంతపురము.
29 ,, ఒ. నరసింహులుగారు గంగవరము డి. కో-ఆపరేటివు సొసైటి, అనంతపురము.
30, , శారదాపుత్ర. విద్వాన్ పి. వెంకటరెడ్డిగారు, ప్రొద్దుటూరు.
31 ,, పల్లెం వెంకటేశ్వరులుగారు, ధర్మవరము.
32 ,, తిప్పేస్వామి, వలస పంచాయతీసర్పంచు-మడకశిర తా॥
33 ,, పి.బసవరాజు, హాలుకూరు ,, — ,,
34 ,, జి. కె. సత్యనారాయణరావు, విద్వాన్, పరిగి
35 ,, యస్. రాజన్నకవి, ప్రొద్దుటూరు.

అభిమానులు రూ 10/— సమర్పించినవారు

1 శ్రీ జి. పాండురంగయ్యగారు, కల్లూరు, హిందూపురం తా॥
2 ,, వి. విశ్వరూపాచారిగారు, ,, ,,
3 ,, విశ్వబ్రాహ్మణ హెచ్. శంకరాచారిగారు, నగరిగెరె.
4 ,, యస్ యస్. రామకృష్ణయ్యగారు. కడప.
5 ,, మద్దూరు శ్రీనివాసరావుగారు, రాజమండ్రి.
6 ,, భాస్కర్ అండ్ కంపెనీ, కల్లూరు ఆర్. ఎస్.
7 ,, కె. బి. ప్రాణేశరావు, సూపర్వైజరు, హిందూపురము
8 ,, తూమాటి దొణప్పగారు. యం. ఏ. వాత్తేరు.
9 ,, వి. పి. హనుమంతరావుగారు, గ్రామసేవామందిరము.
10 ,, యం. అనంతనారాయణ శాస్త్రిగారి కుమారుడు శ్రీరఘునాథబాబు, రెసిడెన్షియల్ స్కూలు, సేవామందిరం.
11 ,, వై. సదాశివన్‌గారు. హెచ్. యం. పరిషత్ హైస్కూలు సేవామందిరము.

ఆలనాటి ఆంధ్రభోజుడు-కళాపోషకుడు-మూరురాయరగండడు శ్రీకృష్ణదేవరాయలు



రాయలసీమ కవులపాలిటి కల్పతరువు.
జననము:- క్రీ. శ 1489వ ప్రాంత్యము-నిర్యాణం:- క్రీ. శ 1529వ ప్రాంత్యము
ఇరవై సంవత్సరాలు ఏకచ్ఛత్రాధిపతిగా విజయనగర సామ్రాజ్యమేలిన
మూరురాయరగండడు.

# శ్రీ రాయలకీర్తి

కవిభూషణ—కవితిలక
శ్రీ కల్లూరు అహోబలరావు.



గీ. పలుకు చున్నావు చిత్రమౌ — ప్రతిమలందు
కులుకు చున్నావు నాట్యకోమలులనడుమ
తళుకు గొన్నావు రమ్యదేవళములందు
తేజ ముప్పొంగ శ్రీ కృష్ణ దేవరాయ!

౨

గీ. ఎందు నున్నాడవోగాని — ఎట్టయెదుట
నున్నవాని చందంబు, నేడున్నవాఁడ
వౌర! నీశిల్పికళల, మహాద్భుతంబు
తెలియగా నౌనె? శ్రీ కృష్ణదేవరాయ!

౩

గీ. సంస్కృతాంబను దరిజేర్చి — సలలితముగ
కన్నడ, వధూటిఁబ్రేమించి — గారవమున
ద్రావిడాంగన, ముద్దాడి, రక్తిమెఱయ
ఆంధ్రి రమణిని పరిణయ — మందినావు

౪

గీ. దేశ బాసలందు — తెలుగు తేటగ్రహించి
తెలుగు వెన్నఁదిన్న — దేవరాయ!
చవులెటింగి, కవిత - సారంబు గొంటివి
కృష్ణదేవుడీవె — కృష్ణరాయ!

# విషయసూచిక.



పేజి నంబర్లు.





రావుసాహేబ్

# శ్రీ మరూరు లక్ష్మీనరసప్పగారు, యం. ఎ.,

జననము: **16 – 9—1882** నిర్యాణము: **3—4—1956**

తల్లి: శ్రీమతి లక్ష్మమ్మ

తండ్రి: కరణం శ్రీ మరూరు నరసింహప్ప

మతము, కులము:— బ్రాహ్మణ—నందవరీక, శ్రీవత్సస గోత్రులు.

జన్మస్థలము:— అనంతపురం జిల్లా॥ తాలూకా॥ మరూరు గ్రామము.

వీరు అతి పేదకుటుంబమున జన్మించిరి. మేనమామల సహాయముతో మద్రాసు క్రిశ్చియన్ కళాశాలలో పట్టభద్రులైరి. తరువాత ఉద్యోగముచేయుచు చరిత్రలో యం. ఎ., పట్టము తీసుకొనిరి. వీరికి కీ॥ శే॥ కట్టమంచి రామలింగారెడ్డిగారు సహాధ్యాయులు.

తొలుత రూ. 4½ లతో ప్రభుత్వ ఉద్యోగమును ప్రారంభించి, 1937 వరకు డిప్యూటి కలెక్టరు పదవిని నిర్వహించిరి. 1927లో భద్రాచలమునందు ఉద్యోగము చేయునప్పుడు వీరికి శ్రీ భద్రాద్రి రాముని కృప కలిగినది.

వీరి మాతా పితృభక్తి కడుప్రశంసింపదగినది. జీవితములో చేతనైనంతవరకు సహాయపడుటయే తమ జీవిత ధ్యేయముగా పెట్టుకొన్నవారు. వీరు రామాయణములోని పాత్రల విశిష్టతను వారు ఆదర్శముగా నుంచుకొని ఆచరణలో పెట్టెడివారు. తమకున్న యధికారమునంతయు ప్రజాసేవకే వినియోగించి ప్రజల హృద

యములను చూరగొనిరి. అప్పటి ప్రభుత్వము వారిగణనీయ సేవలను గుర్తించి " రావు సాహేబ్ " అను బిరుదమును ప్రసాదించి గౌరవించినది.

కవిగారికి తెనుగుభారతమన్న ప్రీతిమెండు. భారతమును క్షుణ్ణముగా చదివిగ్రహించిన మేధావులు. తెనుగుభారతమును గద్య రూపమున రచించిరి. ఇంగ్లీషులో బైబిల్ శైలియందు ఆసక్తి ఎక్కువ. అందువలననే వారు ఆశైలిలోనే ఆంగ్లమున 'శ్రీకృష్ణ చరిత్రము'ను సులభ పోకడలో వ్రాసిరి. పై రెండు గ్రంథములు అచ్చుకాలేకపోయినవి.

భద్రాచల శ్రీరాములవారి ప్రేరణతో రామాయణగాథను సామాన్యప్రజల కందుబాటులో నుండునటుల సులభశైలిలో తేట గీతములతో వ్రాయసంకల్పించి 'సులభరామాయణము' ను 5365 గీతములతో ముగించిరి.

ఈగ్రంథపు వ్రాతప్రతి చాలానాళ్ళవరకు తమవద్దనే యున్నట్లు బళ్ళారిలోని కీ॥ శే॥ భాస్కరాచార్య రామచంద్రస్వామిగారు వ్రాసుకొన్నారు. ఆగ్రంథమును శ్రీ అ॥ దొరస్వామి నాయుడుగారు (పోలీసు సబ్ఇన్‌స్పెక్టరు) అనంతపురం పోలీసుక్లబ్బులోవచ్చి పోయెడివారికి తలదిండుగ నుపయోగించుచుండినట్లును, ఒకనాడు దానిని తెరచిచూచి పద్యములతో నుండుట తెలిసి రామచంద్రస్వామి గారికి సమర్పించినట్లు తెలియుచున్నది. రామచంద్రస్వామిగారు ఆగ్రంథకర్తనుగూర్చి, గ్రంథమునుగూర్చి తెలుసుకొనవలెనని ఎంతగానో ప్రయత్నించిరి, కాని అంతు చిక్కలేదట.

గ్రంథకర్తగారు జీవించియున్నప్పుడే అరణ్యకాండమువరకు ముద్రింపబడెననియు, కారణాంతరములవల్ల అది ప్రజల మధ్యకు రాలేక పోయినదని కవిగారికుమారులైన శ్రీ నరసింహభారతిగారు తెలియజేసిరి. వారు ప్రస్తుతము హైదరాబాదులోనున్నారు. సులభ రామాయణమును పునర్ముద్రించు ప్రయత్నములో వారున్నారు. అది ఆంధ్రుల భాగ్యవిశేషమే.

సులభరామాయణమునందలి ఉపోద్ఘాతములో కవిగారిట్లు చెప్పుకొన్నారు.

సంస్కృతమునేర్వ, నాంధ్రభాషను నఖండ
పాండితి గడింప, యతిగణ ప్రాసలక్ష
ణముల శోధింప, వ్యాకరణముమథింపఁ
బదము లల్లుట నాకనభ్యస్తవిద్య॥

ప్రథితిగాంచిన మాతండ్రి రామభక్తి
అనయమునునాదు మదినుండు హనుమకరుణ
భద్రగిరివాసుఁడగు రామభద్రుకృపయు
సాయపడుగాత నావ్యవసాయమునకు ॥

సులభరామాయణములో ఉత్తరకాండకూడా చేర్చబడినది. బాలకాండలో 427 తేటగీతలు; అయోధ్యాకాండలో 1407, అరణ్యకాండలో 507, కిష్కింధాకాండములో 587, సుందరకాండములో 750, యుద్ధకాండలో 1278, ఉత్తరకాండలో 409, తేటగీతములు కలవు. మొత్తము 5365. మచ్చుకు బాలకాండలోని తేటగీతము నొకదానిని పాడుకొందము.

నిత్యజలసిక్త సుమతరు నిచయముక్త
మందమారుతకవిత సమ్యగ్విభక్త
రాజసామంత పణ్యమార్గములు బాంథ
వేదనాపనోదన రమ్యవేదికలును.

బాలకాండములోని గద్యమున కవిగారిట్లు వ్రాసుకొన్నారు. 'ఇది శ్రీమదచలాత్మజారమణ,చరణసేవానిరత హృదయుండును, నందవరీకవంశ, శ్రీవత్సగోత్ర సంభవుండును నగు మరూరు నరసింహప్ప కుమారుడు రావుసాహెబు మరూరు లక్ష్మినరసప్పచే రచింపబడిన సులభరామాయణంబున బాలకాండ'

మట్టిలోని మాణిక్యాలవలె రాయలసీమలో నిట్టి యజ్ఞాతకవులు పెక్కుమందివున్నారు. వారిగ్రంథములు మరుగునపడి క్రిమికీటకాదుల పాలగుచున్నవి. తెరచిచూచు ఓపికయు వెలుగులోనికి దెచ్చు సామర్థ్యములేని వారుగనున్నారు మనసీమవారు. వావిలికొలను వారివలే వీరునూ రామభక్తి పరాయణులు. నిరాడంబరులు, నిగర్వులు. వారికిని వీరికిని దగ్గర పోలికలున్నవనుటలో అతిశయోక్తి లేదు.

వీరికి కీ॥ శే॥ ఆడిపూడి సోమనాథరావు, కీ॥ శే॥ కాశీకృష్ణమాచార్యులు శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగార్లతో అత్యంత సన్నిహితముకలదు. అరుణాచలంలోని గుడిపాటి వెంకటాచలంగారికి వీరు ప్రీతిపాత్రులు.

కవిశేఖరులు కర్నూలులో తమ 74వ ఏట దివంగతులైరి.

సాహిత్య రత్నాకర-విద్వత్కవి కులతిలక—అభినవపోతనామాత్య.

# ఆంధ్రకంబర్ శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డి.

జననము: 5—4—1892 నిర్యాణము: 8—11—1971

తల్లి:— శ్రీమతి లక్ష్మమ్మ.
తండ్రి:— శ్రీ పెద్దబుచ్చిరెడి.
మతము, కులము: హిందూ—పాకనాటిరెడ్లు
జన్మస్థలము: చిత్తూరు జిల్లా—పూతలపట్టు గ్రామము.

రాయలసీమ జిల్లాలలో కన్నడ, తమిళ, ఉర్దూ, భాషలతో పరిచయమున్న కవులనేకులున్నారు. ఆయాభాషా రాష్ట్రాలనానుకుని వున్న జిల్లాల సరిహద్దు ప్రాంతాలలోని ప్రజానీకానికి తెలుగు కాకుండా తదితర భాషలతోను పరిచయమబ్బి యుండుట సహజ విషయమే. అనంతపురం జిల్లా వారికి కర్ణాటక భాషతో పరిచయం కలదు. చిత్తూరు జిల్లా వారికి తమిళంతో స్నేహం ఏర్పడినది. పూర్వపు నవాబుపరిపాలన ప్రాంతమై, ఆంధ్ర రాష్ట్రమునకు రాజధానిగా వ్యవహరింపబడిన కర్నూలుకు ఉర్దూ భాషతో కొంత సఖ్యముచేకూరినది. అనంతపురం జిల్లా కవులెందరో కర్ణాటక సాహిత్య సౌరభాలను తెనుగువారికి అందివ్వగల్గిరి. అట్లే తెనుగు సాహిత్య కుసుమాలు కన్నడ సాహితీ ప్రాంగణంలో పరిమళించినవికూడా.

తమిళ సాహిత్య విశేషాలనుకూడా మన సీమకవులెరిగి వుండుట మన పుణ్యవిశేషమే. చిత్తూరు జిల్లా తమిళ ప్రాంతంతో ముడిపడినది. ఆసరిహద్దు ప్రాంతంలో తెనుగు, తమిళ సాహిత్య మలయమారుతము వీచినది. తమిళ సారస్వత సాగరమందలి

రత్నములను సేకరించి సోదరాంధ్రులకు నెఱచూఅలిచ్చిన కవి పుంగవులు చిత్తూరు జిల్లాలో పెక్కుమంది కలరు. అట్టివారిలో తమిళ 'కంబమహాకవి' రచించిన 'కంబరామాయణము ను తెనుగు వారి కందించిన ' ఆంధ్రకంబర్ ' శ్రీపూతలపట్టు శ్రీరాములురెడ్డి గారొకరు.

కవిగారు రెడ్ల వంశమునకు చెందినవారు. వీరి తండ్రిగారికి చాలాకాలమువరకు సంతానము కలుగలేదు. అందుచే కవిగారి తండ్రి శ్రీ పెద్దబుచ్చిరెడ్డి శ్రీ వేంకటేశ్వరస్వామి కోవెల కట్టించి సేవచేసిరి. తరువాత కొన్నినాళ్ళకు ఇద్దరు కుమార్తెలుదయించిరి. కాని కుమారుడు పుట్టలేదను కొరత ఆదంపతులకు పోలేదు. వారు స్వగ్రామమగు పూతలపట్టునందు ' శ్రీరామచంద్రున కు దేవాలయము కట్టించిరి. శ్రీరాముని భక్తితో అహర్నిశము ప్రార్థించిరి. అకృపామూర్తి ఆ పుణ్యదంపతులకు శ్రీరామనవమి పుణ్యదినమున ఒక మగబిడ్డను ప్రసాదించెను. వారే శ్రీరాములురెడ్డిగారు, వీరు జ్యేష్ఠ పుత్రులు. తరువాత వారికి ఇద్దరు తమ్ములుకల్గిరి. ఒకరు విద్వాన్ బాలకృష్ణారెడ్డిగారు, మరియొకరు శ్రీమునిరత్నంరెడ్డిగారు.

కవిగారు ప్రాథమిక పాఠశాలలో పఠించినను, స్వయం కృషిచే ఆంధ్ర, తమిళ, సంస్కృత సారస్వతములు, స్వాయత్తము చేసుకొని విశ్వవిద్యాలయ విద్వత్పరీక్షలో నుత్తీర్ణులై, ఆంధ్ర పండిత పదవిని నిర్వహించిరి. బహుపద్య, గద్యకావ్య ప్రణీతులైరి. అసమానమైన బోధనాపాటవము చేతనేగాక, అప్రతిమాన శీలసంపదచేకూడ శిష్యులను ఆనందోపదేశముల సంతృప్తిపఱచిరి.

కవిగారికి ' కట్టమంచి ' రెడ్లతోను, పొలకలరెడ్డి వంశము

వారితోను రక్తసంబంధముకలదు. శ్రీరాములురెడ్డిగారికి నలుగురు కుమార్తెలు. మగసంతతి వీరికిలేదు.

రెడ్డిగారి తండ్రిగారు హరికథలను చెప్పెడివారగుటచే ఆ పాండిత్య ప్రకర్ష కుమారునకు సహితము అబ్బుటకు వీలైనది. పెక్కుకావ్యకర్తలైన వీరు 'కంబరామాయణము' తో ఆంధ్ర దేశమున గొప్పపేరు ప్రతిష్ఠలను సంపాదించుకొనిరి. ఎన్నియో ఘనసన్మానములుపొందిరి. వీరిని 'విద్వత్కవికులతిలక' 'సాహిత్య రత్నాకర' కవితాతపస్వి'–అభినవపోతనామాత్య–మహాకవి–ఆంధ్ర కంబర్ అను బిరుద సత్కారములతో తెనుగు దేశము నీరాజనము పట్టినది. పూతలపట్టు గ్రామములో పల్లకి ఊరేగింపు జరుపుకొనిరి. 'ఆంధ్రనలంద' గుడివాడ వారిచే బంగారు పతకముపొందిరి. తమిళనాడు 'కారక్కుడి'లో జరిగిన కంబకవి వార్షికోత్సవములో కనకాభిషేకము పొందిరి.

1953లో కళాపరిషత్తుకు కవిగారు అధ్యక్షులుగా వ్యవహరించిరి. తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమువారు వీరిని సెనేట్ సభ్యులుగా గౌరవించిరి. హైదరాబాదు ఆంధ్ర సాహిత్య అకాడమీ సభ్యులుగా వ్యవహరించిరి.

రాష్ట్రపతిచే మంజూరు చేయబడిన గౌరవ వేతనమును వీరు జీవితాంతము అందుకొన్నారు.

సా హి త్య వి శే ష ము లు: కృ తు లు.

---

కవిగారు అరవమునుండి ఈక్రింది ప్రసిద్ధ కావ్యములను వదించిరి. 1) కంబరామాయణము (2 సంపుటాలు) 2) నాలడి

యారు 3) పెరియ పురాణము 4) శిలప్పదికారము 5) మణి మేఖల 6) సూక్తిసుధ 7) తెనుగు సందేశము 8) త్రివర్గము 9) నీతిగుచ్ఛము.

సంస్కృతమునుండి తెలుగులోనికి 1) కుమారసంభవము 2) ప్రశ్నోత్తర రత్నావళి, గ్రంథములనువదించిరి. ఇవియేకాక పదునైదుకు పైబడిన గద్యగ్రంథములు వీరు రచించిరి.

'శిలప్పదికారం' ను తెనుగులో 'అందియకత'గా కవిగారు తెనుగించిరి. దీనిని 1957వ సం॥లో తిరుమల తిరుపతి దేవస్థానము వారు ప్రకటించిరి.

తమిళము నందలి ప్రసిద్ధ గ్రంథములైన 'మణిమేఖల' 'శిలప్పదికారము'లను తెనుగింపవలసినదిగా కవివరేణ్యులగు శ్రీకట్ట మంచి రామలింగారెడ్డిగారు సూచించి, అందందు అనుసరింపదలచిన విధానములనుకూడా సెలవిచ్చి ప్రోత్సహించిరి. వారి యాజ్ఞను శిరసావహించి రెండు ప్రకరణములు ముగించిరి. మూడవ ప్రకరణము వ్రాయు చున్నతఱి, కట్టమంచివారు దివంగతులైరి. అంతటితో 7, 8 నెలలు ఆకార్యము ఆగినది. తరువాత వారి యాత్మకు తృప్తిని కలిగించుటకై ఆ కార్యమును కవిగారు ముగించిరి.

ఇది ద్రవిడ వాఙ్మయమున శిరోరత్నమగు మహాకావ్యము. ఇందు కథకంటే ఆకాలమందలి సంగీతమునకు, జైత్రి జాతీయ నటనములకు ప్రాముఖ్య మివ్వబడినది. అందలి కథావస్తువు సంక్షిప్తముగానిది.

చోళరాజ్య రాజధాని 'సంగమ' పట్టణము. అందు 'కోవలుడు'

ఒక వణిజుడు. అతడు 'మాధవి' యను వేశ్యాంగనకు వశుడైనాడు. దానితో సమస్త సంపదలు కోల్పోయి ధర్మపత్ని 'కన్నగి' తో కూడి దేశాంతరముల కేగినాడు. తిరిగి తిరిగి పాండ్యరాజు ముఖ్య పట్టణమైన 'మధుర' లో ప్రవేశించిరి. జీవయాత్ర సాగుట దుర్లభమైన స్థితిలో భార్య పైడి కాలియంది యను ఒక కంసాలివానికి కోవలుడు అమ్ముటకు ప్రయత్నించెను. కంసాలి దానిని చూచి అనుమానించి, విషయమును ప్రభువుకు నివేదించెను. మున్నప హృతమైన, మహోమ్మాల్యమౌ పాదకటకమొక్క అన్యుని చెంత యుండుట ఆరాజు సహించలేక వెనుకముందాలోచించక కోవలుని శిరచ్ఛేదమొనర్చి, అందియ నొసపరచుకొనెను.

కోవలుని భార్య కన్నగి తన భర్త కళేబరము చూచి తల్లడిల్లి కన్నీరు మున్నీరుగానేడ్చి భీకరాకృతిధాల్చి రోషాగ్నులు వెదజల్లుచూ యిట్లు ఘోరవాక్కులు పలికినది.

---

---

" రాజుతో నీ మధు – రానగరమ్ము
బూదిగావింతునో – పౌలతిరో! నీవు
నరయుడుగాకని – యారాచనగరు
వీడి, వెలికివచ్చి – వీటఁగలట్టి
మానవులార!, యమరవరులాఁ!
మునులార! నాపంతమును వినుఁడీరు
నామనోహరుజంపు – భూమీశుపురము
పైగిన్కఁబూనితి – బాపమ్ముగాదు
కాంచుఁడీయని – కుడికరమున నెడమ
స్తనమును వడివైచి – చలమున లాగి

కేలెత్తిపురిఁ బ్రదక్షిణముగాదిరిగె
విసరివైచుచు,నది — విలయాగ్నికరణి
విచ్చలవిడిరేగి — విన్నంటఁబెరిగె
..... ...... ...... ...... ...... — మున్నర్జునుండు
ఖాండవమ్మునుగాల్చు — కాలాన బోలె
గలతనొందగ, ధార్మికులును, విద్వరులు
గల కడకేగక — చలపట్టి నట్లు
పాపులు, నీచులు — పరగు వీథులను
జ్వాలలు, చెలరేగ, బసులును వాని
దూడలు, ధర్మబుద్ధులుగల గొల్ల
వాడలఁజేరెను; ...... ...... ...... ......
దన భర్తఁగాంచఁ జాలని చింతచేత
మగువ మండి, కొలిమిమాడ్కి, నిట్టూర్పు
వడినూర్చి వీదుల — నుడివడ తిరుగుఁ
దిరిగి, సంతాపించుఁ దిరిగి తపించి
వేదన నొందుచు — వెగచుచుఁగోప
మాఱక కుందు — నయ్యతివకు నెదుట
నుజ్జ్వల జ్వాలల — నుడికి తపించి
సైఁపఁజాలక, మధురాపుర దేవి
కనులకు నయ్యెడ — గానంగవచ్చె.

మధురాపురి కరుణా కటాక్షముచే కన్నగి విభుని అమర రూపమున గాంచెను. ఇంద్రుడు ఆ పుణ్యదంపతుల కింద్ర లోక ప్రాప్తిగావించెను.

## కంబరామాయణము

శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు 1951లో కంబరామాయణమును గురించి ఇట్లు వ్రాసిరి.

"శ్రీరాములురెడ్డి పరివర్తనము సంస్కృతమునుండి కావింపబడు పరివర్తనము కంటె చాలకష్టమైనది. సంస్కృతవృత్తములును, అందలి పదములను మార్పులేకయు, కొంతమార్పుచేసియు మన సాహిత్యమునందు కవులు ప్రవేశపెట్టుట సులభమైనవి. అరవ ముతో ఛందః పద్ధతిభిన్నము. వారి సాహిత్యములోని భాషయు, ప్రకృతి ప్రత్యయ, సంబంధములునువేఱు, అట్లే ఎరవలితెచ్చిపెట్టు కొనుటకు సాధ్యముకాదు. ఇక్కడ నిజమైన పరివర్తనక్రియ ఆవశ్యకము. అట్లట్లే మార్పులేక వినియోగింపజాలము. కాబట్టి ఇది నిజమైన భాషాంతరీకరణము. సుగమమైన పనికాదు. దుర్గ మము. దుస్తరము.

ఇట్టి యీ క్లిష్టకళను ఎంతచక్కగా అనాయాసమని తోపిం చునట్లు. శ్రీరాములురెడ్డి చేసియున్నాడు. అది ఉభయ భాషా వేత్తలకుగాక, ఇతరులకు సంపూర్ణముగా, విదితముకాదు"

కంబరామాయణములోని సొబగును కొంత పరిశీలింతము.

సీ. కనులతోనే ప్రేమ — యను వస్తురూపంబు
గాంతముగాక — యో కాంతలార!
ఈనాతి జన్మంబు — చే, నొందదగు ఫలం
బీనాడె కందమో — యింతులార!
రాతికిఁదొలిరూపు — రమణిఁ గావించిన
పదములఁజూతమో — పడతులార!
కడు బరువైనశ్రీ — కంతు విల్వ్రాఁచిన,
కరము లీక్షింతమో — కలికులార!

గీ. అనుచు, నీటి యొద్దడినొచ్చు — హరిణచయము
విమల జల పూరముం గన్న — విధిని పల్ల

మునకుఁబాఱు జలముఁబోలి — మనసు పఱవఁ
బటఁబరుగిడు చందాన — బరుగులిడిరి.

మ. చిగురుం బ డులు, రాముపై విరులు వర్షింపంగఁ గందర్పుఁడా
పగిదిన్ వారలమీద బుష్పశరముల్ — వర్షింప నొక్క ర్తనున్
జగతీనాథుని చండశాసనము — నీ శ్యామాంగు చిత్తోన్నతిన్
దగవున్ నేరత భీతనేత్రలకు — బాధం గూర్చు వీడెవ్వడే?

కం. హరిణాక్షి యోర్తు యాసయ
నరునకు నీ లక్షణములు । నలువొందునె? శ్రీ
వరు డితడు నిక్కమియ్యది
యరయఁగలరు కన్నులార ననియెఁ జెలులతో

ఆ. వాలు గంటి యొకత — పూలపానుపుఁజేరి
పిడుగు మోత విన్న — పడఁగ దారి
చూడ్కి, మిట్ట మిఱుకు చన్నులుచెమరింప
బుద్ధి చెడఁగ, నూర్పు — పుచ్చుచుండె

* * * * *

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ,

## డాక్టర్ శ్రీ చిలుకూరు నారాయణరావు, M. A., Phd.,

జననము: 1890 నిర్యాణము: 1952

డాక్టరు శ్రీ చిలుకూరు నారాయణరావుగారు 1890 వ సంవత్సరమున విశాఖపట్టణ మండలములోని పొందూరు దగ్గఱనున్న 'ఆనందపురము'న జన్మించిరి. వీరు చాలకాలము రాయలసీమలోనే నివసించిరి. అనంతపురము'న ఆర్ట్సు కళాశాలలో పని చేసిరి.

'పర్లాకిమిడి' కళాశాలలోను, విజయనగరము మహారాజ కళాశాలలోను రావుగారు ఆంగ్ల విద్యాభ్యాసము నొనరించిరి. మద్రాసు విశ్వవిద్యాలయములో తెలుగు, కన్నడములలోఁ బట్టభద్రమును పొందిరి. 11వ శతాబ్దములోని తెలుగు రచనను గూర్చి రావుగారు పరిశోధించి ప్రకటించిరి. 'Doctor of Philosophy' అను బిరుదుపొందిరి. చిన్నప్పటినుండియు రావుగారికి భాషాసారస్వత చరిత్ర పరిశోధన యన్న చాల ఆసక్తి. వ్యవసాయము మీద రావుగారికి మక్కువమెండు. నూతన వ్యవసాయ పరిశోధనపు పోటీలో వీరికి బహుమానముగా బంగారు పతకము లభించెను. Inspector of Schools గా వీరు కొంతకాలము పనిచేసిరి.

తరువాత అనంతపురము కళాశాలలో ఆచార్యత్వము వహించిరి. మద్రాసు, మైసూరు ఉస్మానియా విశ్వవిద్యాలయముల యందు వీరు సభ్యులుగానుండి గౌరవములపొందిరి. 'ఆంధ్రఇతిహాస పరిశోధక' మండలికి వీరధ్యక్షులుగానుండి, కొన్నివందల తాళపత్ర గ్రంథములను సేకరించిరి. శిలాతామ్ర శాసనములు, నాణెములు సేకరించిరి.

నవలలు, నాటకములు, జీవిత చరిత్రములు, భాషా చరిత్రములు, పద్యకావ్యములు, గేయములు మొదలైనవి శతాధికములుగా వ్రాసిరి. ఉపనిషత్తులు, భగవద్గీత, అథర్వణ వేదము తెలుగులో వ్రాసిరి. కురానుషరీఫు, జెండావెస్తా, ఉమర్ ఖయ్యూము (ముత్యాల సరములు)అంబ నాటకము (మొండి శిఖండి) మొదలగునవి వ్రాసిరి.

శ్రీ రావుగారు వాఙ్మయ తపస్వి, సారస్వతయాజి. వాఙ్మయ ద్వారమున దేశారాధనము, ఈశ్వర సేవ సాగించిన మహాయశుడు.

ఆకారమున దర్భపుల్లవలె సన్నగానుండెడివారు. ఒక కన్ను కొంచెముమెల్ల.

బ్రిటిష్ దొరతనమువారు, వీరికృషిని గుర్తించి 1947లో 'మహామహోపాధ్యాయ' బిరుదమునిచ్చిరి. 'ఆంధ్రబెర్నార్డుషా' అను బిరుదుకూడా వీరికి గలదు.

"మహానటుని మయూర నృత్యము" అనుపేరితో, కాశీలో జరిగిన అఖిలభారత రచయితల మహాసభలో, నాటువుగా నొక గేయమును రావుగారు పాడిరి. ఆ గేయములోని ఆవేశము నవీన కవులలో, నందఱికిని లభింపని యావేశము. వీరు వ్యావహారిక భాషావాదులు.

'ఉమర్ ఖయ్యూము' ఒక పారసీక కవి. ఈకవి 'రుబాయత్' అను పద్యములను వ్రాసిరి. ఈ పద్యములు అనేక భాషలలోనికి పరివర్తితములైనవి. వీనిలోని 101 పద్యములకు 'Fitz Genald అను ఆంగ్లేయకవి ఇంగ్లీషు పద్యములను వ్రాసెను.

పై 'రుబాయత్' పద్యములను శ్రీరావుగారు షట్పదులలో వ్రాసి ప్రకటించిరి. వాటికి 'ముత్యాలసరములు' అనిపేరిడిరి. 101 షట్పదులలో మచ్చుకు మూడు పేర్కొనెదము.

నరకమున యమబాధలంట – నరన సుఖమంట స్వర్గమందున
నరయజాలని దెల్ల–బూటక మొకటె–సత్యమగుణా
నరులకీ జీవంబు గ్రుక్కెడు – నరదుకాదు గుటుక్కుమనుఁజుమి
విరియబాఱిన పువ్వు మఱలను మొగ్గ యెట్లగుణా?
తెరనువైచెను, తోలుబొమ్మలఁ బఱచి యాడింపంగ దొడగెను
త్వరగ నొక్కటి యొక్కటే కొని – తీయగాఁదొడఁగెన్

పరమ మాంత్రికుఁడతఁడు బొమ్మలఁ బఱచి యాడఁగఁజేసె
మనలను। కరమునను దీపంబు బట్టి – విచిత్ర గతు లొప్పన్.
ఉత్తనేనా, నన్నుజేయఁగ మెత్తనైన బంకమట్టిని
మెత్తియీరూపంబు నిచ్చెను కుంభకారుండు?
ఎత్తి వేసిన బ్రద్ద లౌదును – ఉత్తమన్నైమంటఁగలసెద
నిత్తెఱగె మన యందఱకి – నని యొక్క కుండ యనెౕ
("ముత్యాలసరములు"నుండి)

---

'కళాప్రపూర్ణ'

## డాక్టర్ శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి, M.A., [Cantab] D.Lt.

జననము: 10—12—1880 నిర్యాణము: 24—2—1951

తల్లి:— శ్రీమతి నారాయణమ్మ తండ్రి:—శ్రీసుబ్రహ్మణ్యరెడ్డి

జన్మస్థలము: చిత్తూరు జిల్లాలోని 'కట్టమంచి' గ్రామము.

శ్రీ రామలింగారెడ్డి గారిది పండితవంశము. సంస్కృతాంధ్ర, ఆంగ్ల జ్యోతిశ్శాస్త్రములందు వీరి వంశీకులు దిట్టలు, ఉద్దండ పండితులు. రామలింగారెడ్డి ముత్తాతగారైన శ్రీ పెద్దరామలింగా రెడ్డిగారు సుప్రసిద్ధమైన 'భాస్కర శతక' కర్తలు. తండ్రిగారాంగ్ల విద్య నభ్యసించి 'భాషాజ్ఞాన పరీక్ష'లో కృతార్థులైరి. మరింతకృషి సలిపి న్యాయవాద విద్య నభ్యసించిరి.

'భాగవతసార ముక్తావళి'—'భారతసార రత్నావళి' యను రెండు గ్రంథములను రచించి సాహిత్య వేత్తలుగా ప్రసిద్ధి నొందిరి. అట్టి మేధావుల వంశ పరంపరలో వచ్చిన రామలింగారెడ్డి బుద్ధికుశలత

చిన్నతనమునుండియే వికసించినది. నూరుకథలను తన పదిపన్నెం డేండ్ల చిన్నిబుఱ్ఱలో దాచుకొని జెప్పగలిగిన జ్ఞాపకశక్తి అతనిది.

వీధి బడులలో విద్యాభ్యాసము ముగించి 1890 లో మొదటి ఫారంలో ప్రవేశించిరి. 'చిత్తూరుపులి' గా ప్రసిద్ధిపొందిన శ్రీ తిరువేంగడ సామినాయుడు, కుప్పనయ్యంగార్లు రెడ్డిగారి గురువులు. 1896 నాటికి మెట్రికు్యలేషన్ పూర్తిగావించి, 1897లో మద్రాసు క్రిశ్చియన్ కళాశాలలో ప్రవేశించిరి.

కళాశాలలో చదువుచున్నప్పుడే శ్రీరెడ్డిగారు కావ్యరచనకు పూనుకొన్నారు. 'ఆంధ్ర భాషాభిరంజని' సమాజమువారు కావ్య రచనలను ప్రోత్సహించే నిమిత్తమై పోటీలు నిర్వహించిరి. ఆ పోటీలలో రెడ్డిగారి 'ముసలమ్మ మరణము' ప్రథమ బహుమతిని పొందినది. ఆధునిక సాంఘిక యితివృత్తమును గైకొని నవ్య కవితాసుమములతో, విషాదాంతమైన కావ్యము వ్రాయుట యిదియే ప్రథమము. ఆ పోకడ అంతవరకూ యెవరును చేపట్టలేదు. కట్టు మంచి వారిదే ప్రథమ తాంబూలము.

'ముసలమ్మ మరణము' కావ్యములోని యితివృత్తము. అనంతపురమునకు చేరువనున్న బుక్కరాయసముద్రమను గ్రామ మున జరిగిన ఒక చారిత్రాత్మిక సంఘటన. ముసలమ్మ బసిరెడ్డి కోడలు. ఆమె సుదతీమణి. పూతచరిత. అత్తమామలను ప్రాణ ప్రదముగా చూచుకొను కోడలావిడ. అట్టిసాధ్వీమణి ప్రజలకొఱకు గంగాదేవికి బలియైనది.

ఒకసారి కురిసిన విశేష వర్షముల కాగ్రామ చెఱువు గండి పడినది. గ్రామస్థు లెన్నివిధముల ప్రయత్నించినను గండిపూడ్చుటకు

సాధ్యము కాలేదు. గంగాదేవి నరబలి కోరినది. ముసలమ్మ తానే బలి యగుదునని ముందుకు వచ్చినది. ఆ త్యాగశీలి, ఉదారచరిత్రు రాలు గండిలో కూర్చొనగానే పౌరజనులు రాళ్లు, మన్నుతో గండి పూడ్చిరి. వర్షముతగ్గినది. చెఱువు తెగుననుభయము తీరినది. ప్రజలక్షేమము కొఱకు ప్రాణములు విడిచిన వీరవనిత ముసలమ్మ పేరిట పౌరజనులు 'ముసలమ్మ కట్ట'ను ఒక స్మృతి చిహ్నముగా కట్టి ధన్యవాదములు జెప్పుకొనిరి.

రెడ్డిగారు తమరెడ్డి వంశీకులెంతటి త్యాగశీలురో తెలియ జెప్పుటకు, ముసలమ్మ వంటి పుణ్యస్త్రీల చరిత్రలడుగంటి పోకుండుటకు, రాయలసీమ చారిత్రాత్మిక విశేషములు నలుదిక్కుల చాటి చెప్పుటకు, చిరస్థాయిగ నుండు రీతి ఈ కావ్యమును లోకమున కందించి చిరస్మరణీయులైరి.

ఈ కావ్య ఉపక్రమణికలోని ఈ క్రింది పద్యములో పోతన్నగారి 'ముగురమ్మల మూలపుటమ్మ'ను రెడ్డిగారిట్లు వర్ణించిరి.

సీ. అంచ తేజీ నెక్కి యలరు సామిని జేరి
చదువుల గొంతియై చాల వెలిఁగె
జిలువల యెకిమీని సెజ్జఁ బండెడు వాని
చెలువయై, కలుముల చేడెయయ్యె
గిత్తతత్తటి రౌతు కేల్గేలఁ గీలించి
బుత్తి ముత్తుల నిచ్చు సత్తియయ్యె
ముగురు సాములకును మొదలింటి వెలుఁగయి
యట్టిట్టి దనరాని యవ్వ యయ్యె

గీ. నచల సంభూత, సదయు హృదంబుజాత
నిర్గుణోపేత ! పరిపూర్ణ — నిత్యపూత

వాఙ్మనోతీత, సుగుణ సంపత్సమేత
పార్వతీ మాత ! మదభీష్ట వరము లీత !

అత్తగారింటిలో ముసలమ్మ యెట్లు వర్తించెడిదో రెడ్డిగారతి మనోహరముగా వర్ణించిరి.

సీ. అత్తమ్మ కొంగు నన్వహము బట్టుకొని తా
తిరుగు చుండును బిడ్డ కరణి బాల;
తన వారు, పెఱవారలను భేదమే లేదు
హృదయ మన్నది యప్పుడెత్తు వెన్న;
యేవేళఁ జూచిన నెలనవ్వులే కాని
చిడిముడి పడదెంత యుడుకులున్న;
తనముద్దు మోముఁజూచినజాలు, హృదయ తా
పంబెల్ల నప్పుడె పాఱిపోవు;

గీ. నహహ! మామపైగలభక్తి, యాత్మవిభుని
మీది మక్కువ, మఱదుల మీది కూర్మి
ప్రజలమీది వాత్సల్యంబు; బ్రహ్మకైనఁ
జూప శక్యమే వేఱొక్క సుదతి యందు.

రాయలసీమ గ్రామ వాతావరణమును, కాపు స్త్రీల సౌకుమార్యమును ముగ్ధ మనోహరముగా చిత్రము వ్రాసినట్లు చిత్రించిన రసజ్ఞులు వీరు.

ముసలమ్మ 'ప్రజలమీది వాత్సల్యము' తో గంగాదేవికి బలియగుటకు సిద్ధమైనది. ఆ దృశ్య రచన ఒక వర్ణచిత్రరువును బోలియుండు ననుటలో అతిశయోక్తి లేదు.

ఈ క్రింది పద్యము జదివిని ప్రతివారికిని ఆ దృశ్యము కనుల ముందు నిలిచిపోగలదు.

సీ. కన్నెఱ్ఱ వాఱిన – ఖర కరోదయకాల
మల్లన మ్రింగు జాబిల్లి యనఁగ
జ్వాలదగ్ని శిఖలపై – నెలనవ్వుతోఁ బోవు
ధాత్రీ మహాదేవి – తనయ యనఁగ
గెందామరల బారు – సుందరమగు లీల
నల్ల నల్లనఁ జొచ్చు – నంచ యనఁగ
గాల మహాస్వర్ణ కారకుండగ్నిలో
గరగించు బంగారు – కణిక యనఁగ

గీ. బ్రళయ కాలానలప్రభా భాసురోగ్ర
రంగ దుత్తుంగ భంగ సంఘాతములకుఁ
గలక నొందక, దరహాసమలర, మంద
మంద గతిఁబోయి, చొచ్చెనమ్మగువ నీట.

తెనుగు మహాభారతము నందభిరుచిగలిగి, తిక్కన రచనా శైలిని చక్కగా ఒంట బట్టిన వారగుటచే రెడ్డిగారాయిరువది యేళ్ల వయసునకే యంత చక్కటి పద్యరచనను చేయగల్గిరి. ప్రాచీన కావ్యములకే మాత్రము తీసిపోని గంభీరత అందులో కని పించు చున్నది. వారికి ప్రజ్ఞాపాటవమునకు కొమ్ములు తిరిగిన పండి తాగ్రేసరులెల్లరు తలలూపిరి.

విద్యార్థి దశలోనే మరొక సాహస కృత్యమునుగూడా రెడ్డి గారు గావించిరి. పింగళి సూరనామాత్యుని 'కళాపూర్ణోదయము' 'ప్రభావతీ ప్రద్యుమ్నము' ఈ ప్రబంధములను విమర్శనాత్మ కముగా నధ్యయనముచేసి, 'కవిత్వతత్త్వవిచార' మను విమర్శ నాగ్రంథమును వెలువరించిరి. వేమనయోగి నిర్భయముగ సంఘము లోని దురన్యాయములను విమర్శించుటచే రెడ్డిగారి కభిమాన పాత్రు

దైనాడు. అట్లే అతడుకూడా సూటిగా నిర్భయముగా కావ్య విమర్శలు గావించి, 'విమర్శలో విప్లవము'ను తెచ్చి 'విమర్శ కాగ్రేసర చక్రవర్తి'గా కీర్తి తెచ్చుకొన్నాడు.

1901లో మద్రాసు విశ్వవిద్యాలయములో రెడ్డిగారు పట్టభద్రులై 1906లో ఆంగ్లదేశమందలి కేంబ్రిడ్జిలోని 'సెయింట్ జోన్సు' కళాశాలలో ప్రవేశించిరి. 1907లో యం. ఎ. (చారిత్రాత్మక విషయమున) ప్రథమ శ్రేణిలో నుత్తీర్ణతజెందిరి.

భారత దేశమునకు తిరిగివచ్చిన వెంటనే బరోడా మహారాజుగారు రెడ్డిగారి నాహ్వానించి, బరోడా కళాశాలలో వైసుప్రిన్సిపాల్ పదవి నిచ్చిరి. 1909లో మైసూరు మహారాజా వారి కాలేజిలో ప్రొఫెసర్‌గా పనిచేసిరి. మైసూరు యువరాజా వారితోకలసి విశ్వవిద్యాలయ విద్యా విధానము తెలిసికొనుటకై యూరపు, కెనడా, జపాన్, హాంకాంగ్ మొదలగు విదేశములన్నియు తిరిగివచ్చిరి.

అప్పటికాంధ్రులకొక ప్రత్యేక విశ్వ విద్యాలయములేదు. దానిని గుర్తించిన శ్రీరెడ్డిగారు తీవ్ర కృషిచేసి 1926వ సంవత్సరం ఏప్రిల్ 26వ తేదీన విజయవాడలో 'ఆంధ్ర విశ్వవిద్యాలయము'ను తొలుత ప్రారంభింప జేసిరి. ఆయన గారి బహుముఖ కృషిఫలితముగానే ఆంధ్రులకు విశ్వవిద్యాలయ మొకటేర్పడ గలిగినది. ఆంధ్రలోకమంతయూ వారికి ఋణపడి యున్నది.

రెడ్డిగారి ప్రతిభ దేనిలో తక్కువైనది? వారు చేయని ఘన కార్యములేదు. అలంకరించని పదవులులేవు ఆయన స్వతహాగాకవి. విమర్శకావతంసుడు, గొప్పవక్త, సర్వశాస్త్ర రహస్యములెఱింగిన సహృదయుడు. సారస్వత పట్టభద్రుడు. వీరి 'అర్థశాస్త్ర' రచనకు

మద్రాసు విశ్వ విద్యాలయము 1913లో బహుమతి నొసంగినది. ఆంధ్ర విశ్వ విద్యాలయము 'Doctor of Literature' బిరుదిచ్చినది. 10-12-1940లో వీరు షష్టిపూర్తి చేసుకొనిరి.

## రామలింగారెడ్డిగారి రచనలు

1) ముసలమ్మ మరణము 2) నవయామిని 3) అర్థిక శాస్త్రము 4) కవిత్వతత్త్వవిచారము 5) భారత విమర్శనము 6) వ్యాసమంజరి (5 ఖండములు) 7) ముత్యాలసరములు 8) దేవీ భాగవతము 9) పరిహాసనములు 10) ప్రతాపరుద్రీయము 11) కీ. శే. కట్టమంచి సుబ్రహ్మణ్యరెడ్డిగారి సంక్షేప చరిత్రము. 12) పంచమి 13) Speeches on University reforms 14) Congress in Office 15) Democracy in Contemporary India 16) Article on R. T. C.

శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ యంతటివారు 'నాకుపటి గురువు కట్టమంచివారు. నాకు నావలె ఎందరికో తెలుగు భాషతము నందభిరుచిని, అభిమానమును కల్గించిన పుణ్యము మనరెడ్డిదే' అనిముక్తకంఠముతో చెప్పుకొనిరి.

ఇట్టి విజ్ఞాని రాయలసీమ రత్నాలకొక దివ్యాలంకారమైన వజ్రము. అతనిని ప్రపంచమేకొని యాడినది. అతని కీర్తి ఆ చంద్ర తారార్కము నిలిచియుండును. రాయలసీమవారికి గలిగిన పుణ్య విశేషమిదియే.



# శ్రీ ఉప్పలపాటి వేంకటనరసయ్య

జననము: 1891 నిర్యాణము: 25-2-1973

తల్లి:— శ్రీమతి రంగమ్మ
తండ్రి:— శ్రీ ఉప్పలపాటి గంగయ్య

మతము, కులము:— హిందూ—రజక
జన్మస్థలము:— కదిరి—అనంతపురం జిల్లా.

మ॥"నట దీశాన జటాటవీ లుఠిత తుంగా భంగ గంగాపగో
ద్భట ధారా ప్రసరత్ప్రమాన కవితా ప్రావీణ్య ముంగల్గి, య
ప్పటపున్ రైతుల నిత్య జీవిత మిటుల్ వ్రాయంగ నేర్చున్న నీ
కిట జోహారు లొనర్తు స్మారకవితా హేరాళ పారంగతా!

నేటి ఆంధ్ర విద్వల్లోకమున నెంతటి కవి ప్రకాండులనయినను సంపాదింప వచ్చును గాని, శ్రీ ఉప్పలపాటి వేంకటనరసయ్య గారంతటి 'ఉత్తమకవి' ని గుర్తించుట ప్రయాసతో కూడుకొన్న పని" యని శ్రీ నారునాగనార్యగారు తమ యభిప్రాయమును 'గ్రామాభిరామ' మనుకావ్యముపై దెల్పినారు.

పల్లెపట్టులందు గుట్టుగా కాలమునెట్టుకొనుచు, పల్లెవాసుల జీవన విధానముల జక్కగానెఱిగి. తన మనోభావములను గ్రంథ రూపమున ఆంధ్రలోకమున కందించిన కర్మయోగులు వేంకట నరసయ్యగారు. స్వబిరుద ప్రతిష్ఠాపన కుబలాట, వాదోపవాదము లకు దిగుట, నీకవికి సరిపడవు. జీవితమంతయూ నుపాధ్యాయ వృత్తినిగావించి,తనకున్న కవితాధారతో మాతృభాషసేవకే జీవితము నంకితము చేసిన ధన్యజీవులువారు.

వేంకటనరసయ్యగారు ఏడవయేట పల్లెటూరి బడిలో అమ

రము. ఆంధ్ర పద్యనిఘంటువులను శ్రద్ధగా నేర్చుకొనిరి. 'డిస్ట్రిక్ట్' బోర్డు పాఠశాలలో ప్రైమరి విద్యవరకు చదివిరి. ఆ రోజులలో పేద లకు ఉన్నత విద్య అందుబాటులో నుండెడిదికాదు. ఆ కారణమున పై చదువులు వారు చదువలేకపోయిరి. జీవనోపాధి కొఱకు 1911లో 'కొమ్మనవారి పల్లె'లో ఒక గ్రాంటు బడి పెట్టి పిల్లలకు చదువులు చెప్పనారంభించిరి.

పల్లె వాతావరణములోని రాత్రి భజన సంకీర్తనలు, నాటకాలు వీరి రచనా వ్యాసంగమునకు దోహదమైనవి. 'గుండాలరెడ్డి నాటక సమాజము' వారి చిత్ర నళీయము, పాదుకా పట్టాభిషేకము మొద లగు నాటకములు చూచుటద్వారా కవిగారికి ఒక విధమగు సంగీతా పేక్ష పుట్టి పాటలు, పద్యములు వ్రాయవలెననెడి కుతూహలమధి కముకాజొచ్చినది. దానికితోడు సజ్జన సాంగత్యమబ్బినది. పూవుల తోబాటు నారకు తావి యబ్బినట్లు శ్రీ వైద్య విద్వాన్ పండిత నారు నాగనార్యగారి సాహచర్యముతో సాహిత్యాభిరుచి యినుమడిం చినది. అప్పటిలో నారునాగ నార్యగారు సత్యాగ్రహ ప్రచారకులుగా నుండిరి. ఇరువురు కలిసి దేశసేవ, సాహిత్యసేవ సమముగా నొనర్చిరి. పెక్కు శిలాశాసనముల ప్రతులు వ్రాసివుంచిరి.

1917—19 సం॥ నందు రాచపీటిలో టీచర్ ట్రయినింగ్ పొందునప్పుడు శ్రీ వేంకటనరసయ్యగారికి శ్రీ రూపనగుడి నారా యణరావుగారితో సాహచర్య మేర్పడినది. రూపనగుడి వారికి నర సయ్యగారిపై అవ్యాజానురాగ మేర్పడి, అతనికి తెనుగు వ్యాక రణము, ఛందో లక్షణము నేర్పిరి. అట్లే శ్రీ వెల్లాల వేంకటాద్రి శర్మగారి వద్ద మూడు సర్గలవరకు రఘువంశము నేర్చుకొనిరి.

1950 వరకు వీరు ఉపాధ్యాయ వృత్తిని చేపట్టిరి. వీరు పల్లె

ప్రజల చిత్తప్రవృత్తిని చక్కగా ఆకళించుకొనిరి. ఆ తీయతీయని స్మృతుల రూపమునే ఒక చక్కటి మూసలోపోసి, తీర్చిదిద్దిమన ముందు కావ్యరూపమున నుంచిరి. ప్రాచీన భారతదేశమునను గ్రామ సౌభాగ్య విశేషముల దెలుపుచు, సహజోక్తులతో సాగిన సాహితీఖండమే 'గ్రామాభిరామము'.

గ్రామాభిరామ మందు రైతు కుటుంబీకుల యాదరాభిమానములు, ప్రకృతి సహజసంపదలు. వారి నిరాడంబర జీవన విధానములు. వారి అమాయక ప్రవృత్తి, వారిపాడిపంటలు మున్నగునవి యన్నియు బహుచక్కగా అద్దము పట్టినట్లు చూపిరి. పద్యములన్ని లలిత పదములతోగూడి అనేక గ్రామ నానుడులతో అతి మనోహరములుగానున్నవి. కొన్ని భావములు పాఠకుల హృదయ పీఠములలో తిష్ఠవేయక మానవనుచు శ్రీ రాచమల్లు భైరవ కొండారెడ్డి గారిట్లనిరి.

> " చింత చిగురంచు ముట్టి చూచితినిగాని
> వలపు లూనుచు కపురంపు తళుకు లిను
> వింత చిగురిద్ది; యింయులో గొంత దిని
> తలపు పెట్టియు, డాతు నేస్తమ! నిజంబు"

నిజముగా నిందు మనసు నా కట్టుకొను దృశ్యవర్ణనలు, సహజోక్తులు, సామ్యములు, మనోజ్ఞభావములు పెక్కులు, మచ్చునకు చూతము.

కాకులు చేలపైబడి పంటను పాడు జేయుట సహజము. కాని కవి దృష్టిలో ఆ కాకులదాడి ఎట్లున్నదో గమనార్హము.

యవనుల్ పూర్వము దాడిబెట్టి మన యార్యావర్త దేశంబునన్
బవరస్త్రీ జనమండలిం గమిచి దౌర్జన్యంబుఁ గావించి స

ట్లవిగో, కాకులు జేని మీఁదఁబడి బిట్టల్లాడు లేఁగఱ్ఱలన్
బువికిఁ ద్రాలఁగఁద్రొక్కి చంచువుల వెన్నుల్ ద్రుంచుటం గాంచుమా !

చేను కాపలాకు వచ్చిన చెల్లెల నిట్లు, ఆ కాపు దండించు చున్నాడు

చెల్లీ! యెచ్చటికేగినావొ కనవే! చేనంత పాడాయె; నీ
పిల్లాటల్ మొదులాఱు వేగముగ రావే! యెక్కవే మంచెపై
రాళ్ళన్ మొత్తుము మొండి కాకులవి రా–రాపింతలే కెట్టులన్
వెళ్ళున్ దేవునికేని దెబ్బ గురు వీ విశ్వంబునఁ లేమ్మిఁకన్

ఆ కాపుచెల్లి చేతిలో వడిసలపట్టుకొని త్రిప్పు దృశ్యమునిట్లుచెప్పిరి.

అలీఢక్రమ దృశ్యమాన పదవిన్యాసైక భంగ్యంతర
వ్యాలోలంబగు చూడ్కితో నడుము జవ్వాడంగ వేణీభర
శ్రీలావణ్యము శ్రోణిఁజింద "వడిసెల్" చేఁద్రిప్పు నీమూర్తి యౌ
రా! లక్షింపఁగ ఝాన్సిరాణివియొ సత్యాదేవివో యౌదుపో!

ఇట్టి నయనానందకర దృశ్యములెన్నో యిందు కడురమ్య ముగా పొందు పరచబడినవి. ప్రాతః కాలముననే కూయు కోడి కూతతో మానవాళి నీతదెట్లు ప్రబోధించెనో చూడుడు.

మత విద్వేష నృపాల శృంఖలములఁ మానంబుఁగోల్పోవు, దు
స్థితికింజాఱిన దేశమాత చెఱ విచ్ఛేదంబు గావింపఁగా
బ్రతుకుల్ ప్రాణము లప్పగించిన, మహా ప్రఖ్యాత వీరాంధ్ర సం
స్కృతులగ్గించెడి కోడికూత వినిపించెన్ నిద్రఁజాలింపుమా!

ఆణి ముత్యములవంటి నిట్టి పద్యములలో నివి మంచివని ఏరుట దుస్సాధ్యము. అన్నియూ రత్నములే. అన్నియూ సుగంధ కవితా కుసుమములే. వారి రచనాశైలి అట్టిది గ్రామాభిరామ మందు

నటనట కొంత గ్రామీణ కథయు నడిపిరి. దానిని ముచ్చటగా కూర్చిరి.

రమ్యముగా వ్రాయు కవికి ఎట్టి చిన్నభావన కలిగినను దానిని దివ్యముగానే చెప్పును. నేర్పరియైన శిల్పి ఎంతటి బండఱాయినైనను తన ప్రతిభచే చక్కటి బొమ్మగా తీర్చ గలడు. వాల్మీకి జూచిన విషాద సంఘటన గొప్పకావ్యముగా నవతరించినది. కవిదృష్టి కేదియును అల్పముకాదు. ఒకరెడ్డిగారి పశువుల కొట్టములో కాపురమున్న 'పిచ్చుక జంట'ల కథనొక కావ్యవస్తువుగా యెన్నుకొని మనోరంజకముగా 'పిచ్చుకపిన్ని' యను పేరుతో కావ్యమును వేంకట నరసయ్యగారు వ్రాసిరి. అందలి కథ సూక్ష్మముగా నిది.

'ఒకపశువుల కొట్టములోని పిచ్చుక జంటకు చాలకాలము వరకు సంతానము గలుగలేదు. అవి సంతానముకొఱకై తీర్థములు సేవించినవి. తుదకు ఫలమబ్బినది. పసికందులు మాత్రము కొట్టములోని ఒక నాగుబాము నోటబడినవి. పిట్టలు గోడుగోడున నేడ్చినవి. ఉడుత వాటిని ఓదార్చినది. ఒకసారి పాము రెడ్డి కంటబడినది. రెడ్డి పాములు బట్టు వానిని పిలిపించి దానిని పట్టించెను. పిట్టలకు భయము తీరినది. మరల కొట్టములో కాపురముంచి, గ్రుడ్లుపెట్టి పొదిగి పిల్లలను కన్నదా పిచ్చుక యిల్లాలు. కానీ ఆ పిచ్చుకకు బిడ్డలను పోషించు నదృష్టములేదేమో! పాపము పిచ్చుక బాలెంత నంజునబడి మరణించినది. ఱెక్కలురాని పిల్లలను పెంచుటకు ఆ మగ పిచ్చుక మరల పెండ్లాడినది. ఆ సవతి పిచ్చుక పిల్లల పాలిటి మృత్యువైనది. ఆ పిచ్చుకపిన్ని చేతిలో పలుకష్టములు పొందినవా పసికందులు.

కవిగారిట్టి కావ్యవస్తువునెంత హృద్యముగా వర్ణించిరో 'గ్రామాభిరామము' ను పఠించిన పాఠకులూహించి యుందురు. ఈ కావ్యమును రాయలసీమ సాహిత్య పరిషత్తువారు ఆంధ్రలోకమున కందించి ధన్యులైరి. ఈ కృతి నభినందించుచు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు పలికిన పలుకులివి.

" ..................... ఇంత చక్కని కవి యిన్నాళ్ళెమూలదాగి యున్నాడో తెలియదు. పద్యరచన నిస్సందేహముగా దివ్యముగా నున్నది. చక్కని భాషా జ్ఞానము, రమణీయమైనకూర్పు, పద్య రచనలో నెక్కడను కొంకులేకుండట, మఱియు కొన్నిచోట్ల గడుసుదనము, ఒండు రెండుచోట్ల ప్రౌఢకవులు పోవు లక్షణము, కొన్ని సీసపద్యములు వ్యర్థపదము లేకుండ దేశీయములైన పదము లలో నింపి యెంతో రమణీయముగ వ్రాయుట చూచినకొలది ముద్దు ముచ్చటలను సమకూర్చు చున్నది."

పలు ప్రశంసల నందుకొన్న నీకవి వందల కొలది కావ్యములు వ్రాయలేదు. వ్రాసిన వాటిలో 1) గ్రామాభిరామము 2) పిచ్చుక పిన్ని 3) మల్లికార్జున విలాసములు మాత్రమే ముద్రితములు. మరికొన్ని అద్భుతఖండ కావ్యములైన ఊర్వశి, కోకిలమ్మ, చీమల బారు, వేంకటేశ్వర శతకములు. అముద్రితములుగనే నున్నవి. 'మీనాక్షి' యను నవలకూడా అముద్రితమే. చిన్నతనమున వ్రాసిన 'ఒంటిమిట్ట జానకీవల్లభ శతకము' 'దుర్మోహపరిభవ' నాటకము, సంపాదించి వుండిన మహావిష్ణు పురాణమును తాటియాకుల పొత్తము గృహదహనము సంభవించి కాలిపోయినవని కవిగారే స్వయముగా తెల్పుకొన్నారు.

"1927 సం॥ మద్రాసు అఖిల భారత జాతీయ మహాసభను

నాగునార్యునితో కలిసి సందర్శించుట. శ్రీ రంగక్షేత్రమును వైకుంఠ యేకాదశిని సేవించుట, జీర్ణవిద్యానగర సందర్శనము, శ్రీ బాపూజీ పావన చరణ సంస్పర్శనము. ఇవి నా జీవిత మధుర ఘట్టములు' అని కవిగారు వ్రాసుకొన్నారు.

వీరికిరువురు పుత్రికలు, యిద్దరు పుత్రులు. ఒక కుమారుడు కుమార్తె ఉపాధ్యాయ వృత్తినే స్వీకరించినారు. చిన్నకుమారుడు పోలీసు ఆఫీసునందు గుమాస్తాగా వున్నాడు.

కడప మండలములోని పెక్కు కవిపుంగవులతో వీరికి సాహచర్యముకలదు. అజ్ఞాతకవిగానే వీరు ఎనుబదిరెండేండ్ల పండు వయసు వరకు స్వగ్రామమైన అనంతంపల్లె (రాజంపేట తాలూక కడప జిల్లా) లో నివసించిరి. జీవించినంత కాలము ఒకరి నాశ్ర యించినవారుకాదు. ఘన సన్మానములు, గొప్ప బిరుదులు పొంద వలెనని యుబలాట పడినవారుకారు. ఇట్టి నిస్వార్థ త్యాగపురుషులే తెనుగు తల్లి సేవచేయదగు అనుంగు బిడ్డలు. ఈ పల్లెసీమ కవి వర్యుని అమూల్యమగు కృతులను మనము వెలుగులోనికి దెచ్చు కృషి చేసినప్పుడే మన ఋణము తీరగలదు.

ఆ అముద్రిత కృతులలోని సుగంధ సౌరభ కవితా సుమ ములను వాడనీయక తెనుగుదేశమున పంచిపెట్టుట మన కర్తవ్యమై యున్నది.



కవిరాజ

# శ్రీ కలుగోడు అశ్వత్థరావు

జననము: 25-7-1901 నిర్యాణము: 19-7-1972

తల్లి:- శ్రీమతి లక్ష్మాంబ. తండ్రి:- శ్రీ వెంకోబరావు.

జన్మస్థలము:- కలుగోడు-రాయదుర్గము తా॥ అనంతపురం జిల్లా.

మతము-కులము:- హిందూ, బ్రాహ్మణ, బడగనాడు. మధ్వ.

కర్ణాటకాంధ్ర భాషలకు గల మైత్రి ఈనాటిదికాదు. విజయనగర సామ్రాజ్య పాలకుల ఏలుబడిలో నుండిన మనసీమ కర్ణాటకాంధ్రి కవిశేఖరుల నిరువురిని, ఆ ప్రభువులొకేతులలో తూచి, ఇరువురిని సమానముగా పోషించినారు. ఆనాడు తెలుగు కన్నడ కవుల పరస్పర మైత్రి వాత్సల్యములు పెంపొందెను. భాషావైషమ్యములకు తావులేదు. ఏనాడో, ఆరెండు భాషల మధ్య ధృఢమైన సేతువు నిర్మింపబడినది.

ఈ ఇరువదవ శతాబ్దమున ఆంధ్రి కర్ణాటక భాషలకొకే లిపి నిర్మాణమొనర్చ ప్రయత్నములు జరుగుచుండుట ముదావహము. అనంతపురము జిల్లా పొలిమేరలు మైసూరు రాష్ట్రమునకు చేరియుండుట వల్లను, కర్ణాటకాంధ్రులలో, వివాహ సంబంధములు జరిగియుండుటవల్లను. ఇరువురి ఆచార వ్యవహార సంప్రదాయము లించుమించుగా కలిసిపోయినవి. కాన, అనంతపురము జిల్లా కొన్ని తాలూకాలలో, కర్ణాటకాంధ్ర కవి సవ్యసాచులు పెక్కుమంది వెలసిరి. వారెంతో కృషిసల్పి ఇరుభాషా సాహిత్య కుసుమము లందుగల పరిమళములను వెదజల్లిరి. అట్టి ధృఢతర సేవజేసి ధన్యులైన వారిలో శ్రీ కలుగోడు అశ్వత్థరావుగారొకరు.

కన్నడ సాహిత్యములో వీరికి చిన్ననాటినుండి మక్కువ కుదిరినది. కన్నడ కస్తూరి పరిమళమును బాగుగా ఆఘ్రాణించి, తెలుగు తీపిని చక్కగా గ్రహించిరి.

కన్నడజైన కవులైన, పంప, రన్న, పొన్న కవులు కర్ణాటక సాహిత్యమును వెలుగులోనికి దెచ్చిరి. వారు 'రత్నత్రియ' మని ప్రసిద్ధి పొందిరి. 'సర్వజ్ఞునివచనము' లనుపేర ఆంధ్రీకరించిరి. తెనుగున వాడుకలోలేని, "కన్నడత్రిపది ఛందస్సు" నే వాడినారు. మచ్చునకు గమనించుడు.

1. పచ్చి మాంసపు బీడు – పాడు బొమికల గూడు
హెచ్చురోత – తనువున నుండి – కులమెంచ
వచ్చునేరీతి సర్వజ్ఞ!

2. ధనకనకములు గలుగ – దినకరుని వలె వెలుగు
ధనకనక మరుగ – మఱునాడు – పాడూరు
శునకమగు నరుడు సర్వజ్ఞ

3. జాతిపై – నొక్రమాను – కాయుచుండుట గంటి
చేతులాపైన – గనుగొంటి – సౌరభము
భాతియును గంటి (సానరాయి)

4. మీను ముట్టనివారి – దాసవుల పగవారి
మానవుల కగును – ఫలకారి – తెలిపెదరె?
జాణులీదారి? (టెంకాయ)

ఇట్లే వేమన పద్యములను కన్నడభాషలోని కనువదించిరి. ఈ "వేమన రత్నగళు" కర్ణాటక దేశములో బహుళ ప్రచారమైనవి. మఱియు, కన్నడములో, "మహాలింగరంగ" అనుకవిచే వ్రాయబడిన "అనుభవామృత మనబడు అద్వైత వేదాంత గ్రంథమును తెలుగులో "అనుభవామృత సారము"గా రచించిరి,

అల్లే పాల్కురికి సోమనాథ కవిగారి సోమేశ్వర శతకమును, కనక దాసుగారి హరిభక్తి సారమును తెలుగులో అనువదించిరి.

పోతన్నగారి, తెలుగు మహాభాగవతమందలి ప్రశస్త ఘట్టములైన, గజేంద్ర మోక్షము, రుక్మిణీ కల్యాణము, ప్రహ్లాద చరిత్ర, వామన చరిత్రములను కన్నడ దేశము వారికి 'భాగవత గీతిగళు' అను పేర నందించిరి.

పెద్దన్నగారి మనుచరిత్రను "శృంగార వరూథిని" గా కన్నడమున రచించిరి. స్వతంత్రముగా కన్నడమున, 1) కంద పద్య రామాయణ 2) శ్రీ కృష్ణలీలె(బైలునాటక) 3) సుభద్రాపరిణయ నాటక. అనునవి, వ్రాసినామని కవిగారు తమ గ్రంథములలో వ్రాసికొన్నారుగాని, ఆ వ్రాత ప్రతులు చేదాటిపోయిన వన్నారు.

కన్నడ రన్నకవిచే వ్రాయబడిన "సాహస భీమవిజయ" అను కర్ణాటక కావ్యమును, మన కవిగారు "గదాయుద్ధము" అను పేర ఆంధ్రీకరించినారు అందులో మచ్చునకు మూడు పద్యములు చూడుడు.

1. కం. మానధనుఁడన నెగడి, యభి
   మానము దిగనాడి, నీటమయిడాఁచుటే? యెం
   దైనన్ గప్పలు నేంద్రులు
   మీనులు, జలములనిలు: నిలమేలే మగలున్?

2. కం. ఎందెందు నీవు మృతినే
   పొందనటులఁదలఁచి, మిగులఁబొంగితి; నీవొం
   డుందలఁచు టెఱుంగవో? జడుండ వగుదువో?

3. కం. మాగాడ్పు పట్టితో, నీ
   మాగపు; మఱనాకు నీకువైరంపగియెడిన్

నాగాండీవము నిశితము
నీ గళపుఁబటుత్వమరయ—నీవిటురమ్మా!

భాషాంతరీ కరణము సామాన్యులచే సాధ్యముకాని పని. పరస్పర భాషలకు సౌందర్య సాహిత్యములను, అనువాదము ప్రసాదించవలెను. అనువాదకున కుభయ భాషా పాండిత్యము, ప్రత్యేకపు పలుకుబళ్లు, దేశ్యపదజాలములు, నానుడులు, ఏతద్భాషా స్వరూప స్వభావ సౌందర్య వికాసములు తెలిసి యుండవలయును. వీటి నెఱింగిన దిట్ట మనకవిగారు.

ఈ కవిగారు, రాయదుర్గము తాల్లూకా—"కలుగోడు"లోను మైసూరు సీమలోని 'తళుకు' గ్రామములోను కరణము పనిచేసిరి. ఈ రెండు గ్రామములందును, కవిగారికి చాలినన్ని భూములుగలవు గాన జీవితమును సుఖముగాగడపిరి. అయితే వీరికి సంతానములేదు. అన్న కొమారునే, తన పుత్రునిగా వాత్సల్యమున పెంచిరి. ఈకవి విలాస పురుషుడు. చేతివ్రేళ్ల కైదింటికి రాళ్ళు చెక్కిన కనకపు టుంగరములు ధరించి, సరిగంచు వస్త్రములను సింగారముగా ధరించువారు. తన ఇంటికి వచ్చిన అతిథి, అభ్యాగతుల నాదరించి మృష్టాన్నమునిడి, వారిని సంతోషపెట్టువారు. తాము వ్రాసిన కావ్య ముద్రణము కొఱకు నితర ముద్రాశాలల శరణుజొచ్చక, స్వంత ముద్రాక్షర శాలను, రాయదుర్గములో నెలకొల్పి, తగుకావ్యముల నందే ముద్రించుకొనిరి. ముద్రణ సౌందర్యము నాశింపక, తగు గ్రంథముల నెట్లో యొకరీతి తమ "కవిరాజ" ముద్రాక్షర శాలయందే ముద్రించిరి. తమ అవసాన కాలమునందా ముద్రాక్షర శాలను రాయల పరిషత్తున కుచితముగా సమర్పించిరి. వారి దాతృత్వ మెట్టిదియో గమనింపుడు. ఇంతకుముందు పేర్కొన్న అను

వాద గ్రంథములే కాక, ఈ కవిగారీ గ్రంథములను కూడ రచించిరి. 1) దండక రామాయణము 2) అశ్వత్థభారతము (పద్యకావ్యము ఆది చతుష్కము మాత్రము) 3) అశ్వత్థేశ త్రిశతి (కందములు) 4) మూడు శతకములు 5) రెండు నాటకములు 6) అక్క మహాదేవి వచనములు 7) బ్రాహ్మణుడు 8) గురుదక్షిణ.

గురుదక్షిణ 1966 లో వ్రాసిరి. ఇందులో కవిగారు తమ మనస్సు విప్పి, కవితాకన్య తన్నెట్లు వరించెనో చెప్పుకొన్నారు.

ఉ. కఱవుఁ, గొఱవఱదు, మది గోరిక లాఱకలేదు; నే నడి
ప్పుడుఁబని సేయు టెప్పుడదు — పుట్టువు నుండియుఁ గైత తోడనే
మతి సుఖింబు; వేఱు పని — పట్టదు; గిట్టదు; కైత సౌఖ్య మి
ప్పుడమిఁ గల్గ దెందు — నది పొందినవాఁడె యెఱుంగుఁ బొందయా!

ఉ. భార్యకు మున్న నాసపము — బట్టెను; బాయదు నిద్రలోను, నే
కార్యముఁ గొన్న నీపతిఁ గాచును; జూచును నామనంబులో
శౌర్యము; వేఱు ధ్యాసఁ గొన — నైపదు; శాంతిసుఖం బొసంగు, నౌ
దార్యము మీఱ; లోక సుఖధర్మము శాంతికరంబు! కాల్పనే?

రామాయణము నెందఱో, మహానుభావులు వ్రాసియున్నారు. కాని, దండకరూపమున, 'దండక రామాయణము'ను వ్రాసిన వారీ కవి గారొక్కరే. కైకేయి తన వాక్చాతుర్యముతో, దశరథునిట్లు మరులు గొల్పినది.

“హానాథ! మత్ప్రేమనాథా! ధరానేతృనేతా! ప్రతాపాధినాథుఁడ నిన్ను భర్తగా బొందియుండి నే నథా కృతిఁడ గుండెపడ మోహనాంగా! మరి యెప్పి తార్థంబు దీర్పంగ నే నుంటినం చంటివే? అంత భాగ్యంబు నాకున్నదే?

సత్యముగా బల్కవే? బాళి నీ వంతగా నాయెడగా జుల్కవే? పల్కవే! యన్న భూనాథుడోమానినీ! నాయెడగా నీకు సందేహ మెట్లుండ నేహేతువో? నాతిరో! మున్నుకన్నావటే నా యుదాసీన భావంబు నీపట్ల? నీకై చితిగా దూకగా వచ్చినగా దూకెదగా గోర్కెనే దీర్తు, నీడేర్తు నోకామినీ! కోరుమంచన్న, నా జాణ వేలేచి, ముద్దారగా గౌగిటగా గ్రుచ్చి; యా వృద్ధు మాయా విమోహంబులగా గుప్పు, తీపౌచమత్కారవుగా భాషణల్ సెప్పి, యిట్లాడు........ ఇట్లే క ధారగా వీరి కవితా ప్రవాహము సాగిపోయినది.

ఈ కవిగారు, బడిలో 4 వ తరగతి మాత్రము చదువు కొన్నను, పూర్వజన్మ విద్యాసంస్కృతి వల్లను, స్వయం కృషి వల్లను, దాగుకొన్న కవితామొగ్గ, వికసించి పుష్పమై, తన సువాసనల నలువైపుల వెదజల్లెను. ప్రహ్లాద, ధ్రువ బాలకుల కుగ్గు బాలతోనే, భక్తి పుట్టలేదా? కీ. శే. కప్పగల్లు సంజీవమూర్తి జ్ఞారు, తమ గురువులని కవిగారు చెప్పుకొన్నారు. గురువులు నిమిత్తమాత్రులేకాని, పూర్వజన్మ సంస్కార మొక్కటియే, భక్తి, గాన, వైరాగ్యములకు, కవిత్వ — పాండిత్యములకు పునాదియని ఘంటాపథముగ చెప్పవచ్చును. ఈ కవిగారికి 'కవిరాజ' 'కవి సవ్యసాచి' యను బిరుదులేకాక, శ్రీశైల జగద్గురువులు 'ఉభయ భాషా భాస్కర' యను బిరుద మొసంగి సత్కరించిరి.

ఇట్టి కవిగారికి బ్రహ్మ పూర్ణాయువొసగక, 70 ఏండ్లకే తనువు చాలించుట, ఆంధ్రుల దురాదృష్టమని చెప్పపనిలేదు.



నా రా య ణ వ న ము

## శ్రీ కూరత్తాళ్వారు అయ్యంగారు

జననము:— **1867** నిర్యాణము:— **1947**

మతము:- హిందూ—అయ్యంగార్లు.

జన్మస్థానము:- తిరుచనాపల్లి జిల్లా. స్థిరపడినది రాయలసీమ జిల్లా అనంతపురము. కాన వీరు రాయలసీమ వాసులుగా ఎన్నికైనారు. తల్లి దండ్రులు, కుటుంబ చరిత్ర వారు వ్రాసుకొనలేదు.

వీరు జాతీయ భావములుగల్గి, విద్యార్థులలో దేశభక్తిని సంఘసేవా శక్తిని, పెంపొందించిరి. 1909 నుండి 1912 వరకు అనంతపురము జిల్లా, పెనుకొండలో మిడిలు స్కూలు హెడ్డు మాష్టరుగా పని చేసిరి. మరల 1912 నుండి ధర్మవరము లండన్ మిషన్ హైయరు ఎలిమెంటరీ స్కూలులో పనిచేసి 1922 లో పదవీ విరమణ చేసినారు.

ఈ కవి గారాజానుబాహులు. నిమ్మపండు శరీరచ్ఛాయ, దరహసితవదనము, కనికరమును వెదజల్లు కన్నులుగల నిండు విగ్రహము వారిది. చక్కగా మూడు తిరునామములు ధరించి, స్వచ్ఛమైన తెల్లధోవతి పంచెకట్టు ధరించి, తెల్లని నిడుపుకోటు (Long Coat) తల పాగా వేసుకొని, బడికి వెళ్లెడివారు. వీరి సన్నిధిలో, శిష్యులు గురుకులములో వలె చదువుకొనెడి వారు. విద్యార్థులకు సంస్కృతము నేర్పవలయునను యుత్సాహముతో, వీరు వేకువ 4 గంటలకే మేల్కొని ఇంటింటికి దిరిగి తమవెంట విద్యార్థులను పిలుచుకొనివచ్చి వారికి, అమరము, సంస్కృతము

నేర్పెడి వారు. వీరి శిష్యులైన, జిల్లా కలెక్టరు పనిచేసి కీర్తిశేషులైన భోగిశెట్టి జూగప్పగారిట్లు వ్రాసియున్నారు.

"శ్రీ కూరత్తాళ్వారు అయ్యంగారు సన్నిధిలో నేను 1909 నుండి 1912 వరకు, అనంతపురము జిల్లా పెనుకొండలో చదువు కొంటిని. వారి ధర్మ విధానము, జ్ఞానము, దైవభక్తి, దేశభక్తి, దేశాభ్యుదయ సేవాశక్తి, తెలుగు సంస్కృత హిందీ భాషానురక్తి వర్ణనాతీతము. మా పాఠశాల చుట్టువున్న బీడు భూములలో, పైరులను నాటించి బావినుండి నీళ్లను మాతో మోయించి, పైరులకు పోయించు చుండిరి. 1908 వ సంవత్సరమునందే హిందీ దేశభాషగా నుండ వలయుననియు, ప్రతి విద్యార్థియు, ఈత, సైక్లిపు స్వారి, సాము, గరిడీలు నేర్వవలయునని వారి ఆశయము. కుల మత భేదములు నశించవలయునని, వారు భాగవతములోని రంతిదేవుని చరిత్రమును పలుమారు చదివి చెప్పుచుండిరి. శివకేశవ భేదము లెంచ కూడదని, దయయే శివపూజయని, సత్యమే హరి కీర్తనమని, తిట్టినవానిని దీవింపుము, కొట్టినవానిని పూజింపుమని వారు మాకు ప్రహ్లాదుని చరిత్ర చెప్పుచుండిరి. చేనేత బట్టలనే వారు ధరించిరి. వారిల్లు బీద విద్యార్థులకు హాస్టలుగా ఉండేది"

నేను (కల్లూరు అహోబలరావు) వారివద్ద 1912 నుండి 1915 వరకు, అనంతపురము ధర్మవరము లండన్ మిషను హైయరు ఎలిమెంటరీ స్కూలులో చదువుకొన్నాను. వారు 'సాధు సంగతి' నిట్లు వర్ణించిరి.

కం॥ శ్రీ నొసగు, యశము బెంచు, న
సూన ప్రమదంబు సేయు – నురు దోషములన్

బో నడచును; ప్రవిమల, వి
జ్ఞానము వెలయించు సాధు సంతతి తలపక౯

ఒకసారి వారు విద్యార్థులను, సమీపము నందున్న దిగుడు బావి దగ్గరకు పిలుచుకొని పోయి, అచ్చట భూమిని త్రవ్వించి, ఏవో పైర్లను పెట్టించి, మాతో నీరు పోయించెడి వారు. ఆ పైర్ల చుట్టు ముళ్ల కంపలు నాటించు వారు. చూచిన రైతులు, 'తేరు తావ గాలి యాస్తే—రైలు కమ్ములు దాటిపోతాయి' అని చెప్పుకొనుచు పోవుచుండగా, మా గురువుగారు 'చూచితిరా! ఆ రైతు ఎటువంటి ఉపమానము చెప్పినాడో' అని తెల్పుచు, ముసి ముసి నవ్వులు నవ్వువారు. కంచెకు తూర్పున ఒక మైలు దూరములో తేరు, కంచెకు పడమర ఫర్లాంగు దూరములో రైలు కమ్ములుండెను.

వీరు సహజకవులు. వీరు వ్రాసిన చిట్టిపొత్తములు ప్రకటించినవి రెండే. 1 రాగిరంకి (వచనము) 2 పోణిమి (ద్విపద). వీరు వ్యవసాయము సంబధి రుచిగలవారు. వ్యవసాయాభివృద్ధి. పలు తెఱగుల పంటలు, వివిధ రకములైన ఎరువులను గురించి అనేక వ్యాసములను వ్రాసినారు (అవి దొరకవు)

'రాగి రంకి'లో అనంతపురము జిల్లాలో విశేషముగా రైతులు పండించు రాగి ధాన్యమును గురించి వ్రాయుచు, రాగి పిండితో చేయు పలువిధములైన వంటకములను వర్ణించిరి. ఆ వంటకములను తమ ఇంటిలో వాడుచుండిరి.

'పోణిమి' ద్విపదలో వారెన్ని విషయములనో వర్ణించిరి. మచ్చునకు కొన్ని

ద్విపద ॥ ఇంటి పెఱళ్లలో — నిడి ప్రత్తిచెట్లు
కుంటక, నేకుల — గూర్చి దాసముల
నూలి పోగుల దీసి — నునులక ద్రిప్పి
పాలుమాలక స్త్రీలు — పట్టి కండెలను
గుడ్డల కఱవును — గూటి పేదఱిమి
గడ్డికౌ కడగండ్లు — కడపడు మనకు
కల్లను దగవైచి — కావలి యుంచి
పుల్లను బోనీక — బ్రోదిగా బెంచి
చలిగాలి వానల — సన్నములో గాక
కలజీవ ధనముల — గట్టి కొట్టముల
పిడుదలు చీమలు — పెను దోమగములు
కడిది పేడ గదురు — గంజును లేక
శుద్ధిగా బశువుల — జూచుట మేలు
.... .... ....
పదియేండ్ల బిడ్డకు — బాడియావొకటి
కుదిరిన నేలను — గూర్పగావలయు

బాలురకు వ్యాయామము ముఖ్యముగా తోడ్పడుననియు, వారిలో ఇద్ధతేజస్సు, బుద్ధిబలము, పౌరుషపరితనము, దేశభక్తి, దేవతాప్రీతి పెంపొంద వలెననెడి, ఉదాత్త భావముగల వారాచార్య వర్యులు.

1914 వ సంవత్సరమునకు సరియైన ఆనంద సంవత్సర ఉగాది కానుక శుభాకాంక్షల నిట్లు ప్రకటించిరి.

సీ. ఆనంద సంవత్సరాది, కుశల వార్త
యానంద దాయక — మందఱకును

వృద్ధియౌ సస్యజ – వృక్షజ జంతుజ
ఖనిజాండ జంబులు – జనము లలర
భూచర, జలచరంబులు, నుభయ చరంబు
లును, తమ తమ పనులొనర నలువ
ఆంగిక వస్తువు –లనువుగా నేలలో
జేరుట బంటలు జెలుపు మించు

గీ. నుభయ మూలాల వానలు నూర్జితముగ
జరుగు చుండంగ సవ్యాప సవ్యములుగ
శిల్ప యంత్రకల్పనములఁ జేతి పనుల
భారతీయుల భాగ్యంబు ప్రబలి వెలుగు

'ప్రోణిమి' లోని ద్విపద

'కూరేశ శర్మ' యీగుఱిపట్టి జనుల
కూరిమి నేర్పును –గొనజేయు నెపుడు
అంకితం బియ్యది – యాంధ్ర నాయకుని
లెంకల కిది నిత్య – లీలగా వెలయు
శ్రీరస్తు – శుభమస్తు – శివభూతిరస్తు
ఆరోగ్యమస్తు – దీర్ఘాయుష్యమస్తు
పశువృద్ధిరస్తు – సద్బాంధవ్యమస్తు
శిశువృద్ధిరస్తు – సత్స్త్రీవృద్ధిరస్తు
ఋతుకాల వర్షాభివృద్ధి స్సదాస్తు
హితమతి కర్షక స్కృతి కార్యరస్తు
తృణకాష్ఠ జలవృద్ధి దినదినమస్తు
ఫణిరాజ తల్ప కృపా మహిమాస్తు

ఇందులో తమ పేరు 'కూరేశశర్మ' అని వ్రాసుకొన్నారు.

సర్వేజనాః సుఖినో భవంతు అని అందరిని దీవించిన మహాను భావులు వీరు.

వీరి శిష్యులెందరో గొప్ప పదవుల నలంకరించియున్నారు. ఆదర్శగురువులు. చెప్పినది చేసి చూపువారు. వ్యర్థ ప్రసంగములు వీరికి పనికిరావు. కార్యదక్షత, నీతి నిజాయితీ కలవారు. ఇట్టి వారి స్మరణ మాత్రముచేతనే. మనయందు కార్యదీక్షత జనించు నను టలో ఏ సందియము లేదు.



బ్రహ్మవిద్వారిష్ఠ
శ్రీ మేంతవరము
సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

జననము: 1885 అక్టోబరు

నిర్యాణము: 22-5-1960

జన్మస్థలము:- నెల్లూరు జిల్లా-దర్శి తాలూకా-పొలేపల్లి.
(వీరు తమ జీవితకాలము నంతయు రాయలసీమ జిల్లాలలో గడిపి, రాయలసీమ వాసులుగా ఎన్నికైరి)

తండ్రి:- శ్రీ కోటయ్య
తల్లి:- శ్రీమతి అన్నపూర్ణమ్మగారు.

శ్రీ శాస్త్రిగారు గొప్ప పండిత కుటుంబమునకు చెందినవారు. ఋగ్వేదులు. ఆశ్వలాయన సూత్రము కామకాయన విశ్వామిత్రస గోత్రులు, వైదిక బ్రాహ్మణ శాఖకు చెందినవారు.

వీరు ఋగ్వేదములో కొంత సంహితా భాగమును వల్లించిరి. తిరుపతి, గుంటూరు జిల్లా కొల్లూరు మొదలైనచోట్ల ఆరంభములో కావ్య వ్యాసంగముచేసి, తరువాత గోదావరి జిల్లా కాకరపఱ్ఱు గ్రామములో బ్రహ్మశ్రీ వేదుల సత్యనారాయణ శాస్త్రిగారి దగ్గర కావ్య నాటకాలంకార సాహిత్య గ్రంథములను పూర్తి చేసిరి. జ్యోతిష్యము, మంత్రశాస్త్రము, శాంకరాద్వైతము వీరు సాధించిన విద్యలు. వీరు సంస్కృతాంధ్రముల రెండింటిలోను కవిత్వము చెప్పనేర్చిరి.

వీరి భార్య శ్రీమతి చిన్నమ్మగారు. వీరిరువురు సోదరులు. పెదసుబ్బరాయ శాస్త్రిగారు వీరి అన్నగారు. శాస్త్రిగారు మూడు వందలమంది శిష్యులకు ఆధ్యాత్మిక విద్య నుపదేశించిరి. నిరతాన్న దానము సలిపిరి.

శతావధాని శ్రీగాదేపల్లి వీరరాఘవ శాస్త్రిగారు వీరి ముఖ్య శిష్యులు. ఒకసారి వీరరాఘవ శాస్త్రిగారు జబ్బునపడియున్న తమ గురుదేవులను దర్శించు నిమిత్తము దొనకొండకు వచ్చిరి. అచ్చట వారు డాక్టరు శ్రీ శంకమలం పిళ్ళెగారి దగ్గర ఔషదము సేవించు చుండిరి. శిష్యునిరాకడ, అతడవధాన క్రియలో దెచ్చుకొన్న పేరు ప్రతిష్ఠలకు కడుసంతసిల్లి గురువుగారు, 'అవధానమేమో, చేయుచున్నావట! నా సమక్షములో జేయవలసినది' అని కోరిరి. అప్పుడు డాక్టరు శంకమలం పిళ్ళె తదితర యుద్యోగస్థు లేర్పాటు చేసిన సభకు శ్రీ మేడవరపు సుబ్రహ్మణ్యశాస్త్రులవారే అధ్యక్షత వహించిరి. శిష్యుని అవధానమునకు మెచ్చి వారల్లు ఆశీర్వదించిరి.

ఉ: ఎన్నడు వచ్చు రాఘవుఁడి కెన్నడు తా నవధాన కార్యము
పుత్రోన్నతి గల్గఁ బండితుల 'లహో' యనఁజేసి ముదంబుఁ గూర్చు నిం

కెన్నఁడిఁకెన్న డంచు. మదినెంచుచు నుండగ నీ సభాస్థలిన్
నన్నుత రీతి నల్పితివి; చాలముదంబు జనించె రాఘవా!

చం॥ మా॥...... ...... ...... ...... ...... ...... ...... ...... ...... ...... ...... ...... ......
...... ...... ...... ...... ...... వహ్వారె; నీకవితాసుధార, వి
స్ఫుర దరవింద జాల, మధుపూర రసంబులఁదోంచి, మేటి భూ
ధరముల ధిక్కరించు, వనితా కుచమండలి నొత్తుఁబుచ్చి యు
ద్ధిరయనిపించె, మిక్కిలి సుధీజన మోదముఁగూర్చె; నింక భూ
వరుల, సభాస్థలంబులను వర్థిలు వోయి! సుగౌరవంబుఁగన్
బరపగ దోయి కీర్తిసుధ, భవ్యవచఃకుసుమంబులన్ బరా
త్పరుని, యజింప వోయి! గుణవంతులఁ బుత్రుల గాంచవోయి భూ
ధరమున నిన్నుఁబ్రోచు నతతంబును నాపరదేవి రాఘవా!

ఇట్లాశువుగా శ్రీమేడవరపు వారుపలికిరి.

శ్రీమేడవరపు వారు రచించిన గ్రంథములన్నియూ అద్వైత వేదాంత గ్రంథములే. 1) యథార్థ విచారము 2) విచారదర్పణము 3) అద్వైతాధ్యాత్మిక తత్త్వము (సుబోధక వచన గ్రంథము) అన్నియు ముద్రితములే.

శ్రీ శాస్త్రులవారు గద్వాలుకుపెళ్లి, మహారాజుగారిచే చండీ యాగము చేయించిరి. సంతానములేని వారికి దైవోపాసనతో సంతానము ననుగ్రహించిరి. తమ మంత్ర శక్తులవలన గ్రామమందలి మశూచికాది బాధలను మాన్పిరి, శీతలా యంత్ర ప్రతిష్ఠాపనలు అష్ట దిగ్బంధన లొనర్చి, భగవతీ కటాక్షముతో గ్రామములను కాపాడుచు, అకాలమరణాదులులేక, శిశువృద్ధిగల్గి, పాడిపంటలతో తులతూగు నట్లొనర్చిరి.

వీరు తమ జీవితకాలమంతయు, నర్ధ శతాబ్దమునకు మించి రాయలసీమలో కర్నూలు జిల్లా ఆళ్ళగడ్డ యందును, కడప, అనంతపురము జిల్లాల యందును గడపినారు. వీరు రాయలసీమ వాసులుగా ఎన్నికైరి.

శ్రీ మేడవరపువారు తమ 62 యేండ్లవరకు అనగా 1947 సం॥ వఱకు గడిపిన జీవితచరిత్రను సమగ్రముగా వ్రాసిపెట్టిరి దానిని వారి శిష్యులైన శ్రీమద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు పూర్తి చేసి ముద్రించి యున్నారు. గురువుగారు 1960 లో బ్రహ్మైక్యమైన సందర్భములో శిష్యులు శ్రీమద్దులపల్లివారు వ్రాసిన ఈ చరమ శ్లోకమొక్కటి విద్వద్రత్నము యొక్క విలువను వెలువరింప జాలును.

విద్వాన్ ప్రవక్తా వివిధాగమజ్ఞః
గురుః ప్రసన్నోస్తమితోధునేతి
బ్రహ్మైవ సన్ముక్తి తోథ వేతి
కిం శోచనీయం? కిమశోచనీయం.

విద్వాంసుడు, మంచివక్త, వివిధాగమజ్ఞుడు, సుప్రసన్నుండు ఇట్టి గురుదేవుడు మనకు లేకపోయెనే? యని కింశోచనీయం దుఃఖింపదగునా? బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి యను న్యాయమును బ్రహ్మ విద్వరిష్ఠుడై, బ్రహ్మమే తానై పోయె గనుక, కిమశోచనీయం—ఆనందింపదగునా?

---



## శ్రీ రాప్తాటి సుబ్బదాసు

నిర్యాణము:- 19 - 5 - 61

తండ్రి:— నారప్ప

తల్లి:— లక్ష్మమ్మ

జన్మస్థలము:— ధర్మపరం.
అనంతపురం జిల్లా.

శ్రీ రాప్తాటి సుబ్బదాసుగారు కవులేకాగ యోగి పుంగవులు కూడాను. చిన్ననాటినుండియు తమ జీవితమును పరోపకార కార్యములయందే వినియోగించిన వారు. సంఘ సంస్కరణ పరాయణులు. ధర్మోద్ధరణ చికీర్షకులు. కళారాధకులు. దేశసేవా నిర్వహణ దీక్షా పరతంత్రులై తమ మనధనముల సమర్పించిన త్యాగపురుషులు. హరికథలను స్వయముగా రచించి, ప్రతి పట్టణమునకు సంచరించి హరికథా గానములను, పురాణ శ్రవణములను, ఉపన్యాసములను గావించుచు లోకమునకు ధర్మోపదేశము, సంఘసేవ చేయుచుండెడి వారు. వీరికి నాటకానుభవముకూడ కలదు. నాటకములందు ప్రధాన నాయక పాత్రలను ధరించి అభినయించి ప్రజల మెప్పులు పొందినారు. అప్పటిలో ప్రఖ్యాతి వహించిన సురభి కంపెనీవారి నాటక విధానములననుసరించి, సుబ్బదాసుగారు 1910-11సం॥ ప్రాంతము లందే 'అభిజ్ఞాన జయదేవ' నాటకమును రచించిరి. దానిని వారు తమ స్వగ్రామమైన ధర్మపరమున (అనంతపురం జిల్లా) "వాణీ మనోవినోదిని" యను నాటక సభను స్థాపించి దాని ద్వారా

ప్రదర్శించిరి. అందలి ప్రధానపాత్ర జయదేవుని భూమికను సుబ్బదాసుగారే నిర్వహించిరి. తరువాత వారు ఇహపర సాధనములకు మూలమగు హరికథా కాలక్షేపమును చేబట్టి నాంధ్ర దేశమునందం తటిని తిరిగి, ధనము క్రోడీకరించి, ధర్మవరమున హఠయోగాశ్రమమును స్థాపించిరి. వీరి శిష్యురాలు శ్రీమతి బొజ్జమ్మగారు పంద్రెండేండ్లుగా సుబ్బదాసుగారికి అండదండగానుండి అహోరాత్రులు నెతతెగని దీక్షతో పరిశ్రమించి హఠయోగాశ్రమాభివృద్ధికి తోడ్పడినది. అట్టిశిష్యురాలి వేడుకోలు వలనను పట్టుదల వలనను అభిజ్ఞాన జయదేవ నాటకమును (1941లో) " నిగమార్థ చంద్రోదయ " మను గ్రంథమాలను స్థాపించి తద్వార ముద్రించిరి. ఆ నాటకమును ముద్రించుటలోగల తమ యుద్దేశ్యమును కవిగారిట్లు తెలిపిరి.

"................ కవిసార్వభౌము లెందరో నాటక రాజము లను వెలయించి కీర్తిగడించుచుండిన యీ కాలమున, నేనీ కావ్యము ప్రచురించుటకుగల ముఖ్యకారణము, ఏతద్దృశ్యకావ్య మూలమున మహాత్ముని యహింసా సత్యముల రుచిని ప్రజలకు జూపి, వారిలో దేశభక్తిని పురికొల్పవలయు ననుటయే! అహింసా సత్యవ్రతములకు నాధార మనందగిన పురుషుడు జయదేవుడు. అమ్మహనీయుని జీవిత చరిత్రమున కాదర్శమువంటి యీ నాటక మీనాటికి నాంధ్రలోకమున కర్పించ జాలినందులకు మిగుల సంతసించుచున్నాను."

శ్రీ మహాత్మాగాంధీ గారి ఆదేశానుసారము దేశ దాస్య విముక్తికై "వ్యష్టి సత్యాగ్రహము"న పాల్గొని కృష్ణ జన్మస్థానమునకు వెళ్లుటకు మూడు దినములముందు సుబ్బదాసుగారు 8-1-41లో తమ శిష్యురాలు శ్రీమతి బొజ్జమ్మగారి కోరికపై 'ఆత్మారామ

గేయము' లను పేరుంచి స్త్రీలు పాడుకొనుటకు సులభముగా యుండు నట్లు రచించిరి. తరువాతి మూడు దినములకే పోలీసులు నిర్బంధించి నాలుగు మాసములు మాత్రము అలీపూర్ జైలులో సుబ్బదాసుగారి నుంచిరి. ఆ అజ్ఞాత వాసము ముగించుకొని వచ్చిన తరువాత ఆ గేయములను 1948లో ముద్రించిరి. ఆ గేయముల గాంధి తత్వము నిట్లు పాడిరి.

పల్లవి: భరతమాత దాస్య బంధము తొలగ నరులెల్ల శ్రీగాంధి తత్వము
అ. ప: నెఱిగి సత్యాహింస పరిపూర్ణ సిద్ధులై చెరసాలలకు వెళ్ళరాదు తత్వంబు
చ. మరు గొకించుకలేక సద్గురు కరుణ స్వాత్మా
ను భవమును నెఱుంగ జేసితి ధరను నా చంద్రార్క
మై కృతి నలరుగా కని ॥ శ్రీ ॥

అహింసా సిద్ధాంతమును సుబ్బదాసుగారు తమ 'పశుయజ్ఞ ఖండము ' నందు ప్రబోధించిరి. దీనిని 1939లో ముద్రించిరి.

తే॥ గీ. గ్రాన మడుగదు గర్జింప రోన పడదు
ఖార మెత్తిన యజమాని దూర లేదు
ఇట్టి సోదర పశువులన్నట్టి మనుజ
పశువు దినసౌనె న్యాయమే బయిని మాలి.

తే॥ గి. సితిక్రిములను భక్షించి నిర్మలంపు
జల మొసంగెడు చేపల జంపు టేల
తళుకు దేహము సొంపుల గులుకు కనులు
జూచి యానంద పడరాదె చూటిక్కలేదె.

తే॥ గీ. పరమ నీచులు పతితులు బాలిశులును
పుణ్య భీరులు కటికలు పణ్యాజనులు
దైవతా ప్రీతి యని మేక తలలు గొట్టి

శవములను బ్రేల్చి భక్షింత్రు శాపతప్త
బ్రహ్మరాక్షసుల విధానబయినిపూలి.

తే॥ గీ. జంతు సంతతిని నిజాత్మ సమతజూచు
మతమె సుజ్ఞాన ధనుల సంమ్మతముకాని
కఠిన దుర్భర క్రోధ సంఘటిత వృత్తి
లాతిప్రాణులజంపు టేలాటిమతము.

అభిజ్ఞాన జయదేవ నాటకమునకు శ్రీ మహాభక్త విజయ మందలి కథమూలము అందలి ఒక పద్యమును మచ్చునకు చూతము

చం॥ నిను నెడబాసినే నిలువ నేర్తునె యీపుడమింగురుప్రభూ!
యనలము బాసి యర్చియును, నభ్రముబాసి తటిల్లతాంగి యుం,
మనుజుని బాసి ఛాయ, రవిమండలముఞ బెడబాసి యెండయుం
గనబడునే? నిజంబుగ జగంబున నాగతి యింతయే యికఞ.

ఇందలి రచనా విధానము, పాత్రలపోషణ, సంభాషణములు మనోజ్ఞము. ప్రేక్షకులకు విసుగు పుట్టింపకుండునట్లు రచించుట కవిగారి నేర్పు. కవితాధార అనర్గళము. సులభశైలి. వీరు మరి కొన్ని గ్రంథములను కూడా వ్రాసిరి. 1) మానసగీతావళి 2) సుప్రకాశ శతకము. 3) పరమేశ్వర శతకము 4) విష్ణునామావళి 5) హితబోధిని. వీరి శిష్యులు ధర్మవర పట్టణమున పెక్కుమంది న్నారు. ఇప్పటికి సీ హఠయోగాశ్రమము కలదు. 19—5—64యేట సుబ్బదాసుగారు తమ భౌతిక దేహమును చాలించిరి.

—————— o ——————

## సాహిత్య శిరోమణి—ఉభయభాషాప్రవీణ—కవిరాజ



### శ్రీ కాండూరు నరసింహాచార్యులు

జననము:— 15-6-1900

నిర్యాణము:— 24-1-1972

తల్లి — శ్రీమతి తిరువేంగడమ్మ

తండ్రి — శ్రీ కాండూరు రాఘవాచార్యులు

మతము, కులము:— హిందూ బ్రాహ్మణ— శ్రీ వైష్ణవులు

జన్మస్థలము:— మహబూబ్‌నగర్ జిల్లా—'వనపర్తి' (కడప జిల్లా జమ్మలమడుగులో స్థిర నివాసమేర్పరచుకొనిరి)

శ్రీ కాండూరు వారు కడుపేద కుటుంబమున పుట్టినవారు. తమ యారవ యేటనే తండ్రిని కోల్పోయి తల్లి సంరక్షలో పెరిగిరి. భిక్షాటనము చేసి ఆమె తన యిరువురు కుమారులను పోషించినది. పెద్ద కుమారునకు విద్య అబ్బలేదు. రెండవ కుమారుడైన నరసింహాచార్యులనైనను విద్యావంతుని జేయ ఆమె సంకల్పించినది. ఆచార్యులవారికి సహితము విద్య నేర్వవలెననెడి కాంక్ష హెచ్చె. 1915 సం॥ నుండి 1926 సం॥ వరకు ప్రొద్దుటూరు, మదరాసు, మైసూరు, బెంగళూరు కళాశాలలలో సంస్కృతాంధ్రములను నేర్చిరి.

1926 సం॥ నుండి 1955 సం॥ వరకు కడప జిల్లా జమ్మలమడుగు పి.ఆర్. బోర్డు హైస్కూలులో ప్రధానాంధ్ర పండితులుగా పనిచేసిరి. వీరికి సంస్కృతాంధ్రము లందు మంచి ప్రావీణ్యము కలదు. సాధారణముగ వీరు ప్రాపంచిక పరిణామములను విమర్శించుకొనుట యొక యలవాటు. వీరి రచనలో అట్టివిశేషములే గోచరించు చుండుట గమనింప దగినది.

సాంఘిక యితివృత్తమును గైకొని చక్కటి సాంఘిక ప్రబంధమును తీర్చి మెప్పులు బడసిన ఘనత శ్రీ కాండూరు వారికి "మోహన విజయము" అను కావ్యముతో దక్కినది. ఇట్టికావ్యము లప్పటిలో పలు విమర్శలకు గురియైనను, ఆచార్యులవారు వాటిని గణింపక 'నాదృష్టివేఱు' అనురీతి యెదురొడ్డిరి. వారి దృష్టిలో సందేశమే ప్రధానము.

ఇందు మోహనుడు ప్రధాన నాయకుడు. అతని తండ్రి విశ్వపతి లోభి. కుమారుని విద్యకు సహితము ధనము వెచ్చింప నుత్సహింపని వాడతడు. మోహనుడు తుదకు ప్రభావితుడై విద్య నభ్యసించుకై దూరదేశముల కేగినాడు. దేశాటనమువలన అతనికి విద్యతోబాటు లోకజ్ఞాన మలవడినది. విద్యావంతుడై తిరిగివచ్చిన కుమారునకు 'వరకట్నము' విశేషముగా నిచ్చునొక సంబంధమును తండ్రి కుదిర్చినాడు. మోహనుడు తండ్రికి హితబోధచేసి, తాను ప్రేమించిన సుశీలనే వివాహ మాడినాడు. ప్రతిదినము భార్యాభర్త లిద్దరూ గ్రామసంచారము గావించి ప్రకృత కాల పరిస్థితులను బట్టి దేశ పద్ధతులను, రాజ్య పాలనమును, ప్రజల కిట్లు పదేశించిరి.

ఉ॥ అన్నలు తమ్ములంచుఁ, దమ యన్వయ మందొక గుంపు వారిపై
మన్ననఁ జూపి యెన్నుకొన మాన్యపుఁ బౌరత పాడుసేయుటే,

యెన్నికలం బ్రభుత్వమున కెన్నిక సేత వివేక నూన్యులన్
గన్నెల నిచ్చి నీచులకు గాళ్లకు మ్రొక్కుచు దిర్గుటె యుగుసన్.

చ॥ ప్రజలె ప్రభుత్వ మంచడరు బాధ్యత పౌరుల ధర్మమంచుఁ దా
నిజముగఁ బౌర ధర్మముల నిశ్చల చిత్తత నాచరించు వాఁ
డు జగమునకా సునీతిపరు డుజ్జ్వల నిత్యసుఖంబు లొప్పగన్
విజయము లందు చుండుఁ బృథివిన్ సహభావము లుల్ల సిల్లగన్.

ఇట్టి సాంఘిక విషయముల పెక్కింటిని వారచ్ఛటచ్చట
తమ కావ్యములందు తడిమిరి. "వినోద—బహిష్కరణము" లను
బడు ఖండ కావ్యమునందు సహితము పేర్రియసి ప్రియుల మనో
భావములు దేశసేవ సలుపుటయందు నిమగ్నము కావలెనని ప్రబో
ధించిరి. "బహిష్కరణ" ము నందు శ్రీ యామునాచార్యుల వారు
గవించిన హరిజనోద్ధరణ విధానమును సూచించిరి.

"మారన" యను మాలవాడెట్లు రంగశాయి భక్తుడయ్యెనో
యిందు వివరింపబడినది. చక్కటి శైలిలో సరళముగా పద్యములు
సాగినవి. మారనకొక యతిపతి యుపదేశము లభించినది. దానితో
అతడు శ్రీరంగని సేవించుటకై శ్రీ రంగపట్టణమునకు బయలు
దేరినాడు. శ్రీరంగ పట్టణము నిట్లు కవిగారు వర్ణించిరి.

సీ॥ రంగత్తరంగ నిర్మల వారిపూర్ణమై
యుభయ కావేరు లింపారఁగు చుండ
భక్తులు బ్రోవ నిర్బంధించి నట్టుల
నేడు ప్రాకారంబు లెనఁగు చుండ
శ్రీ వైష్ణవుల గోష్ఠి సేవింపఁ దలకొని
దివ్య ప్రబంధ గీతికలు పాడ
సంభృతానంద సంస్తవన మోహన లీలఁ
గొబ్బరి తోఁపులు గులుకు చుండ

తే॥ హాయి శ్రీశేషశాయి యై యలరు చుండు
రంగపతి సేవసేయ శ్రీరంగ పురికిఁ
దరలె "మారడు", దివ్యబోధంబు గలుగ
నైహికా పేక్షఁ గుమిలెదు ననద గలఁడె?

వీరి మరియొక ఖండకావ్యము ' పూలతోఁట '. ఇందెన్నో సుగంధ కవితా కుసుమములు విరబూచినవి. తోటలోని వివిధ పుష్పములవలె పెక్కు విషయములిందు ప్రస్తావించ బడినవి. అప్పు చేయుట యెంతటి తప్పో, అదెంతటి ముప్పునుగొని తెచ్చునో ఈ క్రింది పద్యమున మనకు విదితమగును.

ఇంద్రుని యంత వారు నిను నెమ్మెయి నమ్మినఁ గొంపఁ గూల్తు, రా
జేంద్రులనేని బొంక వలపిచెందు. నీయెడ నీతి నున్న, ని
స్తంద్రులనైన నీవలపు తంత్రమునం బడద్రోతువా హరి
శ్చంద్రుఁడె నిన్ను నమ్మి యగచాట్లకు లోనయికుంది క్రుంగడె॥

కాయ కష్టమునను గలియేని గంజియే
గుడిచి తృప్తినందుఁ గోవిదుండు
చేత కాని కుమతి చేసిన యప్పులఁ
దీర్చలేక సతము దిగులు చెందు.

పేద రైతుకు కష్టముమెండు. దానికితోడు దురదృష్ట మెదురైనచో యతని దీనావస్థ జెప్పనలవికాదు. ఒక పేదరైతు అదృష్ట మెట్లున్నదో సహజముగా నిరూపించిరి. చూడుడు.

ఎద్దులఁ గొన్నబాకి పరికింపగ దీరక మొన్నెరోగ మా
యెద్దుల బొట్టబెట్టుకొని యేచగ దానికదోడు నిత్యమున్
చద్దుల మోసి మోసి బహు సంకట పాటును కోర్చు భార్యయున్
ముద్దుల బిడ్డలాకటికి బొక్కుచు నుండగ జింత యుండదే.

అశోక రాజ్యము, రామరాజ్యమనునవి వీరి మహా ప్రబంధములు. రామరాజ్యము నందు రామాయణ గాధను వ్రాసిరి.

'మన దేశమున రామాయణము వ్రాయని కవిలేడు. ఎందఱు వ్రాసినను విసుగు జనింపని లోకోత్తర గుణవిశేషములును, ధీరోదాత్త నాయకుడందుండుట ముఖ్య కారణములైనవి. స్వతంత్ర భారత దేశమును రామరాజ్యముగా భావించు కొనుచున్నాము. అందెంత వరకు సత్యమున్నది? రాముని యవతారము, అతడెదుర్కొనిన కష్టపరంపరలు, సాధించిన ఘనకార్యములు, అతని పరిపాలనా పద్ధతి మొదలగు నంశములను గ్రహించి, ఆవిధముగా నడచుకొన్నప్పుడే మన రాజ్యము 'రామరాజ్యము' కాగలదు. ఈ విషయమెల్లరు గ్రహింపవలెనని నేను రామకథను సులభముగ సంగ్రహముగా లోకమునకు వెల్లడించుటయే నా పరమోద్దేశ్యము.' అని కవిగారు తెలుపు కొన్నారు.

రామలక్ష్మణు లెట్లు తమభోగములు విడిచి యరణ్యవాసమునకు యోగ్యులై వెళ్లిరో సీ క్రింది సీసపద్యమున రమ్యముగా జెప్పబడినది.

సీ॥ పట్టు పుట్టంబుల పసమించు మొలలపై
నార చీరల జిగి నాటి మెఱయ;
నునుపరి కుసుమ వాసనల నింపు దలిర్చు
సిగలు జడకట్టాల్చ మొగము లలర;
గస్తూరి కాంగ రాగములు పిసాళించు
మేన నంతట బూది మెఱుగు లీన;
రంగు మిఱిడు పాదరక్షలం బొలుపొందు
నడుగులు పావల నంద గింప;

తే॥ చాప నమ్ముల పొదులు బుజమ్ము లెక్క
మూర్తి గైకొన్న సన్యాసమో యనంగ
రహి వహించెడు శ్రీరామలక్ష్మణులకు
బోగములు వీడ సన్యాసయోగ మమరె.

ఇట్లి మహా ప్రబంధమును రచించి కవిగారు పుణ్యమును, పురుషార్థమును సాధించిరి. వీ రి త ర కృ తు లు పెక్కు గలవు. హర్షుడు, భీష్ముడు నీ రెండునూ విద్యార్థుల కుపవాచకములుగా నుండినవి. రంగనాథ శతకము, కావ్య ప్రకాశ వివరణము, సాహిత్య విచార చంద్రిక, సందేశము. చంద్రా పీడుడు, కలభాషిణీ చరిత్ర, ప్రారంభ వ్యాకరణము మొదలగునవి వీరి కృతులలో ముఖ్యమైనవి. మహాశ్వేత—పరివర్తనము వీరి అముద్రిత నవలలు.

ఆస్థానకవులుగా నుండిన శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రిగారు వీరికి 'కవిరాజ' యను బిరుదము నిచ్చిరి. కవిత్వముతో బాటు ఆయుర్వేదము నందు అమోఘమైన అనుభవమును సంపాదించి వైద్యవృత్తిని నెరవేర్చిరి.

భార్య అంధురాలు. ఆయనకు యిద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు కలరు. కుమారుడు శ్రీ కాండూరు రంగ రామానుజా చార్యులు, ప్రొద్దుటూరులో ప్రస్తుతము నివసించు చున్నాడు. ఆచార్యులవారు తమ యుద్యోగమును విరమించిన తరువాత తమకు గల శ్రావ్య మధుర కంఠముతో ప్రవచనములు సాగించుచుండిరి.

అంతటి మహాసీయులు డెబ్బది రెండేండ్లు జీవించి, తనువును చాలించిరి.

———— o ————



అభినవగౌరవ

## శ్రీ గార్లదిన్నె సుబ్బారావు

జననము:— 1893

నిర్యాణము:—1966

తల్లి: శ్రీమతి నరసమ్మ

తండ్రి శ్రీ పెద్దనారాయణప్ప

మతము, కులము:— హిందూ—బ్రాహ్మణ—స్మార్తులు—
కౌండిన్యస గోత్రులు,

జన్మస్థలము:— 'సోదనపల్లె' అనంతపురం జిల్లా.

శ్రీ సుబ్బరావుగారి పూర్వీకులు అనంతపురం జిల్లా 'సోదనపల్లె'లో నివసించిరి. వీరి వంశకర్త పెద్ద నారాయణప్పగారు. అతడు కీర్తిధనుడు. ఆ పల్లెకు దణి.

ఈ కవిగారి వంశవృక్ష మిట్లున్నది.

| | |
|---|---|
| గార్లదిన్నె సుబ్బారావుగారి | తండ్రి:—శ్రీ పెద్దనారాయణప్పగారు<br>తాత:— శ్రీ సుబ్బరావుగారు<br>ముత్తాత:— శ్రీ అశ్వత్థప్ప<br>ముత్తాత తండ్రి:— శ్రీ పెద్ద నారాయణప్ప (వంశకర్త) |

కవిగారు తమ విద్యను గూర్చి ఉత్తర హరిశ్చంద్రీయములో నిట్లు వ్రాసుకొనిరి.

ద్వి: దేశభాషా పయోధిని వెలుసద్ది
సేవించి సంతృప్తిఁజెందితిఁగొంత
తైలింగ భాషాతరంగణిన్ మున్గి
తేలుచు, మఱి మున్గితేలితిఁగొంత
గణిత శాస్త్రంబను – ఘన కూపమందు
మునిగి లోతరయఁగ పాచలితిఁగొంత
అవని నిబ్బంగి, విద్యామహత్వముల
తవణిల్లి యున్నవారను, గురూత్తముల
సేవించి, తత్ప్రియాశీర్వాద పూత
జీవిత సౌఖ్యంబుఁ జెంది యున్నాఁడ;
ఏపని కెంచేని నేవేళనైన
శ్రీపతి పదములే చేపట్టి నాఁత
సుబ్బరాయాఖ్యతఁచొప్పడి నాఁడ
గబ్బంబు వ్రాయగా గడఁగితి నిట్లు

సుబ్బరావుగారు గౌరనచే పూర్వము వ్రాయబడిన హరిశ్చంద్ర కావ్యములోని యంశము లెల్లను గ్రహించి, కథారుచికొఱకు కొంత కల్పించి ద్విపదలో వ్రాసిరి. ఈ కార్యమునకు బ్ర॥ శ్రీ॥ విద్వాన్ తొగర్చేటి భాస్కర సిద్ధాంతుల వారు ప్రోత్సహించిరి. గౌరన గారి కావ్యమునకిది తరువాత దగుటచే దీనికి 'ఉత్తర హరిశ్చంద్రీయ' మని పేరిడిరి. ఈ కావ్యమును 1935వ సం॥ జూన్ నెలలో శ్రీయుత రాచోటి రామయ్యగారికి (ఆదోని) అంకిత మొసంగిరి.

ఈ ఉత్తర హరిశ్చంద్రీయము ఆరు ఆశ్వాసముల ద్విపద కావ్యము. ఇందలి తృతీయాశ్వాసములో చంద్రమతి నిట్లు కవిగారు వర్ణించిరి.

(హరిశ్చంద్రుడు తన మనంబున నిట్లు తలచుచున్నాడు)

" ఈ రామతోఁజెల్మియేపారి సౌఖ్య
వారాశిఁదేలని వాని యందంపు
కన్నులు సున్నలు; కళలొప్పు మొగము
చెన్నులు సున్నలు; చెలువొందు కేలు
దమ్ములు వమ్ములు; తగవాని కౌరి
యమ్ములు దిమ్ములు; నాయత బాహు
దండముల్ ఖండముల్; తద్దయు వాని
పండుగల్ దండుగల్; పడసిన పెన్ని
ధానంబు న్యాసంబు; ధరణిలో వాని
ప్రాణంబు క్షీణంబు; పల్కులింకేల?

...... ...... ...... ......

'కలకంధర' యేకుల వడకుటను కవిగారిట్లు వర్ణించిరి.

ద్వి: తోడి చేడెలఁజూచి దొడ్డరాటంబు
వేడుకఁ దానును బెట్టికొనుచు, న
నేకుల కుపయోగ మేకుల వృత్తి
కే కొలగలదని యేకుల వడుకు
రాటము ముందట రతనంపు జిన్న
పీటపైఁగూర్చుండి బిసరుహపాణి
కుడికాల రాట్నపు కొనపీటద్రొక్కి
యెడమ హజ్జనిలుపు నిలజిక్క బట్టి
కడియముల్ గాజులు కట్లు తోడాలు
బడిబడి ఘల్లని ధ్వనిసేయు చుంత
గుడిచేతితోఁబిడిఁగొని త్రిప్పి త్రిప్పి
ఎడమ కేలునఁనేకు నెగయాడ్చి యాడ్చి,

తన చూడ్కి యేకుతో దారంబుతోడ
ననుగమింపఁగ దార మప్పుడునపుడు
కదురుకుఁ జుట్టిన క్షణమాత్రమందు
బెదరు జింక తెఱంగు వీక్షణల్ ద్రిప్పి
చేయెత్తినప్పుడు చెఱఁగు దొలంగు
నాయెడ వామ కుచార్థభాగంబు
పొడసూపి ముచ్చటల్ ముంచి వైవంగ
వెడదనెన్నుదుటి పై స్వేదబిందువులు
బొడముచు నవసితాంభోజంబు మీద
బెడగారు ప్రాలేయ బిందువు లట్లు
తొప, నీరీతి నా తొయ్యలి రాట
మాపక త్రిప్పు చున్నట్టి కాలమున

---

కవిగారి హృదయములో గాంధీగారి జాతీయ భావములు, దేశీయ వస్త్రపరిశ్రమ, రాట్నసంగీతములు, మెదలుచుండె ననుటకీ 'ఏకులవడకు' వర్ణనమే నిదర్శనము.

వీరు హరికథలను కూడా వ్రాసిరి. అవి వ్రాత ప్రతులుగానే నిలిచిపోయినవి. రుక్మిణీ కల్యాణ హరికథలో రుక్మిణీదేవి గౌరీ పూజ కరుగు వర్ణన ఎట్లున్నదో చూతము.

సీ. భీష్మకాలయ సుధాబ్ధిని వెలువడి కళల్
దేఱెడు నిందిరాదేవి యనగ;
తన జనంబులకు, దర్శన మీయ రూపొంది
యరుదెంచు నవ్వీటి సిరి యనంగ;
చైద్యాది దానవ సమితి మోసము సేయ
జనుచున్నయట్టి, మోహిని యనంగ;

భక్తావసుండగు పద్మదళాక్షుని
కవియు బోయెడు కీర్తి కాంతయనగ
గీ. నిజగృహమునకుఁజను, 'భవానియె'యనంగ
నృప సమూహము డిగనాడి కృష్ణు నందె
లక్ష్య ముంచుచు జను, జయలక్ష్మి యనఁగ
గ్రాలె రుక్మిణి రాజమార్గంబు నందు.

వీరు వ్రాసిన 'దుర్గాదాసీయము'న బడు నాటకము గూడ వ్రాత ప్రతి గానే నిలిచిపోయినది. ఆ నాటకమునందు దుర్గాదాసు గావించిన వీర విహారము నిట్లభివర్ణించిరి.

సీ॥ తోలెనా గుఱ్ఱముఱ దుముకుచు రణమున
నెదిరి గుఱ్ఱంబులు బెదరి పారు;
త్రిప్పెనా ఖడ్గమున్ దెసలు దీపింప; న
రాతి నేత్రంబులు మూత పడును;
విసరెనా యసిలతన్ వెసవెన పగఱ, త
లలు డుల్లు తాళఫలంబు లట్లు;
విడిచెనా బాణముల్ వీకవైరుల తనుల్
గుదులుగా గుదులుగా-గ్రుచ్చి పోవు;
గీ॥ మూలబలము పై శ్రీరాముపోల్కి కదన
రంగ మందెల్ల యెడలఁ గనుంగొనంగ
చక్రభంగి దుర్గాదాసు విక్రమించి
యుండె నే మందు నతని శౌర్యోజ్జ్వలంబు.

1) కృష్ణశతకము 2) రామకుమారాభ్యుదయము (నాటకము) 3) అనసూయామహిమ (నాటకము) అనబడు గ్రంథములు వ్రాసినట్లు ఉత్తరహరిశ్చంద్రీయములోని ఉపోద్ఘాతము

ద్వారా తెలియుచున్నది. వీటిని కీ॥ శే॥ బదినేహాళు తమ్మిరెడ్డిగారు ముద్రించిరి.

ఇట్టి యజ్ఞాత కవుల వివరములు తెలుసుకొనుటకు భగీరథ ప్రయత్నమే చేయవలసి యుండును. కవి వంశీకు లీవిషయము లందు సహకరింప నుత్సహింపనిచో వారు కృతులలో వ్రాసుకొన్న విషయములు తప్ప హెచ్చు విషయములు తెలుసుకొనుట కవకాశ ముండదు.

ఈ ఇరువదవ శతాబ్దకవుల విషయములే మన కగమ్యగోచ రములైనప్పుడు, పూర్వ కవుల విషయములిక జెప్పపనిలేదు. కాన కవివంశస్థు లట్టి వారి చరిత్రలను వ్రాసి వుంచుకొని, వెలుగు లోనికి దెచ్చి, వంశకీర్తి నినుమడింపజేసి ధన్యులగుదురని మా విశ్వాసము.





సాహిత్యసరస్వతి

## శ్రీ సిరిపి ఆంజనేయులు

జననము:— 1—6 1891

నిర్యాణము:— 27—11—1974

జన్మస్థలము:— ధర్మవరం
అనంతపురం జిల్లా

తల్లి:— నారమ్మ

తండ్రి:— రామన్న

మతము; కులము:— హిందూ—కాపు

కవిగారు తమ విద్యాభ్యాసమును ధర్మవరము వీధిబడుల లోను, మిషన్ వారి పాఠశాలలో ప్రాథమిక విద్యయు జరిపిరి. తండ్రిగారి యాదేశాను సారము చిన్ననాడు కొంతకాలము వృత్తి విద్యయగు వ్యవసాయమునకే ప్రాధాన్యమిచ్చినట్లు వారు వ్రాసు కొన్న పద్యముల ద్వారా మనకు విదితమగు చున్నది.

నన్నుఁదనవలెఁ గృషక సంపన్నుఁజేయ
నెంచి, మజ్జనకుఁడు నియోగించె 'పొలము
పనుల యెడ నష్టచూపుట పాడి' యనుచు
నట్టి మొదలను దలదాల్చి యడరు గంటి.

బండి తోలుట, మేడిని బట్టుటయును,
జేతఁ గొని పార గనిమలు చెక్కుటయును,
మ్రాను గడుపుట, యిట్టి కర్జములనెల్ల
నాకు నామాతులుఁడు, కొన్నినాళ్లు గఱపె.

శ్రీ సీరిపి ఆంజనేయులుగారి వృత్తి ఒజ్జరికము. తాము చదివిన 'మిషను' వారి బడిలో 1911 నుండి 1920 వఱకు పదేండ్లును, మాండలిక మాధ్యమిక పాఠశాలలో ఐదేండ్లును. (1920 నుండి 1925 వఱకు) అనంతపురము నందలి స్త్రీల ట్రయినింగ్ స్కూలు నందు యిరువది రెండేండ్లును(1925-46) పనిచేసి విశ్రాంతి బడసిరి. చిరకాలము ఆంధ్ర భాషా సేవకే పాటు బడిరి, విద్యార్థులచేత తెనుగు పరీక్షలకు కట్టించెడివారు. పూర్వజన్మ సుకృతాను సారము వీరి కాదర్శగురువుల సన్నిధి, కవిత్వమలవడినది.

కలకత్తా యందలి 'నిఖిల భారత సాహిత్య విద్యా పీఠము'న కథానిక, నవలా రచనా విభాగమునకు జెందిన ప్రత్యేక పట్ట పరీక్షయందు 1921వ యేట, నత్యుత్తమ శ్రేణిని జయమంది,

సాహిత్య సరస్వతి' యను బిరుదము వడసిరి. ధర్మవరమున 'విజ్ఞాన వల్లికా గ్రంథమాల'ను స్థాపించి తమ రచనలనే కాకుండా తదితర కవిపుంగవుల పుస్తకములను సహితము ముద్రించిరి.

విజ్ఞానవల్లి – ప్రకృతిమాత – విద్యార్థి మున్నగు పత్రికలకు వీరు సంపాదకత్వము వహించి వానిని సమర్థతతో నడిపి, ప్రాజ్ఞుల ప్రశంసల నందుకొన్నారు.

సాహిత్య ప్రక్రియలోగల యన్ని ప్రధాన పోకడలను వీరు చేపట్టిరి. చారిత్రాత్మకాంశములను పరిశోధించి గ్రంథస్థ మొనరించిరి. వీరు వ్రాసిన చరిత్ర గ్రంథములలో ముఖ్యమైనవి. 1) విద్యానగర చరిత్రము 2) విద్యానగర వీరులు 3) ధర్మవర చరిత్రము 4) అనంతపుర మండల ఆదిమవాసుల చరిత్ర 5) చిక్కప్ప యొడయరు లేక చిక్కన్నమంత్రి 6) ముసలమ్మముక్తి.

అప్పటిలో పాఠకులు నవలలు, నాటకము లందాసక్తిని గల్గి యున్నారని యెఱింగిన సీరిపివారు తమరచనా పోకడల నటువైపుకు కూడా కొంత మరల్చిరి. 'శారద' యనబడు వీరి అపరాధ పరిశోధక నవలకు మంచిపేరు లభించినది. తదుపరి వీరు వీరవిలాసము. కుముదవల్లి యను నాటకములను రచించిరి. కుముదవల్లి నాటకమును శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల వారు తమ తొమ్మిదవ పుష్పముగా ముద్రించిరి.

పై గ్రంథములేకాక 1) గౌతమ బుద్ధ చరిత్ర 2) సీతారామావధూత చరిత్ర 3) అన్యాపదేశము మున్నగు కృతులను వీరు రచించిరి. వీరు తమ విజ్ఞాన వల్లికా గ్రంథమండలీ ముఖమున

శ్రీ నారునాగనార్యుడు, శ్రీ వేదం వేంకటకృష్ణశర్మ శ్రీ కుంటి మద్ది శేషశర్మ, శ్రీ కల్గోడు అశ్వత్థరావు, శ్రీ విద్వాన్ విశ్వం మున్నగు ప్రముఖ రాయలసీమ కవి పుంగవుల పొత్తములను ముద్రించి కృతిభర్తలైరి. సాహిత్యపోషణే కాక భూరిదానము లిచ్చిన త్యాగమూర్తులు వీరు. ఆంధ్రప్రదేశ్ సర్వోదయ పక్ష భూదాన సమితికి 72 ఎకరముల నేలను 1957వ సం॥న భూరి విరాళ మిచ్చిరి. భారత రక్షణ నిధికై రూ. 1116/—లను ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రి ద్వారా నొసంగిరి. 1949వ సం॥ లో ధర్మవరమున రైల్వే జంక్షనునకు పడమర 120 ఎకరాల సొంత నేలను విశాలమగు వీథుల నొప్పెడి యొకపేటగా 'ఆంజనేయపుర' మను పేర నెలకొల్పి నారు. ధర్మవరమున కళాశాల భవన నిర్మాణమునకు 24 ఎకరముల భూమిని స్వచ్ఛందముగ దానమొసగిన త్యాగశీలురు వీరు.

ప్రకృతి వైద్యమును నమ్మి నిర్విరామ ప్రచారమును గావించిరి. ప్రకృతి మాతను సేవించిరి. వారు ఎనుబది మూడేండ్ల వయసులోను నవయవ్వనులకంటె హెచ్చగు నారోగ్యమును బొంది యుండుటకు కారణము వారు ప్రకృతి చికిత్సను గాఢముగా విశ్వ సించి యుండుటయే.

సీరిపి వారి 'కరుణగీత' యొక విషాద పరిస్థితులందవ తరిం చినది. ధర్మవరమున 1919లో నూరజాతర పేర నూటారు నోరు లేని జంతువులు బలియైనవి. ఆ మహాఘాతుక కార్యము కవిగారి హృదయమును గదల్చినది. అదిట్లు గీతముగా సాగినది.

...... ...... ...... ...... ...... ...... ...... ......

చీమనేనిఁ బుట్టింపఁగా జేత గాని
నరుఁడు, పరులను జంప నే కరణిఁ దగును?

ప్రాణి హింసన మెల్ల యీశ్వరుని హింస
ఈశునకు క్షమార్హుఁడుగాఁడు హింసకుండు.
కాన నే ప్రాణికైన నేకడలనైన
నెప్పుడైన నొక్కింతయు హింస లేక
ప్రజ్ఞమై మననేర్చుట పరమ హితము
ప్రేమ రసమొల్కఁ బ్రాణులఁ బెనుచు చుంట
ఈశ్వరా రాధ నమ్మది శాశ్వతమ్ము
ధర్మ మార్గమ్ము పరమ పదమ్ము గనుఁడు.

వీరి 'అన్యాపదేశము' అనంతపురము రాయలకళా గోష్ఠి వారిచే ప్రకటింపబడినది. ఇందనేక విషయములు రమ్యముగా వ్రాయబడినవి. 'బూటకము' శీర్షికలో కవిగారు దిష్టి బొమ్మ నిట్లు వర్ణించిరి.

కాయమూ వట్టి కఱ్ఱ; కన్గవయుఁదొఱ్ఱ;
మస్తకము మట్టి బుఱ్ఱ; జన్మమ్మె పఱ్ఱ;
బూటకపు గావుపై పొలములను నిల్చి,
జంతు సంతానముం జడిపింతు వౌర!

గుట్టు సాగిన దాక నీకొలువు సాగు
నో బెదురుబొమ్మ! గుట్టు రట్టైంచె నేని
యెపుడు నిన్నొక మనిసిగా నెన్నువాడు?
వెస మెన్నాళ్లు మూసి దాపెట్టఁ గలము?

అమాయకత్వమును గూర్చి కవిగారిట్లు వ్రాసిరి.

కొమ్ము గవఁబన్ను నూలిపోగులను జుట్టి.
పొసగ బండారు కుంకుమల్ నొసటఁ బెట్టి;
గళమునఁ వేప మండ దండలను గట్టి,
పొలియిడగ నిన్ను గుడికిఁ గొంపోవు వేళ;

పెనురవమ్ము లెనంగఁ దప్పెటలు మ్రోయఁ
గొలువుగోలది నీగొంతు కోఁతకే యని
తెలియు నేరక, బయలి చూపుల వెలార్చి
వెడలు దువు గంతులిడుచు నో వెఱ్ఱి గొఱ్ఱె!

అనంతపుర మండలమున వీరి శిష్యులు పెక్కుమంది పెద్ద పెద్ద యుద్యోగములందుండి, వీరిని స్మరించుకొను చుందురు.

శ్రీ సీరిపి ఆంజనేయులు తమ 83వ ఏట జబ్బుపడి ప్రకృతి చికిత్సానుసారము రెండు దినము లుపవసించిరి. నీరు మాత్రమే తీసుకొన్నారని వారి భార్య సీరిపి సావిత్రిమ్మగారు చెప్పిరి. నీరస స్థితిలో ఆస్పత్రి జేరిరి కాని లాభములేక పోయెను. తమ స్వగృహములో 27–11–1974వ తేది స్వర్గస్థులైరి. వీరి భార్యకూడ ఒక సంవత్సరములోనే తీరుకొన్నారు. వీరికి సంతానమేమియు లేదు.

వీరి గృహములోనే పుస్తక భాండాగారమున్నది. అమూల్యమైన పుస్తకములను వీరు సేకరించిరి. అనంతపురములో పెద్ద మహడీ ఇండ్లు మూడుగలవు. ఇప్పుడు వీరి ఆస్తి అన్నకొమారులకు, మేనల్లునికి దక్కినది.

తమ జీవితమును సాహిత్యసేవ కుపయోగించిన పుణ్యధనులు వీరు. ఇట్టి సాహిత్య పోషణను కవిగారి వంశీకులు చేపట్టి వారి కీర్తి నినుమడింప జేతురని తలంచుచున్నాము,





## శ్రీ పిళ్లారిసెట్టి రంగబ్రహ్మారావు నాయుడు

జననము.— 1890

నిర్యాణము:— 1962 ఆ ప్రాంత్యము

తండ్రి:—పిళ్ళారిసెట్టి శ్రీ కృష్ణులునాయుడు

తల్లి:— పేరు తెలియదు

మతము, కులము:— హిందూ–అదివెలమ

చేసిన ఉద్యోగము:— బళ్ళారిలో, తహసీలుదారు పని

1930 లో ఆదివెలమ శతకము, సీస పద్యములతో వ్రాసినారు. ఈ శతకములో శ్రీ విలసిల్లు బృందావనములో, కృష్ణమూర్తి జన్మించిన రీతిగా, ఆదివెలమ కులము పుట్టుక స్థలము బృందావనమే అనగా 'బందరు' అని సూచించినారు. బందరును వీడి ఉద్యోగ వశమున అప్పటికి రాయలసీమలో నున్న బళ్ళారిజేరి తహసీలుదారు ఉద్యోగము నిర్వహించిరి. స్వయముగా కవులు.సారస్వతాభిమానులు

1931 లో, బళ్ళారిలో నెలకొల్పబడిన శ్రీ కృష్ణ దేవరాయ గ్రంథమాల వార్తవిని వారాసంస్థ మేనేజింగు ఎడిటరుగారి నింటికి పిలిపించుకొని ఇట్లు చెప్పిరి. "ఈ యుద్యమ మెంతయు, బళ్ళారి పట్టణంబునకు దగియున్నది. చేసియే తీరవలయును. పట్టుదలచే కృషి జరిగిన ధనసహాయము తప్పక కలుగును" అని ప్రోత్సహించి మొట్టమొదటనే భూరివిరాళ మొత్తము నిచ్చి, గ్రంథమాలను ప్రోత్సహించిరి. గ్రంథమాల కార్యక్రమములలో పాల్గొని చేదోడు వాదోడుగా నుండిరి. వీరిని మఱచిపోదమన్నను మఱపురాదు. వీరు అదివెలమ శతకము వ్రాసిరి.

ఈ శతకములో 173 సీస పద్యములుకలవు.

సీ. సబ్ జడ్జి పనిజేయ సామ్రాజ్యమును లేదు
బంట్రోతు పనికి లోపంబులేదు
కోటికి పడిగెత్త–గొప్పయేమియులేదు
దారిద్ర్యదశ నున్న–తప్పులేదు.
సరిగ చీరలుగట్ట–సద్గౌరవములేదు.
చవుకవి దోడుగ, నీచంబులేదు
పనివాండ్ర నియమింప। పరువు హెచ్చుటలేదు.
తానె కష్టము సేయ తగ్గులేదు

గీ. కులమె ముఖ్యము నంతకు గుణమె గొప్ప
గాని, యితరంబు లొకలెక్కగావు సుమ్ము
విమల గుణ ధన్యులగు–నాదివెలమలార!
బంధుజనులార! సత్కృపా సింధులార!

(కవిగారి నీతిబోధన)

సీ. కన్న తండ్రికిగూడ–కడు పొరబెట్టక
యెండలో పనిఁజేయనిచ్చు వారు
తల్లిపై సరియైన – దాక్షిణ్య మించక
పెండ్లాల సేవింపఁ బెట్టువారు
అక్కలన్న లటంచు, నాదరంబులులేక
రేపుమాపును. యెదురించువారు
వృద్ధ బాంధవులందు–వినయంబు జూపక
చులకనగాజూచి సొక్కువారు

గీ. కలరు మనలోన వారల కావరంబు
లణఁగి భక్తి భావలెప్పు డబ్బగలవొ?॥విమల॥
(ఇట్టివారన్ని కులములలో నున్నారుదా।)

ఇప్పటి తప్పులను, కవిగారెంత చమత్కారముగా జెప్పినారో
ఈ క్రింది పద్యము చదువండి.

సీ. చీపురు, కనపూడ్చ—చేతబట్టుటతప్పు
మునురు పాత్రలను దోముటయు తప్పు
నెత్తిపై బిందెతో—నీళ్లకేగుట తప్పు
వంటజేయుట, యంతకంటె తప్పు
బిడ్డకు పాలిచ్చి—పెంచుట యొకతప్పు
పడ్డించుఎనికూడ చెడ్డ తప్పు
చేటతో చెఱగుట—చేయగూడని తప్పు
వినరుట దంచుట—యసలె తప్పు

గీ. ఇట్టు లగుటచే, యిప్పటి యింటిపనులు
నలుపనౌకర్లు, పదిమందిచాలరైరి—॥విమల॥

(కవిగారు అత్తింటి కాపురమునుగూర్చి ఇట్లు వ్రాసిరి.)

సీ. లోపలనేయుండి—లోలోన బాధించు
మంచంబులోసల్లి—మగనితల్లి
సర్వదాబాధించి—సంకటబడఁజేయు
మగమంత్రగబ్బ యామగనియబ్బ
అతికౄరముగజూచి—యార్భాటములుజేయు
పొగరుబట్టిన కుక్క—మగనియక్క
అందిందు నెందున్న—యాక్షేపణముసేయు।
మదికినాటెడుముల్లు—మగని ఇల్లు
మగని వర్తన మెంతటి-మంచిదైన
యతివ కత్తింటి కాపురం-బార్తిగూర్చు—విమల॥

ఈ కవిగారు, మరి యే గ్రంథము వ్రాసినట్లు తెలియదు. సువాసన
గల 'గులాబి' ఒకటి చాలదా? *



కవిశేఖర, మధుర కవిరాజ

## విద్వాన్ హెచ్. దేవదానము

జననము:— 1902

నిర్యాణము:— 29—11—1954

జన్మస్థలము:— హనుమనగుత్తి బద్వేలు తా॥ కడప జిల్లా.

మతము:— హిందూ క్రైస్తవులు.

శ్రీ దేవదానముగారు క్రైస్తవ మతస్థులైనను హిందూ పురాణ, శాస్త్రములందు మక్కువ హెచ్చు. వీరు తమ కౌమార దశనుండియు శ్రీ యేసునామ సద్గురు సేవా తత్పరులై క్రైస్తవ మతభక్తి ప్రతి పాదకములైన నాటకములను మఱికొన్ని యితర గ్రంథములను రచించిరి. వీరి నాటకములు రాయలసీమ క్రైస్తవ ప్రజానీకానికి బాగుగా పరిచయమైనవి. వాటిని ప్రతియేడు వారు పండుగ సమయములందు ప్రదర్శించు చుండెడివారు. ఆ నాటకము లేవియును ముద్రింపబడలేదు.

వీరు 1927 నుండి 1934 వఱకు బళ్ళారి సెంటు ఫిలామినను హైస్కూలులో తెలుగు పండితులుగా పనిచేసిరి. అక్కడ పలువురు సాహితీవేత్తలతో వీరికి పొందేర్పడినది. అంతవరకు రాయలసీమలో లేని ఒక గ్రంథ ప్రచురణోద్యమమును శ్రీకల్లూరు అహోబలరావు శ్రీ ఘూళీ కృష్ణమూర్తి వర్యులచే కలసి వీరు కొనసాగించిరి. ఈ ముగ్గురి కృషి ఫలితముగానే బళ్ళారి పట్టణమున 'శ్రీకృష్ణదేవ రాయ గ్రంథమాల' 1931వ సం॥లో యేర్పడినది. ఆ గ్రంథమాలకు

దేవదాసముగారు కార్యదర్శులైరి. వారు గ్రంథమాలోద్యమమును కడప జిల్లాయందు బహుళ ప్రచారము గావించిరి. దేవదాసము గారిచే వ్రాయబడిన 'ప్రేమసుందరి' నవల రెండు భాగములుగా శ్రీ కృష్ణ దేవరాయ గ్రంథమాల ద్వారా ముద్రింపబడి, బహుళ వ్యాప్తిగాంచినది.

శ్రీ దేవదాసముగారు రచించిన పొత్తములలో 'మృత్యుంజయ స్మృతి' అను కావ్యము శ్రీ యేసునాథుని చరిత్రమును తెలుపు చున్నది. దాదాపు రెండు వందల పద్యము లిందుగలవు. ఏసునాథుని మృత్యుంజయునిగా స్మరించుటలో కవిగారి భావన దొడ్డది. ఆ మహాత్ముని దివ్యాత్మ మృత్యుంజయమై, దివ్యజ్యోతియైనదని కవి యాశయము. ఈ సిద్ధాంత మన్నిమతము లందును కనిపించు చున్నది. ఈ కావ్యములోని ప్రధాన ఘట్టములందు కవి నిజముగా విలపించెను. ఆ పద్యములు పాఠకుని హృదయాంతరాళమును ఛేదించివేయక మానవు. కరుడుగట్టిన హృదయమును కరిగించివేయు పద్యములవి. మచ్చునకివి చూడుడు.

మత్తే॥ తలపై ముండ్లకిరీట మొండునిచ్చి, రక్తం బొల్కఁగాఁగ్రుచ్చిఁ కా
ళుల యందున్మఱి చేతులందునను, బల్లోతుం దిగంగొట్టి మే
కులు, కష్టంబుల నొందఁజేసిరొకో! యా క్రూరుల్ యెహెూద్దీయులన్
ఖలులయ్యో! యెటులోర్చికొంటివిక, నాగాయంబులన్నా ప్రభో!

ఉ॥ బల్లిదుఁడైన యూదుఁడొక భల్లముతో నినుఁగ్రుచ్చ డొక్కలోఁ
జిల్లునఁ జిందిరక్తమటె చెంతను నిల్చిన వారిపైఁ బడన్
దల్లట మందె భక్త తతి తద్దయు నేడ్చిరి బంధులెల్ల, నీ
నల్లను జూడలేక భువి నైల్యము నొందిన పోల్కి గన్పడెన్.

'కవితా వేశముగల వారందఱికి తర్కము పనికిరాదు. వారి హృదయమందలి సామాన్య ధర్మము వేదన. అది యుద్రేకించి నపుడు వారు వాక్కులను బిగబట్టలేరు. ఆ పరవశత్వమే లోకుల నాకర్షించును.'—ఈ మాటలు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు దేవదానముగారి 'దీనాలాపము'లనబడు కావ్యముపై నుడివిరి. వార న్నట్లు దేవదానము గారార్ద్రి హృదయులు. వారు తమకుగల కవితా ధారతో సంఘ మందలి లోపములను సవరింప నావేశముతో వ్రాసిన పద్యములు పెక్కులు. మన సంఘమున కొందఱు వ్యక్తులను భవించు మితిలేని కష్టములను. వారి దీనత్వమును కవిగారు 'దీనా లాపములు' అను పేరనొక ఖండికగా దీర్చిరి. జాతర సమయము లందు జంతుబలి గావించుట మనదేశ వాసులకు పరిపాటి. ఆజాతర లందనేక మూగజీవులు తమ ప్రాణములను గోల్పోవుచున్నవి. వాటి మొఱను వినువారులేరు. అవిట్లు దీనముగా విలపించు చున్నవి.

సీ॥ మాలేతఁ కంఠాలు జాలివీడుచుఁ గోసి
రక్తంబు చిందింప ముక్తియున్నె?
అతికోమలంబులౌ యంగాలఁ జీల్చి
మా ప్రేవుల జంజాలు వేయఫలమె?
మా మృదు మాంసాలు మాడ్చి భుజించిన
హృదయ కల్మషములు బెదరి చనునె?
మా క్రొవ్వుఁ గరగించి మానక ప్రమిదల
వెలిగింపఁ పాపాలు విరియఁ బడునె?

తే॥గీ॥ ఎంత మూఢులో మానవు లెఱుఁగ రాదు
నోరులేని జంతువులను గ్రూరముగను
చంపి మాంసంబు భుజియించి యింపు మీఱ
జంతు బలులనిడితిమని సంతసింత్రు.

ఒక అనాథ బాలిక తన వేదన నిట్లు చెప్పుకొను చున్నది.

ఉ॥ తల్లియుఁ దండ్రిలేక తలదాచు కొనంగను గేము లేక, బల్
తల్లడ మందునట్టి నను దాపుకుఁ దీయుచుఁసాక గోరు నా
చల్లని దాత నొక్కరిని నత్కృప దైవము చూపునేని, నే
వెళ్ళి నమస్కృతుల్సలిపి వేడెద దీనత నన్నుఁబెంపగఙ్॰

ఇందు రజకుడు, వృద్ధుఁడు, వితంతువు మున్నగు దీనుల విలాపము లన్నియు చేర్చబడినవి. క్రొత్త కోడలుగూడా ఈ దీనావస్థ తప్పించు కొనలేదు. ఆమె తన వేదన నిట్లు తెల్పుకొన్నది.

ఉ॥ ప్రక్కలఁ జూడరాదు, మఱి పాటల నెవియుఁ బాడరాదు; నే
నొక్కెడఁ గూరుచుండి మనసొప్ప విరామము నెందరాదు; తాఁ
గక్కన మంది యత్తదస కన్కిన రత్యాధికంబుగాఁగ, నా
పుక్కకు వచ్చితిట్టి వెన రచ్చకు నీడ్చుచునుండు నీర్ష్యమై.

భారత దేశమందలి దారిద్ర్యమును, కూటికఱవును. కుల మత భేద పిశాచము మొదలగు ననర్థములను మనసు నందుంచు కొని, కవిగారు 'ఆకటిచిచ్చు' అను పద్యకావ్యమును రచించి గాంధీ మహాత్మున కంకితమిచ్చిరి. మహాత్ముని యున్నతాశయములను, హరిజనోద్ధరణమును ముఖ్యముగా దృష్టియందుంచుకొని. వీరు తమ హృదయ కుహరమునుండి యుప్పొంగిన భావ తరంగ ధ్వనుల నెప్పటి కప్పుడు ఊహాగానముగ రచించిరి. కుడిచి కూర్చొని పద్యము లల్లెడి స్వభావము వీరికిలేదు. శబ్దాడంబరమునకు గాని, రసాలంకారాది కావ్య లక్షణములకుగాని ప్రాకులాడిన వారు కానేకారు. తన మనోభావములను పాఠకులకు తేటతెల్లని తెనుగునుడికారములతో సులభముగా బోధ పడునట్లు వ్రాయుటయే వీరి అభిమతము

ఒక అనాథ హరిజన స్త్రీ తన పిల్లల కన్నముబెట్ట లేని దుస్థితిలో చిక్కుకొన్నది. ఆమె గింజలకొఱకెందరినో అర్థించినది, అందరావిడకు మొండిసేతులే చూపిరి. ఆవిడ తనకసికొద్ది ఆపల్లెను పల్లెవాసులను దూరినది. తుదకొకరెడ్డి, పనివారికి కూలిధాన్యములు కొలిచి వేయుట నామెగాంచి, అతనిని యాచించినది. అతడు కోపించి కసరుకొన్నాడు. ఆమె ఇట్లు తనబాధను వెళ్ళగ్రక్కినది.

కం॥ హరిజనులని, పిలుతురుమము
హరి జనులమె యైన లచ్చి యరయదె కరుణన్?
హరిజనులము కాముధరణి,
హరునిజనులుః మేము ; బిచ్చ మడుగుట గలిగెన్.

ఉ॥ ఆకటిచిచ్చు దారసిలి యగ్నులు గ్రక్కుచు రోఁత మాటలన్
మీకడఁ బల్క జేయఁగను మిక్కిలి ప్రేలుచు నున్నదాన; నా
యాకటి బాధదీర్చి యిపుడాదర మీయగ నెవ్వరుందురో
మీకొక దండమయ్య! యిక మీదయఁ బాపుడు నేఁటి యాకటిన్

ఇట్టి సహజమైన దృశ్యముల నత్యంత రమణీయకముగ చిత్రించునేర్పు అందఱి కలవడదు.

కడప మండలమున జరిగిన నొక విచిత్ర సంఘటన శ్రీ దేవదానముగారి కలముద్వారా 'స్వప్నవల్లభుఁడు' అను కావ్యముగా అవతరించినది. దీనిని శ్రీ కృష్ణదేవరాయగ్రంథమాల వారు తమ 12వ పుష్పముగా, ప్రకటించిరి. ఇందలి నాయికా నాయకులు జనపద మందలి యువతీ యువకులు. కావ్యము విషాదాంతము. ఇట్టివి ప్రాచీన కావ్య లక్షణములకు విరుద్ధము. కాని కాలానుగుణముగా కవుల నాశయములు మారుచుండుట సహజము.

ఈ కావ్యమునందు శౌరిరెడ్డి భార్య నరసాంబ సంతతి కొఱకు జేయు పూజాపునస్కారములన్నింటిని "క్రైస్తవ కవి శేఖరులు" వర్ణించిన తీరును జూడుడు.

సీ॥ అరుణోదయమ్ముల నరిగి దేవాలయ
  మ్ములకు, దేవతలకు మ్రొక్కుచుండు,
నాగుల కడకేగి నమ్రతఁ బూజించి
  వల్మీకముల యందుఁబాలు వోయు,
పిప్పల పిచుమంద। వృక్షముల్ జంటగా
  బెరిగినఁ జుట్టును దిరిగి మ్రొక్కు.
శ్రావణంబుల లక్ష్మిదేవి పూజలు సల్పుఁ
  గార్తీకముల యందుగౌరిఁ గొల్చు

తే॥ నంతు వడయుట కెన్నియో। శ్రమలు వడుచు
నేట నేటను ఫలమున కెదురు చూచు
జిన్నెలేవియుఁగనకున్నఁ జిటి ముటి పడు
వేల్పులయెడలఁ దా గడు విసువు సెందు.

శౌరిరెడ్డి నరసాంబలను కరుణించి, భగవంతుడు వారికొక యాడుబిడ్డను ప్రసాదించినాడు. ఆమెకు లక్ష్మియని నామకరణము చేసిరి. లక్ష్మిబాల్యమును కవిగారు చక్కగా వర్ణించిరి. యౌవనమున లక్ష్మి చెన్నుడను యువకుని మోహించినది. వారిరువురి ప్రేమాను రాగములు రానురాను యినుమడించినవి. చెన్నుడు దురదృష్ట వశమున పాముకాటుకు మరణించినాడు. లక్ష్మి యతనినే తన భర్తగా నెంచి తన ప్రాణములు పోవువఱకు వైధవ్యము ననుభవించి, విరాగి యై తుదకు ప్రియుని సమాధి ప్రక్కనే ఆమె జీవసమాధి చెందినది.

తే॥ ప్రేయసి ప్రియు లీరీతి। పృథివి పీడ
దీప ధూప నైవేద్యాల । నేపుమీఱ

నా నమాధుల విలసిల్లె ననవరతము
కీర్తికాంతు లలరఁగ నాక్షేత్రమందు.

వీరి రచనల నన్నింటిలోను విషాదకర విషయములే ప్రధానములుగా కన్పించుచున్నవి. విషాద సంఘటనలు మనసున చిరస్థాయిగా నిలిచి పోగలవు. అవి మనసును పరివర్తన గావించును. సానుభూతిని ప్రకటింప జేయును. ఎంతటి కఠిన పాషాణ హృదయునైననూ విషాదకర సంఘటనలు కొన్ని వేళలందు నవనీతముగా మార్చి వేయగలవు. వాల్మీకి యంతటి మహర్షినొక విషాదాంత సంఘటన కావ్యమునే వ్రాయించినది. శ్రీ దేవదానము వారి కబ్బినట్లీ తత్త్వమితరుల కలవడ లేదేమో! వీరి 'ప్రేమ సుందరి' నవల కూడా విషాదాంతమే.

శ్రీ దేవదానముగారు ఆడంబర రహితులు. విజ్ఞాన సహితులు. కార్యదక్షులు. వీరు కార్యదర్శిగా పనిచేయునప్పుడు శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల కార్యక్రమములు బహుచురుకుగా కొనసాగినవి. బళ్ళారి విడిచిన తరువాత వీరు కడప జిల్లా బద్వేలుచేరి అచ్చట బోరు హైస్కూలులో ప్రధానాంధ్రోపాధ్యాయులుగా పనిచేసిరి. వీరికైదుగురు పుత్రులు. జ్యేష్ఠుడైన హెచ్. విజయరత్నం జోసఫ్ బి. ఎ., (ఆనర్సు) అనంతపురం కళాశాలలో 1957లో పనిచేసిరి. వీరు 'దీనాలాపము' లనబడు సాంఘిక నాటకమును వ్రాసి ప్రచురించిరి. శ్రీ దేవదానముగారు తమభార్యను 1940లో కోల్పోయిరి. 'స్వప్నవల్లభుఁడు' అను కావ్యమును తమ భార్యకంకిత మొనర్చిరి.

ఆ జన్మక్రైస్తవులై, ఆంధ్రాంగ్ల గీర్వాణ భాషలయందు పరిచయముపొంది, హిందూ, క్రైస్తవ మత సామరస్యములనెఱిగి యేసుకృపచే యలవడిన కవిత్వముతో, ఆర్ద్ర కావ్యములను రచించి చిరస్థాయిని పొందిన కీర్తిధనులు శ్రీ దేవదానముగారు. ★



కావ్యతీర్థ

శ్రీ

# రావాడ వేంకట రామాశాస్త్రి

జననము:— **1892**

నిర్యాణము:— **1970**

జన్మస్థలము: కణేకల్లు, రాయదుర్గము తా॥ అనంతపురం జిల్లా

తండ్రి:— శ్రీ రావాడ రామాశాస్త్రి

తల్లి:— పేరు తెలియదు

మతము, కులము:— హిందూ— స్మార్తబ్రాహ్మణులు, భారద్వాజస గోత్రము.

వీరు తమ తండ్రి వద్దను, బళ్లారి యందలి శ్రీమాన్ కుంటిమద్ది శ్రీనివాసాచార్యుల చెంతను, కావ్యములను జదువుకొనిరి. తరువాత, తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర సంస్కృత కళాశాలలో జేరి, తర్క, వ్యాకరణ, కౌముదీ గ్రంథములతో బాటు కావ్య నాటకాలంకారాదులను పది సంవత్సరములలో అభ్యసించిరి.

బళ్లారి మునిసిపలు హైస్కూలులో సంస్కృత పండితులుగను, 35 సంవత్సరములు పని చేసిరి. కలకత్తా గవర్నమెంటు వారు 'కావ్యతీర్థ' బిరుదమిచ్చిరి, మదరాసు విశ్వ విద్యాలయమువారు 'విద్వాన్' బిరుద మొసంగి, సత్కరించిరి.

ఈ శాస్త్రిగారు 1) వేమభూపాల విజయము 2) ఆంధ్రి మేఘ ప్రతి సందేశము అను రెండు పద్య కావ్యములు వ్రాసిరి. వేమభూపాల విజయమును, శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల వారు 1932లో ముద్రించిరి. ఆంధ్ర విశ్వ విద్యాలయము వారి పుస్తక

మును 'విద్వాన్ సి' ఇంటరు మీడియటు తరగతులకు పాఠ్య గ్రంథముగా నిర్ణయించిరి. ఇందలికథ:—

'అద్దంకి'ని రాజధానిగా జేసుకొని కొండవీడు దుర్గమును 'ప్రోలయ వేమభూపాలుడు' పరిపాలించెను. ఇతని మనుమడైన పెదకోమటి వేమభూపాలునికి జన్మించినవాడు మన కథానాయకుడైన వేమభూపాలుడు. ఇతడు క్రీ. శ. 1400 నుండి 1440 వఱకు కొండవీడు దుర్గమును పరిపాలించెను.

ఈ వేమభూపాలుడు శృంగార రసాభిరుచి కలవాడు. సంస్కృత విద్వాంసుడు. 'అమరుకవి' వ్రాసిన శృంగార సంస్కృత కావ్యమునకు 'శృంగార దీపిక' యను సంస్కృత వ్యాఖ్యానము వ్రాసెను.

ఇతని ఆస్థానములో, ఆస్థాన కవిగా పండితునిగా నున్నవాడు, వామన భట్టబాణుడు. ఇతడు సంస్కృతములో 'వేమ భూపాల చరితము' అను వచన కావ్యమును వ్రాసినారు. 'అభినవ భట్టబాణ' బిరుదుగల శ్రీ మాన్ ఆర్. వి. కృష్ణమాచార్యులుగారు మూల గ్రంథమును సంగ్రహించి వ్రాసిరి. దీనిని మాతృకగా గొని మన శాస్త్రిగారు ఆంధ్రములో 'వేమభూపాల విజయము'ను వ్రాసిరి.

వేమభూపాలుడు, ఎంత శృంగార రసాను భూతుడో, అంతకంటె ఎక్కువగా దైవభక్తి కలవాడు. అతడు దేవీ భక్తుడు. ద్రాక్షారామాది క్షేత్రముల దర్శించెను. అచ్చటి చండికాలయమును, దేవిని శ్రీ శాస్త్రిగారిట్లు వర్ణించిరి.

సీ॥ ఒకచాయ వైష్ణవి – ప్రకటయాన ఖగేంద్ర

ఒక చక్కన్య గ్రోధ-వికట శాఖాంతర
డోలాధిరూఢ-భేతాళమిథున
మొక యిక్క దారుకాదిక, దైత్యరుండ, సం
గ్రథనోగ్ర శూల కరంబితంబు
ఒకపక్క నాకఁట-నకనక లాడుచుఁ
దిరుగాడు బూచుల-దెప్పరంబు

గీ. నగుచు, నొప్పారు శ్రీ చండికాల యంబు
నచటఁ దిలకించి తరువాత-నవని విభుఁడు
భక్తి మధురస పూర్ణ, హృత్పంక జాతుఁ
డగుచుఁ జొత్తెంచె-నాలయాభ్యంతరంబు.

సీ. ఏ దేవి మాయచే-నీ జగమంతయు
వివిధ రూపంబుల-విస్తరిలెనొ?
ఏ బాలికామణి-కేడు లోకములును
నింపు నింపెడు, బొమ్మరిండులగునొ?
ఏ దివ్య చారిత్ర-కెల్ల వేదంబులు
మహిత నిజస్తోత్ర-మాల యగునొ?
ఏ శక్తినిదురింప-నీ విశ్వము లయించి
మేలు కాంచిన, నిది మేలుకొనునొ?

గీ. ఆ మహాదేవి శర్వాణి-నఖిల దేవ
మకుట మణిరాజ సుప్రభామండి తాంఘ్రి
గామితానల్ప, కల్పనా-కల్పలతిక
నెంతు నని యిట్లు సన్నుతియించె నృపుఁడు.

'ఆంధ్ర మేఘ ప్రతిసందేశము'ను, మైసూరు మహారాజాస్థాన విద్వత్కవి రత్నమైన బ్రహ్మశ్రీ మండికల్ రామాశాస్త్రి గారు సంస్కృతములో రచించిరి. మన శాస్త్రిగారు దానిని తెలిగించిరి.

యక్షుడు, యక్షి దంపతులు. యక్షుడు యక్షిని వీడి ఎనిమిది మాసములాయెను, దూరదేశమేగినాడు. ఏకారణముచేతనో యక్షుడు యక్షిని గూడలేదు. విరహతాప సంతప్తయైన యక్షి ఆకాశమున సంచరించుచున్న మేఘునిగాంచి ఇట్లు ప్రార్థించుచున్నది. ఈ మాటలను శాస్త్రిగారిట్లు వర్ణించిరి.

వానపుటింట గోడకడఁ బాణిఁగపోలమునూఁది యర్ధ ప
ద్మాసనమంది వాకిటను సారసు దృగంచలముంచి, యెంచి నీ
గానిలి, గడ్డియుఁ గదలగా—నరుదెంచితి వీవ, యంచెటో
మానము లెన్నిదిఁ గడపి-మంటి నినుఁ మఱిఁజూచు వేడుకఁ

కమ్మని తావులఁ బొలుచు—కందరభూమి విహారవేళఁ బ్రే
మమ్ము-భయమ్ము మన్ననయు—మల్లడిగా—ననుగూడి సాను దే
శమ్ములఁ ప్రౌఢ రీతిగను—నల్పిన నీదురహః ప్రవృత్తి—నే
నిమ్ముగ, సంస్మరించునటు లీకృతకాద్రి యొనర్చు నిచ్చలుఁ

ఒక కయిఁ గన్నుమూసి—మఱియొక్కటి నాభుజ మూల మంటుచుఁ
మొకము మరల్పఁ ద్రిప్పుకొని—ముద్దిడుచుఁ బొలయుల్కసూనఁగా
వికృతిని జెంది ద్రొక్కులిడి వేఁడెదు నీదురహః ప్రవృత్తి—నే
నకట-స్మరించునట్లు—కృతకాచలమిద్ది—యొనర్చునో ప్రియా!

శృంగార రసమును బోషించుటలో శాస్త్రిగారు దిట్టలు.

వీరికి పుత్రసంతానము లేదు. ఇద్దరాడుబిడ్డలు మాత్ర మున్నారు. వీరి అముద్రిత రచనములు చాల కలవు. అవి ఎచ్చటున్నవో తెలియదు. రాయలసీమలో ఉన్న బళ్ళారి పట్టణము మన దురదృష్టముచేత కర్ణాటకములో కలసిపోయినది. ఇప్పుడు కూడా ఆపట్టణమున ఆంధ్ర కవిపుంగవులున్నారు. అదిభాగ్యమే ★



# శ్రీ
# రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ

జననము — 23—1—1893

జన్మస్థలము: రాళ్లపల్లి-కల్యాణదుర్గం తా॥
అనంతపురం జిల్లా.

తండ్రి:— శ్రీ కర్ణ మడకల
కృష్ణమాచార్యులు.

తల్లి:— శ్రీమతి అలువేలు మంగమ్మ.

మతము, కులము:—హిందూ—బ్రాహ్మణ—వడగల శ్రీ వైష్ణవులు.

సంగీత సాహిత్యములు సరస్వతీదేవి కుచద్వయములు. ఆ తల్లి ఒడిలోన నల్లారు ముద్దుగా పెరిగిన అనుంగు బిడ్డ అనంత కృష్ణశర్మ. చిన్నతనము నుండియే, తండ్రివద్ద సంస్కృతాంధ్ర సాహిత్య శిక్షలను పదుమూడేండ్లు బడసిరి. సకల విద్యలు వారి కుటుంబీకులకు వారసత్వముగా సలవడినవి. శర్మగారి అవ్వగారు (తల్లి తల్లి) అక్షర జ్ఞానములేని వారైన, జ్యోతిష్కము, వైద్యము ధర్మశాస్త్రములు, పురాణములు, కావ్యము లామెకు కంఠస్థములు. కవిత్వముకూడా చెప్పగలిగిన దిట్ట ఆవిడ. పురాణేతి హాసములను బహు చక్కగా విమర్శించుటలో, యుద్దండురాలు.

తండ్రివద్ద విద్యనేర్చిన తరువాత, శర్మగారు 1906లో ఉన్నత సంస్కృత విద్యాభ్యాసముకొఱకై మైసూరులోని శ్రీపర కాలమఠమును ప్రవేశించిరి. అక్కడ వీరికి శ్రీ కృష్ణబ్రహ్మతంత్ర పరకాల యతీశ్వరుల సన్నిధిలో శ్రీమద్రామాయణ తత్త్వసారము,

అలంకారశాస్త్రము లలవడినవి అట్లే శ్రీ చామరాజ నగరం రామ శాస్త్రిగారివద్ద సాహిత్యరంగమున శర్మగారికి ప్రవేశము లభించినది

1912 సం॥లో, శర్మగారు మైసూరు మహారాజ కళాశాలలో తెనుగు పండితులుగా 33 సంవత్సరములు పని చేసిరి. అప్పుడు శర్మ గారికి ఆ కాలేజిలో పని చేయుచున్న శ్రీ కట్టమంచివారితో స్నేహ మేర్పడినది. కట్టమంచివారక్కడ ఆంగ్లసాహిత్యము, చరిత్ర, తత్త్వ శాస్త్రములు బోధించు ప్రధానాచార్యులుగా నుండిరి. వారా కన్నడ ప్రాంతమున ఆంధ్రభాషా పరిమళము వ్యాపింప కృషిచేసిన మహనీయులు. శర్మగారికి అన్ని విషయములందును. చేదోడు వాదోడుగా నుండి వారిని ప్రోత్సహించిన మహనీయులు కట్టమంచి వారు. "నాకు నావలె ఎందరికో తెలుగు భారతము నందభిరుచిని, యభిమానమును కల్గించిన, నాకడపటి గురుదేవులు కట్టమంచివారు' అని చెప్పుకొన్నారు, రాళ్లపల్లి వారు.

శర్మగారు కట్టమంచి వారి ప్రోత్సాహముతో, వేమనపై పెక్కు విమర్శనాత్మకోపన్యాసము లిచ్చిరి. వాటినొక గ్రంథముగా ముద్రించిరి. నిశితమైన విమర్శనను గావించుటతోబాటు హాస్య రచనా చమత్కృతిని హృదయముగా జోడించి చెప్పుటలో సమర్థులు వచన రచన కొక విశిష్టమైన ఒరవడి నందించిన సాహితీ దురంధురులు వీరు.

తెలుగు పండితులుగాయుద్యోగమును విరమించిన తదనంత రము, తిరుపతిలో ప్రాచ్యతాళ పత్రగ్రంథ పరిశోధనశాలలో 'తాళ్ల పాక వారి సంకీర్తన' లపై పరిశోధన గావించిరి. ఈ కార్యక్రమ మును 6—7 సంవత్సరములు కొనసాగించిరి.

బళ్లారిలో జరిగిన 'ధర్మవరం-కోలాచలం' గార్ల స్మారకోత్సవ సందర్భమున, శర్మగారు నాటకలక్షణముల గూర్చి నాటకోపన్యాసముల నిచ్చిరి. వీరు వ్రాసిన "సాహిత్య మత్తు జీవనకళె" 'గానకళె' ఈ రెండు విమర్శగ్రంథములు శర్మగారి కన్నడ పాండిత్యమును చాటి చెప్పుచున్నవి. వీరు తెనుగున పెక్కు సారస్వతోపన్యాసములు వ్రాసిరి. శ్రీ కృష్ణదేవరాయల కాలము నాటి సాహిత్య పరంపరను నిశితముగా విమర్శించిన రసికులు వీరు. వీరి విమర్శలోగల చతురోక్తులను కొంత చదివి నవ్వుకొందము.

రాయల కాలము నాటి స్త్రీ, పురుషుల అలంకారములెట్లుండినవో, శర్మగారి వ్యాసముల ద్వారా తేట పడుచున్నవి. అందలి హాస్యరసము కొంత చూతము.

"పూర్వము కిరీట, కటకాంగద మేఖలాదుల యందున్నయాశ యిప్పుడంతర్ధానమై గుండీలు, గడియారపు గొలుసులు, అపురూపముగా ఉంగరములు, మొదలగు వానియందు వెలిచి వెలిచి వ్యాపించుచున్నది. దీనికర్థమేమనఁగా, మనకు నేఁడు మన జాతిసొమ్ములు మనయానందమునకై ధరించు ధైర్యము లేదుగాని, యింకొకజాతి సొమ్ములు వారిమెప్పులకై ధరించు దాస్యమున్న దన్నమాట. మన వస్త్రములు నిట్లేకదా! సరిగంచుల సేలము-దోవతులు-నేఁతపని కెల్లనెత్తి పూలవంటివి-గట్టుటకు మనకు సంకోచము కలదు గాని, 'సర్జు సూటు'లలో దూఱుటకు సిగ్గులేదు. పింజెలు పోసి యలంకారముగా చుంగులు చుంగులుగ దోవతి కట్టుకొని బైటఁగనబడుటకు బిడియము; కాని చాకఁలివాని 'ఇస్త్రీ' రేఖలు చెడునేమోయని చేతులు కాళ్ళు చెక్కబొమ్మలవలె ఆడించుచు వీధులలో వెడలుటకు

వెనుదీయము! ప్రాచీనులు స్వతంత్రులు; రసికులు. కావుననే వారు తమకు సొమ్ముల పైఁగల ప్రీతిని తమ యిచ్ఛవచ్చినట్లు ధారాళముగ, నిర్భయముగఁజూపుకొనువారు. మనవలె వారికి మఱియొకరి మొగము చూచి వారికన్నముందఱ పండ్లిగిలింపవలసిన పని యుండలేదు.''

వీరు రచించిన ఎఱ్ఱన్న, నాచన సోమన్నల తారతమ్య నిరూపణ మమోఘమైన వ్యాసము. ప్రాకృత భాషలో, ఆర్యా వృత్తములలో వ్రాయబడిన ప్రాకృత గాథలను శర్మగారు 'శాలివాహన గాథా సప్తశతి సార'మను పేర తెనుగున రచించిరి. ఆ గీతముల చదువుడు.

వడిగ వచ్చినాను గడుఁబెద్దదీ నిండు
గడవ మోచి కొనుచుఁ; గాన చెలియ!
ఒడలు వనము దప్పె నూర్పుఁ జెమ్మటలచే;
గొంత సేదదీర్చి కొందు నిందు.

అపుడు నా చెక్కిళుల నిల్పినట్టి చూడ్కి
నొందు వెనకు మరల్పక యుంటి వీవు;
అదియె నేను, నాచెక్కిళ్లు నవియె; కాని
చూడు మిప్పుడు లేనిదా చూడ్కి యొకటి!

సంస్కృతమున సుందర పాండ్యునిచే రచింపబడిన 'ఆర్యా' ను శర్మగారు తెనిగించిరి. ఇవి సుందరపాండ్యుని సుందర నీతులు. గమనింపుడు.

కం॥ ఒరులయెడఁ దప్పు నూపఁగఁ
బరిపత్తులఁ బోవరాదు పండితుఁడెట్టుల్
మరి నిజమేనియుఁ మనసులఁ
జెఱచెడు నదియైనఁ దగదు చెప్పఁగ నెపుడున్.

తే॥ గుడ్డియెవ్వఁడు? — వినయంబు గొననివాఁడు;
చెవిటి యెవ్వఁడు? — హితోక్తి వర్జించువాఁడు;
మూఢుఁ డెవ్వఁడు? — తఱిఁ బ్రియముగల యతిథి
యింటి కరుదేర నొప్పరి కించువాఁడు.

శర్మగారు కాళిదాసుగారి రఘువంశ కావ్యమును పదునారు సర్గల వరకుతెనిగించిరి. దానిని కట్టమంచి వారు చదివి మెచ్చుకొని ప్రకటింప సిద్ధపడిరి కాని శర్మగారికే మన సొప్పలేదు. కాళిదాసం తటి మహాకవి కావ్యమునకు తన యనువాదము కొంతైనను దీటుగా నుండనప్పుడు తెనుగించుట యనవసరమని చించి వేసిరి.

శర్మగారికి సంగీత విద్య తల్లి నుండి సంక్రమించినది. ఆమె కన్నడ తెలుగు, తమిళ పాటలను కమ్మగా పాడెడిది. ఆమెవద్ద తొలుత సంగీతసాధన గావించి, క్రమేణ సంగీతములో కృషిచేసిరి. మైసూరులో నున్నప్పుడు 'వయొలిన్' సాధన గావించిరి. వీరి సంగీత కృషి పలువురి ప్రశంశలను పొందినది. అన్నమాచార్యుల కీర్తన లకు స్వరకల్పన గావించిరి. ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారు ఏర్పరిచిన ప్రథమ కర్ణాటక సంగీత సమావేశమునకు, మైసూరులో జరిగిన సంగీత పరిషత్తునకు అధ్యక్షత వహించిరి. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఉపాధ్యక్షులుగా కొన్ని నాళ్ళు వ్యవహరించిరి.

ఈ 20వ శతాబ్దములోనున్న రాయలసీమ కవి పుంగవులలో వీరు అగ్రశ్రేణికి చెందియున్నారు. చక్కటి విమర్శకులగుటచే కవు లెల్లకూ తమ పొత్తములకు వీరి యభిప్రాయము లవసరమని తలంచెడివారు. వీరెందరి పుస్తకములకో తమ సదభిప్రాయముల

నిచ్చియున్నారు. రాయలసీమ కవులపై వీరికి మక్కువ మెండు. రాయలసీమ కవుల దురవస్థకు వీరు మిక్కిలి విచారించెదరు.

శర్మగారు పుట్టిన అనంతపురం జిల్లా లోని ఘనగిరి (పెనుకొండ) విజయనగర రాజులకు వేసవికాలమందు 'చలువ రాజధాని' గా నుండెడిది. అందే రామరాజ భూషణుని 'వసు చరిత్ర' మవతరించినది. అక్కడి 'దాడిమ లతాలతాంగులు'-'జటిల ద్రాక్షాగుళుచ్ఛంబు' లిప్పటికిని యక్కడి పుణ్యదంపతులు చవిచూచుచున్నారు. ఆ పెనుకొండను రాళ్ళపల్లి వారు మఱచి పోలేదు. రాయలసీమ సాహిత్యములో చిరస్థాయిగా నిలిచిపోవురీతి 'పెనుకొండ—కొండ' పాటను వ్రాసిరి. ఇప్పటికిని ఆపాట అనంతపురం జిల్లాలో వాడుకలోనున్నది. ఆపాట నొకసారి జ్ఞప్తికి తెచ్చుకోవడ మెంతైనా అవసరము.

పెనుకొండ—కొండ పాట.

చనిన నాళుల — తెనుగు కత్తుల
సాన పెట్టిన బండ — ఈ
పెనుకొండ — కొండ

రంధ్రముల ప్రహరించు శత్రుల
రక్తధారల ద్రావి త్రేచిన
ఆంధ్ర కన్నడ రాజ్యలక్ష్ముల
కళితి నీలపు దండ—ఈ
పెనుకొండ — కొండ.

వెలుపు లెఱుగని — బిరుదు నడకల
విజయ నగరపు రాజు కొడుకులు
పారలబోయగ కరుడు గట్టిన

పచ్చి నెత్తురు కంద — ఈ
పెనుకొండ — కొండ

తిరుమలేంద్రుని — కీర్తి తేనెలు
బెరసి దాచిన కాపు కవనపు
నిరుపమ ద్రాక్షా రసంబులు
నిండి తొలకెడి కుండ — ఈ
పెనుకొండ — కొండ

శర్మగారి కిప్పటి కెనుబది నాలుగు సంవత్సరాల వయస్సు. చూపు తగ్గినది, చేయి వణకుచున్నది. ఐనను జాబులు వ్రాసిన వారికి జవాబు వ్రాయు నోపిక తగ్గలేదు. సన్మానములకు, బిరుదులకు యెగబ్రాకని నిరాడంబరులు. ప్రతివారిని సహృదయతతో మాట్లాడించు సరసులు. 'వారు మాటలాడినచో ముత్యములు రాలును. పాటలు పాడినచో తేట తేనియ లూట లూరు' నన్న దివాకర్లవారి మాటలు సత్యములు.

ప్రస్తుతము శర్మగారు బెంగళూరు జయనగరములో వారి జ్యేష్ఠకుమారులైన శ్రీ ఫణిశాయిగారి పరామరికలో నున్నారు. బెంగళూరులోని తెలుగు సాహితీవేత్తలు 'రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మగారి అభినంద సమితి' పేర వారిని సన్మానింప దలచుటెంతయో ముదావహము. శ్రీ శర్మగారికి భగవంతుడాయురారోగ్య భాగ్యముల నిచ్చి బ్రోతుగాక !

———o———



సరస్వతీపుత్ర – మహాకవి
పద్మశ్రీ – డాక్టర్

# పుట్టపర్తి నారాయణాచార్యులు

జననము :– **28–3–1914.**

జన్మస్థలము :– చియ్యేడు
అనంతపురం జిల్లా – తా॥

తల్లి:– శ్రీమతి లక్ష్మమ్మ. తండ్రి:– శ్రీ శ్రీనివాసాచార్యులు.
మతము కులము:– హిందూ–బ్రాహ్మణ–శ్రీవైష్ణవులు.

విజయనగర రాజుల రాజధానిగా వెల్గిన పెనుకొండ (అనంతపురం జిల్లా) లో శ్రీ నారాయణాచార్యుల వారి విద్యాభ్యాసము, కవిత్వరచనారంభము జరిగినవి. తండ్రి గొప్ప సంస్కృత పండితుడు. మంచి పౌరాణికుడు. తల్లి సంగీతమందు నిష్ణాతురాలు. ఆ కారణమున ఆచార్యులవారికి బాల్యము నుండియే సంస్కృతాంధ్రములు, సంగీత, సాహిత్యములు పట్టువడినవి. పెనుకొండలోని మహాలక్ష్మమ్మ యను వేశ్యాంగన వద్ద వీరు పిన్నతనము నుండియే శాస్త్రయుక్తమైన నాట్యము నభ్యసించిరి. పదునైదేండ్ల ప్రాయము వఱకు పెనుకొండలో వుండి, అచ్చట మూడవ ఫారము ముగించి, తరువాత తిరుపతి సంస్కృత కళాశాలలోచేరి వ్యాకరణ, అలంకారాది శాస్త్రముల నభ్యసించిరి. ఆ తరువాత స్వయం కృషితో 'విద్వాన్' పట్టము పుచ్చుకొనిరి.

ఒక్క తెలుగు భాషలోనే కాకుండ 14 భాషలలో ఆచార్యుల వారికి ప్రవేశముకలదు. 7,8 భాషలలో అనర్గళముగా కవిత్వము జెప్పగలరు. రష్యన్ భాషనుకూడ నేర్వ నుత్సహించుచున్న బహు భాషా కోవిదులు వీరు. సంగీత, నాట్యశాస్త్రము లందును, పురాణ పఠనము నందును, అవధాన ప్రక్రియ యందును, నటనయందును, సారస్వతమందును, వక్తృత్వమందును వీరు అతులిత శేముషీ విభావతులైరి. ఒక్క మాటలో వీరు సర్వకళా కోవిదులని చెప్ప వచ్చును. వీరు కొన్ని వేల కృతులను వ్రాసినారు. 'శివరంజని' 'శంకరి' యిట్టిరాగములను కర్ణాటక సంగీతమున ప్రవేశ బెట్టిరి. వీరు వాగ్గేయకారులు.

ఆచార్యుల వారు తమ పదునారు, పదునెనిమిదేండ్ల ప్రాయము ననే కొన్ని ఖండికలు వ్రాసిరి. అవి భారతీ మున్నగు ప్రముఖ సాహితీ పత్రికలలో ముద్రింపబడినవి. వాటిని 'అగ్నివీణ' యను ఖండ కావ్యముగా ప్రకటించిరి. అగ్నివీణలో పుట్టపర్తి వారి అర్ధాంగి శ్రీమతి కనకమ్మగారి రచనలు కూడా చేర్చబడినవి. ఆమె రాయల సీమలోని అజ్ఞాత రచయిత్రి.

కవి హృదయమొకవీణ. ఎన్నెన్నో సన్నివేశము లతని హృదయముపై ముద్రింపబడును. కవి వాటికనుగత శృతిని కల్పించును. ఈ అనుభూత్యాపాదనకు పుట్టపర్తి వారగ్నివీణను సారించిరి. ఆ వీణ మ్రోయించిన గీతములు పలురకములు. ఇందు కావ్యనాయిక 'వరూధిని' నిట్లు కవిగారు పలుకరించిరి.

ఓసి! యేమే! వరూధినీ!
ఒక్కసారి
కౌగలింతవుగమ్మ్మ — ద్రాక్షగుళుచ్ఛ

ములు బిగిసి కొన్న మా తెన్గుపొలములందు
వలపు దుసికిళ్ళు వోవు నీ వాలుచూపు
యౌవనపు పొంగు - పాషాణమైన యట్టి
ప్రవరుని కృధాగ్నిలో వేల్చి భావ చిక్క
ణాౘ్రవముల గుందు చున్న సుధాౘ్రవంతి
హత్తికొందును నా హృదయమ్ము నందు.

బ్రదుకు బాటకు దివ్యదీపంబ! అమర
పల్లకీ! జీర్ణ కర్ణాట వైభవ ప్ర
శస్త సామ్రాజ్యరాజ్ఞి! నిశ్వాసధూమ
లాంగి! కవితా పితామహ రక్తయావ
కాంకిత శిరీష సుమకోమ లాంఘ్రి యుగళ!
ఓసి యేమే! వరూధినీ !!

చిన్నతనములోనే ఆచార్యుల వారికి ప్రౌఢ కవిత్వమలవడినది. తన్ను పెంచి పెద్దజేసి విద్యాబుద్ధులు నేర్పిన పెనుకొండను వారు మఱవకుండుటకై సాహిత్యములో ఆ కళాక్షేత్రమునకు శాశ్వత కీర్తి తెచ్చిపెట్టుటకై 'పెనుకొండ లక్ష్మి' యను కావ్యమును వ్రాసిరి. దానిని మద్రాసు విశ్వవిద్యాలయము వారు 'విద్వాన్' విద్యార్థులకు పాఠ్య పుస్తకముగా నుంచిరి. ఆచార్యుల వారు విద్వాన్ పరీక్షకు వెళ్లినప్పుడు తాము వ్రాసిన పుస్తకమునే చదివి తానే జవాబు వ్రాయు విచిత్ర సంఘటన ఎదురైనది. ఇది ఆచార్యుల వారికి మరపురాని సంఘటన. ఆచార్యులవారు పెనుకొండ లక్ష్మి కిట్లు నమస్కరించిరి.

సీ॥ తెలుగు రాయని బల్కు పాలతికి దానిమ్మ
రసములో నుగ్గు పాల్గలిపి పోసి,

మునలి యయ్యును మీనమును దువ్వ మా రామ
నృపతి గుండెలకును నీరుజల్లి,
తిరుమలరాయ పృథీశు లేనవ్వు, వె
న్నెలలోన గరువంపు మొలక వోసి,
రామ భూషణ కవిరాజు గోకిల సేత
బలికించు హిందోళ గలియ బలికి.

గీ॥ ముక్కు తిమ్మన సృష్టించు ముద్దు గృష్ణు
గూకటులలోన, నెఱకొండ గోగు జెక్కి
అలసి సొలసిన మాయింటి యాడుబిడ్డ
ఘనగిరి నివాసినీ! నమస్కార మిదిగొ!

'పాద్యము' వీరి మరొకకృతి. ఇందు భగవంతు నిట్లు భక్తుడు ప్రార్థించుచున్నాడు.

ఎంతగ నేడిపించెదవొ? యీజడకాష్ఠము నేడిపించి నీ
పంతము దీర్చుకో! తనువుఁబాసినఁ బుణ్యామె పండిపోవు; ని
శ్చింతతఁ బోదుఁ గాని, నను జీవముతో మననిచ్చి, కష్టముల్
వంతుకుఁదెచ్చి, గ్రుమ్మకుము ప్రాణము, నీకు నమస్కరించెదన్.

భక్తుడు తన ఆవేదననే కాక వెగటుగా కనిపించి మనసును నొప్పించు ప్రతి విషయమును భగవంతుని ముందు చర్చించును. అతనికా అర్హత గలదు. విద్యారంగపు దుస్థితి నిట్లు భగవంతుని ముందుంచి వాపోయినాడు భక్తుడు.

కాలిన వత్తు లట్టులు, వికారములై కళలేని శుష్క వి
ద్యాలయముల్ మనస్సను పదార్థమె లేని గురుల్-విజీర్ణ కం
కాళములైన పిల్లలను గాంచినఁగన్నులు గుట్టునాకుఁ దం
డ్రీ! లయకాలనృత్యము ఫలించినదేమిర దేశ మందునన్ ?

'నూత్న నాగరికతా మదిరా రసమత్తులైన, నవ నాగరికులతో దేశమంతయు బాడయి పోయిన లేవనట్టి నిద్దుర'తో నుండుట, భక్తుడు జూచి దేశపరిస్థితి ఏమగునో? యని ఒక్కొక్కసారి బాధ చెందును. ఇట్టి ఎన్నో విషయముల నీకవిగారు చర్చించినారు.

పుట్టపర్తివారి గ్రంథములలో 'శివతాండవ'మునకు విశేష వ్యాప్తి గల్గినది. ఈ కావ్యము పెక్కు పునర్ముద్రణములను పొందినది. శివతాండవ కావ్యము ఆంధ్ర సరస్వతికి ఉజ్జ్వల నూతనాలంకారము, సంగీత, సాహిత్య, నాట్య సంకేతములు, సరసముగా, సలక్షణముగా ఈ కృతిలో నిమిడినవి. ఈ 'శివతాండవము'ను కవిగారి కంఠము నుండియే వినవలెను. ఇందలి శబ్దసమ్మేళనమును, హిందీ — మళయాళ — తమిళాదిభాషాపండితులు విని మెచ్చుకొన్నారు. కవిగారు పాడునప్పుడు శ్రోతలు తాండవ నృత్యమునే చేయుదురు. ఈక్రింది పాట వినండి.

తమ్ములై, ఘటిత మోదమ్ములై సుకృత రూ
పమ్ములై, శాస్త్ర భాగ్యమ్ములై నవకోర
కమ్ములై, వికచ పుష్పమ్ములై దుమ్మెదల
తమ్ములై, భావ మందారమ్ములై, హావ పు
ల్లమ్ములై, నూత్న రత్నమ్ములై, వల్గుహా
సమ్ములై, గద్గనల సొమ్ములై, విశ్రాంతి
దమ్ములై, రక్తికసమ్ములై, రక్తి, చి
హ్నమ్ములై, తంద్ర గమనమ్ములై, గెడగూడి
కులుకు నిలవుఁగండ్లఁదళుకు జూపులు బూయ
ఘలుఘల్లు మని కాళ్లఁజిలిపి గజ్జెలు మ్రోయ
ఆడెనమ్మా ! శివుఁడు
పాడెనమ్మా ! భవుఁడు

శివుడు తాండవ నృత్యము చేయుచుండగా,

ఆడినది గిరికన్నె యల సమారుత మట్లు
పాడినది సెలకన్నె-పకపకా నవ్వినటు
లాట పాటల తోడస వశులై బ్రహ్మర్షి
కోటు లెల్లెడ నమిత-జూటులై సేవింప
శర దబ్జ ధూళీ పింజరితముల చక్రముల
నరిదూగు లావణ్యభరిత కుచయుగ్మములు
చనుకట్టు నెగమీటి మిన్నుc దాకునో యనగ
వనజాక్షి, పైపైని వక్షమ్ము విరియించి .... యాడినది గిరికన్నె

గిరికన్నె యిట్లందరితో కలిసి నాట్యమాడినది. ఆమె తొమ్మిది రకములైన 'భూచారినాట్యము' లను జూపించినది. పదునాఱు 'ఖచారిపద్ధతుల'లో నాట్యము చేసినది. ఆ నాట్య విన్యాసములందు చూపిన హావభావములు గ్రంథమున జదువవలసినదే. ఇచ్చట పేర్కొన్న సొంపుండదు. 'ఆధునిక సారస్వతమున యిటువంటి గేయకృతి యింకొకటి లేదు' అని శివశంకరశాస్త్రి గారు నుడివిన మాటలలో అతిశయోక్తి లేదు. ఇంతటి ప్రచారమునే తెనుగుదేశమున వీరి 'మేఘదూతము'నకు దక్కినది. ఈ కావ్యము మానవతావాదమును చాటి చెప్పుచున్నది. ఇందు అన్యాయము నెదురింప బూనుకొన్న మానవున కన్యాయ మెదురైనది. హృదయ రహితమైన కళకు శాసన మతనిని బెదరించి కారాగార వాసప్రాప్తి గావించినది.

"అతcడొనర్చిన యట్టి యపరాధ మేమంచు
చీకటులు ప్రశ్నించె - చిఱుచుక్కలడిగినవి
పవళు లాశ్చర్య సంభరితములు వెల్లనై

కొండ కోనలతోడ గుసలు గుసలాడినవి;
ఉత్తరం బెవరిత్తు రున్న యుత్తము లందు?"

అతనికి జరిగిన యన్యాయమును గూర్చి యెల్లరు వాపోవుదురు. అతడు తన ప్రియురాలిని తలచుకొన్నాడు. ఆమె పడెడు కష్టముల నొకసారి తలపోసినాడు. అప్పుడాతడు గగనాన విహరించు మేఘమాలతో

పలికె నా ఖైది " శుభతేజా! కాసంత
నిలుమోయి! ఓ జలదరాజా!
చిన్నిచుక్కల చెలువు జిలికించు ప్రియురాలు
ఉన్నదో! లేదో! యీయుర్విపై నడిగేను.

మేఘుడు పయనించు మార్గమున గోచరించు కొన్ని విషాద దృశ్యములను ఆ అపరాధి 'శోకాత్మక కావ్యమ్ము'గా వర్ణించును.

నిండు టాకలి దూయ
మండు టెండలు గాయ
నడ పీనుగుల వోలె నిలిచీ శిరసుపై
గడుధూళియును దుమ్ము బెరసీ కనపడెడు
హరిజనులపై నుంత యాదరము నీవైన
పరపరా! వారి నోదార్చు వారు లేరు.

ఇట్లెందరో కష్టజీవుల నొకసారి పరామర్శించి వెళ్లమని యాతడు వాపోవును. తెనుగు దేశమున పేరెన్నికగన్న విజయనగర ప్రభువునుగూర్చి 'ఉపకార మపకారమై - బ్రదుకు హత మార్చె నొకరాజు; అతడు సామాన్యుడా! ఆంధ్రజాతికి పొగరు'అని సూక్ష్మముగా మందలించును. ఇట్లెన్నో పెక్కు ఆంధ్రదేశపు విషయములను 'మేఘదూత'లో ప్రస్తావించిరి. ఈ పద్ధతిలో వ్రాసిన కావ్య మిదొక్కటే యని చెప్పవచ్చును.

పుట్టపర్తి వారి కావ్యములు నూటికి మించియున్నవి. వాటిలో పై పేర్కొన్నవే గాక 1) షాజి 2) విప్లవ యోగీశ్వరుడు 3) నవ యుగ వైతాళికుడు 4) విరహగోపి 5) సాక్షాత్కారము 6) సిపాయి పితూరి 7) పండరీ భాగవతము 8) అష్టాక్షరీ కృతులు కూడ ప్రధానమైనవి. ఆచార్యులవారి అనువాదకృషి శ్లాఘింపదగినది.

వీరు పెక్కు భాషలను జీర్ణించుకొన్నవారగుటచే యితర భాషలయందుగల సాహితీ మాధుర్యమును కొంత తెనుగువారికి చవి చూపిరి. హిందీ భాషాధ్యయన మొనర్చి 'తులసీరామాయణము'ను కంఠస్థము చేసిరి. హిందీలోని కబీరు వచనములను 'కబీరు వచనావళి' గా అనువదించిరి. ఉషఃకాల్—గాడివాలా, కూడా పుట్టపర్తి వారిచే అనువదింప బడిన హిందీ అనువాదములు.

కేరళ విశ్వవిద్యాలయమున కొన్నినాళ్ళు భాషాశాస్త్ర పరిశోధన గావించి, మళయాళ నవలలను తెనుగున వ్రాసిరి. అట్లే కొన్ని మలయాళ భాషలోనే నవలలు వ్రాసిరి. శ్రీవిశ్వనాథవారి 'ఏకవీర' నవలను మళయాళములోని కనువదించిరి. ప్రసిద్ధ కన్నడ హాస్య రచయిత శ్రీ భీమసేనాచార్ (బీ. చి)గారి 'సరస్వతీ సంహారం' మను నవలను తెనుగించిరి. ఆచార్యులవారికి సమర్థ రామదాసుగారిపై భక్తి మెండు. ఆకారణముగా మరాఠీ భాషను నేర్చి 'బుద్ధభగవానుడు' అనుపేర బుద్ధుని చరిత్రను తెనుగున వ్రాసిరి. వీరాంగ్లమున 'Leaves in the wind' అను కావ్య సంపుటిని వ్రాసిరి, శ్రీ హరీంద్రనాథ చట్టోపాధ్యాయచే మెప్పు పొందిరి.

వీరు సంగీతప్రియులు. 7000 అష్టాక్షరీ కృతులను 1948—1951 సం॥మధ్య రచించిరి. ఇవి కనకాంగి, గమనప్రియ, సింధు

భైరవి, నటాభరణము, శుద్ధశ్రీమంతి, మున్నగు అపూర్వ రాగములతో కూర్చబడినవి. త్యాగరాజ కృతులవలె రాగతాళ సౌలభ్యమును కలిగినవి, తమకుగల శ్రావ్యమైన కంఠముతో వాటిని పాడి సభికులను ముగ్ధులను గావించెదరు. వారనేకచోట్ల ఉపన్యాసములను, ప్రవచనములను గావించిరి.

కొన్నినాళ్ళు వీరు తిరువాన్కూరు విశ్వవిద్యాలయమున దక్షిణదేశ భాషాశాఖలో రీడరుగాను, కేంద్ర సాహిత్య అకాడమీ వారి 'లింగ్విస్టిక్ లైబ్రరీ'లో లైబ్రరీయన్‌గా పని జేసిరి.

భారతదేశ పర్యటన గావించి, హృషీకేశమున స్వామి శివానంద మహారాజులచే 'సరస్వతీపుత్ర' బిరుదమును పొందిన మహనీయు లాచార్యులవారు. సంగీత, సాహిత్య రంగాలలో వీరొనరించిన కృషిని గుర్తించి భారత ప్రభుత్వము 1972 జనవరి 26న 'పద్మశ్రీ' బిరుదము నిచ్చి సత్కరించినది. ఈ భాగ్యమును పొందిన తొలి రాయలసీమ కవి వీరే. వీరికి దేశమెల్లెడలా సాహితీమిత్రులున్నటులే, సాహితీ శిష్యపరంపర కూడా కలదు. వీరి శిష్యులందరూ గురువుగారి పేరు నిలబెట్టువారే.

ఆచార్యులవారి 'పండరీ భాగవతము', యిరువదినాలుగువేల ద్విపదలుగల బృహత్కావ్య మిటీవలనే ప్రచురింపబడినది. వీరి 'జనప్రియ రామాయణము' ఆకాశవాణి శ్రోతలకు పరిచయమైనదే.

ఈ వయసున కింతటి అమోఘకృషి యెవ్వరును జేయలేదు. ఆచార్యులవారికి గల పూర్వజన్మ సుకృతి ఫల మందులకు కారణము కావచ్చును. వారు కేవలము మానవమాత్రులుగా నూహించుట పొరబాటు. నిజముగను వారు సరస్వతీపుత్రులే. తల్లి

కుమారుని జిహ్వాగ్రమున నిల్లు గట్టుకొన్నది. ఆ భాగ్య మందరికిని యబ్బునదా?... ఆచార్యులవారి కీర్తిప్రతిష్ఠలింకనూ ఆ తల్లివర ప్రభావముతో నినుమడించుగాక!





సాహిత్యశిరోమణి–విద్వాన్

## శ్రీ కుంటిమద్ది శేషశర్మ

జననము: **2–2–1913**

తల్లి:– శ్రీమతి శేషమ్మ

తండ్రి:–శ్రీ వేంకట రంగాచార్యులు

జన్మస్థలము :– అనంతపురము

మతము, కులము.– హిందూ బ్రాహ్మణ, శ్రీవైష్ణవులు.

శ్రీ శర్మగారు కుంటిమద్ది ప్రాథమిక పాఠశాలలో, 4 తరగతులు ముగించి, బళ్ళారిలో హైస్కూలు చదువును ముగించిరి. పండిత ప్రకాండులు, పితామహులునగు, కుంటిమద్ది శ్రీనివాసాచార్యుల వద్ద 8 సంవత్సరములు, సంస్కృత కావ్యాలంకార, వ్యాకరణముల నధ్యయన మొనర్చిరి. మరల 8 సంవత్సరములు తిరుపతి

శ్రీ వేంకటేశ్వర సంస్కృత కళాశాలలో చదివి సాహిత్యశిరోమణి యందుత్తీర్ణులై, 1938 లో, తెలుగు విద్వాన్ పరీక్షలో కూడ కృతార్థులైరి.

1943 నుండి, అనంతపురముజిల్లా ఉన్నత పాఠశాలల యందు సంస్కృతాంధ్ర పండిత పదవుల నిర్వర్తించుచు. 1959 నుండి 1971 వఱకు, జూనియరు కాలేజీలలో పనిచేయుచు, రిటైరై, ప్రస్తుతము అనంతపురములో ఉన్నారు.

శర్మగారు వ్రాసిన తెలుగు రచనలు 1) సుధాబిందువులు 2) తెలుగుతల్లి 3) రామిరెడ్డి 4) శ్రీ కేశవప్రపత్తి 5) శ్రీ యతి రాజీయము 6) శాంతివిలాసము 7) రామానుజులు షడర్థములు 8) అలంకార విచారము 9) గీతామృతము 10) మేలినోము.

సంస్కృత కావ్యములు: 1) శ్రీ కేశవ సుప్రభాతము 2)బాష్పబిందవః 3)సుమతిశతకము 4)మనుసంభవః 5)ముకుంద విలాసః. "సుధాబిందువులు" ఈ చిన్నకావ్యములో శర్మగారు శ్రీ వేంకటేశ్వరుని సన్నిధిలో, భక్తిభావముప్పొంగ నిట్లు ప్రార్థించిరి.

ఆ. నిలువు దోపు లిత్తు - నీరాజనము లిత్తు
ముడుపు లిత్తు — కురుల ముడుల నిత్తు
ఆర్తి బాపు మనగ — నారోగ్య మిమ్మన
లంచ గొండి వని — తలంచలేదు.

ఆ. కానుకలను జూపి — కైమోడ్పులర్పించి
కావు మనెడి వారి — కామితముల
దీర్చి, యన్యజనుల — ధిక్కార మొనరించు
నాశ పాతకుండ - వని తలంప

ఆ. కోరి కొందుగాని – కొమ్మన నేరను
నీకు నిచ్చుటకును – నేనెవండ?
ఇచ్చి పుచ్చుకొనుట – కీవు, విక్రేతవు
గావు, బేరగాడ – గాను నేను.

ఆంగ్ల విద్యాభ్యాసమును. తమ 'తెనుగుతల్లి'లో ఇట్లు నిరసించిరి.

ఆసూ గూసులతో (Ass–Goose) కమెన్సయిన, యీ ఆంగ్లంపు
మర్యాద, నభ్యాసంబే–గణనీయ మంచు నుడువక, పాశ్చాత్య
విద్యానిధుల్–శాసింపఁ దొరలట్లు నన్యగతికుల్, సాగించి
రధ్యాపకుల్–గ్రాసావాస విలోపలోల ధిషణాక్రాంతుల్ యథోక్తక్రముల్.

'రామిరెడ్డి' అను లలితకావ్యములో శృంగార రసమును వెళ్ళబోయుచు, కోమటి కోడల నిట్లు వర్ణించిరి.

చెందొవ నిగ్గుతో–జిలుగు–చేలపు టంచులు జిందులాడ–నం
దందు బదంబు లందు; నరిగంచుల గుత్తపు నీలరైక–క
న్విం దొనరింప నుజ్జ్వల మణీమయ భూషలు దాల్చి, దేవతా
మందిర మేగుచున్నది సుమా–అది కోమటి కోడలంటరా!

ఒంటికి నంటు కొన్న, తెలియొల్లియు ప్రాయపుమేని పొంకముఁ
కంటికి విందుసేయ, కరకంజములఁ ధరియించి, పంచ పా
ళింటికి నింటికిఁ వరుస–నిందు నిభానన గేస్తురాంధ్ర, పే
రంటము బిల్వ బోయెడినిరా–అది కోమటి కోడలంటరా!

శ్రీ తిరుమల రామచంద్రిగారిట్లు వ్రాసిరి. "శేషశర్మ విద్వత్కవివర్యుడు. అలంకార శాస్త్ర పారంగతుడు. రసగంగాధర ఫక్కీలో ఈయన రచించిన 'అలంకార విచారము' విద్వాంసుల తలలూపేటట్టు చేసింది. ఈయన సుధాబిందువులు సహృదయ సుధాబిందువులు. తెనుగుతల్లి లోకవృత్తము పుణికి పుచ్చుకొన్న కవితామతల్లి."

'శ్రీ కేశవప్రపత్తి'లో శ్రీ శర్మగారు కేశవు నిట్లు వర్ణించిరి.

నిన్నే—నే శరణంటి—నా యవనముఁ—నీభారమే యంటి; య
న్యన్నే వేడను, నీకె సేవకుడ, నన్నుఁ—బాలలో ముంచినా
మున్నీటిఁ బడద్రోసినా అది యశమ్మో, నిందయో, నీకె— ఆ
పన్నానీక శరణ్యా—కీర్తికి దగఁ వర్తింపుమో—కేశవా!

శ్రీ 'యతిరాజీయము'లో, రామానుజాచార్యుల చరిత్రను పది గుచ్ఛములలోవ్రాసినారు. 7 గుచ్ఛములు ప్రకటించినారు. మిగత 3 గుచ్ఛము లచ్చునకు సిద్ధముగా నున్నవి. అన్నియు పద్యములే. వీరు విశిష్టాద్వైత మతస్థులైనను, శివకేశవులను సమానముగా అర్చించిరి.

కాళహస్తీశ్వరు నిట్లు వర్ణించిరి.

శంకర! చంద్రశేఖర! వృషధ్వజ! కృత్తివరాసి! మృత్యు నా
శంకర! పార్వతీ రమణ! సర్పవిభూషణ! భూషణాయితై
ణాంక కపాలమాల! నయనాయిత పావక! నీలకంఠ! నీ
కింకరి లెంక దాసఁ దిలకింపుము దీనిదయఁ మహేశ్వరా!

వక్రోక్తికి వాసిగన్న మహాకవి నీలకంఠ దీక్షితుని, 'ధర్మ ప్రబోధ' కృతికి 'శాంతి విలాసము' అనుపేర శ్రీ శర్మగారు అనువాదము వ్రాసినారు. తామే దీనికి తాత్పర్యమువ్రాసి, అనంతపురము నుండి వెలువడుచున్న 'సాధన పత్రిక' యందు వరుసగ ప్రకటించిరి. అందులో ఒకపద్యము.

ఎన్నిభవంబు లెత్తితినో? ఎందఱు తల్లుల బిడ్డ నైతినో?
ఎన్నిటి నీతి వాక్యముల - నెందఱు పెద్దలు సెప్పవింటినో?
ఎన్నిటి దుఃఖముల్ సుఖము లెన్నిటి గంటినొ? నైననేమి? య
న్నన్న! విరక్తి పుట్టదుగదా! విషయంబుల నించుకేనియుఁ

ఈ శర్మగారు, గోదాదేవి తమిళమున రచించిన 'తిరుప్పావై' అను కావ్యమును తెలుగులో పద్య కావ్యముగా రచించిరి. భగవద్గీతను, 'గీతామృతము' అను పేర, వ్యావహారి కాంధ్రి భాషలో కథగా రచించిరి.

విశ్రాంతి కాలము, వృథాబోసీయక శర్మగారు పలుతావులకు వెడలుచు, పురాణ కాలక్షేపము జేయుచున్నారు. ధర్మబోధ, భక్తి బోధ పురాణముల వినుట యందాసక్తి, నాస్తికత వ్యాపించుచున్న, నవీన కాలములో ప్రజలకుద్బోధ గావింప వలసియున్నదిగదా! శుభం భూయాత్!



" కవిచకోర చంద్రోదయ "

## శ్రీ పైడి లక్ష్మయ్యగారు

జననము:– **24—6—1904**

తల్లి:– శ్రీమతి వెంకటాంబ తండ్రి:– శ్రీ పైడి మునలప్ప

జన్మస్థలము:– అచ్చంపల్లి–కళ్యాణదుర్గం తా॥ అనంతపురం జిల్లా.

మతము, కులము:— హిందూ–కమ్మని కమ్మ.

శ్రీ లక్ష్మయ్యగారు ఆంగ్లభాషా పట్టభద్రు లగుటకుఁదోడు. సంస్కృతాంధ్రాది భాషలయందును పట్టభద్రులై పాశ్చాత్య దేశము లందుఁగూడఁబర్యటించి, తత్రత్య ప్రాజ్ఞులచే సంభావితులై, బహు దేశ దేశీయ విజ్ఞానము నవగతము గావించుకొని, న్యాయవాదులై అనంతపురము జిల్లా బోర్డు అధ్యక్షులై, పార్లమెంటు సభ్యులై, దేవదాయ ధర్మాదాయ శాఖల కమీషనరై, శ్రీశైల దేవస్థానముల పాలక వర్గమున కధ్యక్షులై, సలిపిన ప్రజాసేవ, దేవతాసేవ,

దేవాలయముల పునరుద్ధరణ సేవ, మఱవ రానిది. వారు పిన్ననాటనే 'దేశభాసలంధు–తెలుగులెస్స' అను ఆంధ్రభోజుని నుడి చక్కగా పాటించి, ఆంధ్ర భాషలో ప్రత్యేక కృషి యొనర్చి పండితుల మన్ననల గాంచిన ప్రాజ్ఞులు.

పసిడికి తావి అబ్బినరీతి పూర్వజన్మ సుకృత విశేషమున, వారికి పాండిత్యమునకు తోడుగా కవితాకళ అబ్బినది వారికి నాటకములన్న మిక్కిలి మక్కువ. ఆంధ్ర నాటకపితామహులగు స్వర్గీయ ధర్మవరము కృష్ణమాచార్యులవారి, అడుగు జాడల వర్తించి శ్రీ లక్ష్మయ్యగారు, విద్యార్థి దశయందే, నాటక రచన ముపక్రమించి 'మార్కండేయ' నాటకము రచించిరి.

ఈ నాటకమును 1926వ సం॥ అనంతపురమున–'కలియుగ ఆంజనేయ బిరుదాంకితులగు శ్రీ సి. యస్. నటేశంగారి నాటక మండలి వారు మనోహరముగ ప్రదర్శించి, ప్రజలను మెప్పించి, ప్రఖ్యాతి గాంచిరి. 1960 లో, కర్నూలు నాటక మండలి వారిచే శ్రీశైల క్షేత్రములో, మాజీ రాష్ట్రపతి డాక్టరు రాజేంద్రప్రసాదు గారి సమక్షమున కూడా ఈ నాటకము ప్రదర్శింపబడెను.

వీరు వ్రాసిన నాటకములు 1) మార్కండేయ విజయము 2) మహాత్మ కబీరు 3) శ్రీ రామాశ్వ మేధము (లవ, కుశ) 4) ఉద్ధాగ్రేసర. 5) తారాశశాంక 6) హేమారెడ్డి మల్లమ్మ లేక మల్లికార్జున మాహాత్మ్యము ముద్రితములు. సంసారనౌక, సాయిలీల, శ్రీశైలీయము వీరి అముద్రిత నాటకములు.

'సంసారనౌక' అను నాటకమును బళ్ళారిపురమున 1943లో, నాటి మద్రాసు గవర్నరు "సర్ ఆర్థర్ హోప్"గారి సమక్షమున

ప్రదర్శింపబడెను. 'సాయిలీల' అను నాటకమును అనంతపురము జిల్లాలో పలు తావులయందు ప్రదర్శించిరి. 1963లో, శ్రీశైలములో, కర్నూలు నాటక పరిషత్తువారు కూడ ఈ నాటకమును, ప్రదర్శించిరి. 'మల్లికార్జున మాహాత్మ్యము' అను నాటకమును, బెజవాడ శ్రీరాజ రాజేశ్వరి నాటకమండలివారు, 'శ్రీ శైలీయము' అను నాటకమును భ్రమరాంబా మల్లికార్జున కళాసమితివారు ప్రదర్శించిరి. వీరి నాటకములు నిర్దుష్టమై, నిరుపమానమై, సరళపద శోభితమై, నవరస భరితమై అలరారుచుండు ననుటలో అత్యుక్తి యుండదు.

## శ్రీ మల్లికార్జున మాహాత్మ్యము (హేమారెడ్డి మల్లమ్మ)

ఇది ఐదంకముల నాటకము. ఇందలి కథ, భక్తురాలగు మల్లమాంబ, పాండురంగ భక్తురాలగు సక్కుబాయివలె, తన భర్త చేతను, మామచేతను, నెంతయో యాదృతయయ్యు. సక్కుబాయి వలెనే తన యత్తయగు పద్మమ్మ వలన, తోడి కోడలగు నాగమ్మవలన, నానా కష్టములకు లోనై, వాటి నన్నిటిని నిశ్చలయై సహించి, మల్లికార్జున సేవాతత్పరయగుట, నిత్యమును జంగమయ్య వేషమున నామెకు మల్లికార్జునుడు సాక్షాత్కరించుట, వరముల వేడుకొమ్మన నత్తకును, దోడి కోడలికిని గల మహావ్యాధుల బోకార్చి వారిని నిజ భక్తురాండ్రగా గావించు కొమ్మని ప్రార్థించుట. తుదకు అత్తయగు పద్మమ్మయు, తోడి కోడలగు నాగమ్మయు బుద్ధి తెచ్చుకొని భక్తురాండ్రయి, మల్లమాంబకు శరణాగతులయి, మల్లికార్జునుని సేవించుట.

సోమిరెడ్డి కూతురైన మల్లమ్మను, అత్తగారింటికి పంపునప్పుడు,

సీ. పతిని, దైవంబుగా – భావించి సతతంబు
నింపు సొంపెలయఁ బూజింపు మమ్మ!
అత్త మామలను, ప్రత్యక్ష దేవతలని
తలఁచి భక్తిని సేవ సలుపు మమ్మ!
తోడికోడండ్రు, నీతోడ బుట్టువు లంచు
నెంచి, యాదరమునఁగాంచు మమ్మ!
సేవకులను, నిరసింపక కన్నబి
డ్డలవోలె బోషించి యలరు మమ్మ!

గీ. శ్రీగిరి క్షేత్ర మందు – రాజిల్లు నట్టి
జనని భ్రమరాంబ, మల్లికార్జునుఁడు మనకు
నిష్ట దైవమ్ములని, యాత్మనెంచు మమ్మ!
పోయి రావమ్మ! శుభములు–పొందు మమ్మ!

శ్రీ పైడి లక్ష్మయ్యగారు. భక్తి, జ్ఞాన, కర్మయోగములలో భక్తిమార్గము రాచబాట యన్నారు. మనస్సనెడి కోతిని బంధించుటకు భక్తిపాశము సులభమన్నారు. ఈపద్యమును చూడుడు.

అనిశము. మోహకాననము–నందు, నతీకుచ పర్వతమ్ములన్
కొన, మొన లేని యాశలను-కొమ్మల స్వేచ్ఛఁజరించు నట్టి, యా
మననను క్రోతినెట్టులో, నమంచిత భక్తిని గట్టి, నీ వశం
బునఁగొను మాదిభిక్షు! భవ! ముక్తిఫలప్రద! మల్లికార్జునా!

కవిగారు మాయ సంసారము నిట్లు కీర్తించిరి.

మాయ సంసార మిది తమ్ముడా! ఈ
మాయలోఁబడబోకు తమ్ముడా!
కన్నబిడ్డలు భార్య తమ్ముడా – నీ
కంఠాన కుర్రితాళ్లు తమ్ముడా!

చెన్న మల్లేశు పూజ తమ్ముడా— నీకు
చేకూర్చు మోక్షంబు తమ్ముడా!
శంభో! శివా యని తమ్ముడా! సలుపు
శివపూజ లెప్పుడు తమ్ముడా!

శ్రీ లక్ష్మయ్యగారు, శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్ల వద్దను, శ్రీ పేరరాజుగారివద్దను, ఛందోవ్యాకరణాది లక్షణముల నేర్చుకొన్నారు. వీరి కుమారులు శ్రీ పి. యల్ సంజీవరెడ్డిగారు ప్రస్తుతము కడప జిల్లాకలెక్టరుగా పని చేయుచున్నారు.

'బాబా సద్గురు సోమనాథమహారాజుగారు' వీరి ఆధ్యాత్మిక గురువు. వారిపై 'సద్గురు శ్రీ సోమనాథ శతకము' వ్రాసినారు. ఈ గురువుగారు, బెంగళూరు—కెంగేరిలో 'సావన్ దర్బారు ఆశ్రమము'లో యున్నారు.

'సూరి వందిత సద్గురు — సోమనాథ' అను మకుటముతో గీత పద్యములను వ్రాసినారు. అందుకో మూడు చదువుడు.

గీ. ధనము గడియింప, నీచ వర్తన మదేల?
జనుల వంచించి, మోసంబు సలుపనేల?
వచ్చునే వెంట పుచ్చిన వక్రతుదకు? ॥సూరి॥

గీ. సంతులు, సరోవరములు, వర్షంబు, తరులు
జనుల కొసరించు చుండు నిస్స్వార్థ సేవ
స్వార్థరాహిత్యసేవయే — సత్య పథము ॥సూరి॥

గీ. సద్గురూత్తము మూలాన — సలుపు పూజ
చెందు తనకని పరమాత్మ — చెప్పు చుండు
సద్గురువు లేనిపూజ, నిష్ఫలము గాదె? ॥సూరి॥

ప్రస్తుతము, శ్రీ పైడి లక్ష్మయ్యగారు అన్ని పదవుల నుండి, రిటైరై, సుఖశాంతులతో కాలము గడుపుచున్నారు. అనంతపురములో, కోర్టురోడ్డులో వీరి విశాల భవనము కలదు. వీరి సలహాల కొఱకు, దివ్యమైన సందేశముల కొఱకు, కవులు, పండితులు అన్ని సంస్థల ఉద్యోగులు, రైతుజనులు అశ్రాంతము వీరిగృహము నలంకరించుచుందురు. కవి పండితులయందు వీరి కవ్యాజమైన ప్రేమ కలదు. ప్రస్తుతము వీరు అనంతపురము జిల్లా రచయితల సంఘమున కధ్యక్షులై, సారస్వత సేవ లొనరించు చున్నారు. వీరు స్వయముగా కవులేకాక, కవుల నాదరించు స్వభావము కలవారు. గ్రంథమాలకు రూ 116 విరాళము చెల్లించిన ధన్యులు. అచిరకాలములోనే, వీరి అముద్రిత నాటకములు ముద్రింపబడునని నమ్ముచున్నాము. వీరి చిత్రపటము ఈగ్రంథములో దాతల ఫోటోలలో ముద్రింపబడినది. గమనింపుడు. భగవంతు డాయురారోగ్య భాగ్యముల నిచ్చి వీరిని కాపాడు గాత!



విద్వాన్, అభినవ వేమన

## శ్రీ జోస్యం జనార్దనశాస్త్రి

జననము:— **2—10—1911**

తల్లి:— శ్రీమతి అన్నపూర్ణమ్మ తండ్రి:— శ్రీ వేంకటరామయ్య.

జన్మస్థలము:— పాణ్యం—కర్నూలు జిల్లా.

మతము, కులము:— హిందూ—ములకనాటి బ్రాహ్మణ—కౌండిన్యస గోత్రులు.

పచ్చ కప్పురము నదల్చు వాసన పస
వలపుఁబారిజాతపు టలరుల మృదులత

లింపు సొంపుల నింపు ప్రేమంపుఁ జలువ
వెన్నెలల వెల్లి జాబిల్లి కన్నతల్లి.

'కన్నతల్లి' ఆరాధనతో తన తొలి కవితాగానము నారంభించిన కవికోకిలావతంసులు శ్రీ జోస్యం జనార్దనశాస్త్రిగారు. అది వారి కవితా వ్యాసంగమునకు శుభోదర్కము. 'కన్నతల్లి' కావ్యమును రచించి నిజమాతృదేవికి సమర్పించి తల్లి ఋణమును దీర్చుకొని ధన్యులైరి శ్రీ శాస్త్రిగారు.

కడుపు పంటకై తల్లి పడెడి కష్టములు, కన్నతరువాత సంతాన పోషణకు పడెడి కడగండ్లు, కొడుకు నొక యింటివానినిజేసి, కోడలి రాపిళ్ళకుఁగుళ్ళుచు, కొడుకును జూచుకొని కొండంత సంతోషముతో కాలము బుచ్చు తల్లి గాంభీర్యమును వర్ణించుపట్ల శాస్త్రిగారు మిక్కిలి తన్మయత్వముతో, స్వానుభవమును వెల్లడించిరి. బిడ్డలపై మోహము తల్లికెప్పుడు నొకే రీతియుండుననుటకు శాస్త్రిగారీ పద్యమును చెప్పిరి.

తనయుఁడెంతటి బిడ్డల తండ్రియైన
దనదు పాలికిఁ బసికూన యనియె దలఁచి
వేళ కన్నము బతిమాలి పిలిచిపెట్టు
కన్నమోహము విడలేక కన్నతల్లి

శ్రీ శాస్త్రిగారు కన్నతల్లితో బాటు 'ప్రకృతి కన్నతల్లి'ని కూడ ఆరాధించిరి. వారి దృక్పథములో యిరువురును సమానమే.

ఎలిమి సంజె కొమ్మలు తెరలెత్తిదింప
లీలఁగోయిల కలరాగ మాలపింప
శ్రావ్యముగఁ జిల్క పడఁతి వర్ణములు పల్క

కుల్కు పురివిప్పుకొని నెమ్మి గొండ్లి సలుప
హాయి బిడ్డల నొడినిడి యలర జేయు
ఘన వినోద, మోద ప్రకృతి కన్నతల్లి.

ప్రకృతిమాత యొడిలో బిడ్డలు పొందు హాయిని చక్కగా అభివర్ణించిరి. శాస్త్రిగారి తల్లిదండ్రులు ప్రాచీనార్ష సంప్రదాయమునకు చెందిన సాత్త్వికులు. శ్రీ కవిగారు ప్రాథమిక విద్య 10–12సం॥లలో ముగించి తరువాత మేనమామల కడ, పూర్వ పద్ధతులలో సంస్కృతాంధ్ర కావ్య నాటకాలంకారములను నేర్చిరి. 1933 లో శాస్త్రిగారు మద్రాసు యూనివర్సిటీలో 'విద్వాన్' పరీక్షలో నెగ్గి, అప్పటినుండి అనంతపురంజిల్లా తాడిపత్రిలో మునిసిపల్ హైస్కూలు నందు ప్రధానాంధ్ర పండితులుగా పనిచేసిరి.

శాస్త్రిగారు తమ 'కన్నీటిచుక్కలు' అనుకావ్యములో తండ్రి కొఱకు పరితపించు కుమారుని ఆవేదనను వర్ణించిరి. పారశీక యువకుడైన 'షొహరాబ్' చదువు సాములందారితేరినవాడు. అతడెంతోకాలము తన తండ్రి నామధేయము తెలియనివాడై, సాటివారిలో అపహాస్యముల పాలైనాడు. అతడావేదనకు క్రుంగి పోయినాడు. తండ్రినిగూర్చి తల్లినిట్లని ప్రశ్నించినాడు.

"అమ్మ రుస్తుము నరియుద్ధి నైతి నంద్రు
నేఁటి పారసీక యువక కోటి యందు
జనకుఁడెవ్వడొ? నాకు నీ నరికిఁ దెలుప
బూన విదియేమి? యేమి యీ మౌనముద్ర?
సాటివారల చదువులు సాము లరసి
వారి తండ్రు లానంద సంభరితు లగుచు
మెచ్చుకొని, చీరి, కౌఁగిటఁ గ్రుచ్చియెత్త
దేరిచూచుచుఁ గుందుదు దేబె పగిది!

అద్భుతావహమైన విద్యాప్రదర్శ
నమ్ము దిలకింప వచ్చు జనమ్ము నన్ను
గూర్మిఁబిలిచి " నీవెవ్వాని కొడుక " వన్న
బట్టరాని వేదనఁ దల వంచు కొంటి "

తల్లి కుమారుని ఓదార్చి నీకు సరియుద్ధియైన 'రుస్తుము' నీ తండ్రి యని సమాధాన పఱచెను. రుస్తుము మొగమెఱుగడు షొహరాబ్. షొహరాబ్ తన పుత్రుడని రుస్తుముకు తెలియదు. ఈ విషమ పరిస్థితిలో విధి వక్రించి తండ్రి కుమారులకే యుద్ధము జరుగును. తండ్రిచేతనే కుమారుడు హతుడగును. తనయుడని తెలిసిన తరువాత తండ్రి యిట్లు శోకించును.

" క్రూరుఁడను, మోసగాఁడను, ఘోర పాత
కుడను, బాడు పౌరుషమునఁ గొడుకటంచు
దెలియఁ జాలక నవనవోజ్జ్వల సురూప
శౌర్యశాలిని జేసేత జంపు కొంటి.

నా వరాలమూట! నావంశ రత్నము!
నా కుమార! తెలివి లేక తన్ను
దానె చంపుకొన్న దౌర్భాగ్య రుస్తుము
వీఁడె పుత్రహంత! వీడె ఖలుఁడు!

కవిగారిందు వీర కరుణా రసముల రెండింటిని సమపాళ్ళలో మేళవించి. చదువరుల కంట కన్నీటిచుక్కలు రాల్పింతురు. వీరి 'కృతిపతి' కావ్యము గ్రామ్యభాషలో, శిష్టవ్యావహారిక ఫక్కిలో, తెలుగు జాతీయ పలుకు బడులతో సాగిన ఖండకావ్యము. భారత స్త్రీ జీవితమును చిత్రించు 'సీతమ్మ' యను కావ్యఖండము గూడ యిందు చేర్పబడినది.

రాయల కాలమునాటి ప్రజానీకము కూడ కవితాభిరుచిగల వారనియు, ప్రజలు, ప్రభుత్వము, ఆనాడు కవులను, కావ్యములను గౌరవించెడి వారనియు కృతిపతి కావ్యము ద్వారా మనకు జోస్యము వారు తెల్పిరి. అందు కనువగు నొక కథనుకూడా అందు జోడించిరి. గువ్వల చెన్నుడు రాయలను మించిన రసజ్ఞుడు. వాడు పెద్దన్న కవిత్వమును మెచ్చుకొని స్వర్ణకంకణమును బహుమానముగా పొందినాడు. ఒకసారి ఒక పరదేశి విప్రుడు రాయల కొలువుకు వచ్చి భంగపడినాడు. అతనిని ఆదరించిన వారు లేరు. అతడు ప్రచ్ఛన్న రూపమున నున్న, తెనాలి రామకృష్ణుని కలిసినాడు. రామకృష్ణుడతనికి ఒక పద్యమునేర్పి, చెన్నుడి వద్దకు పిలుచుకొని వచ్చినాడు. ఆ సమయములో చెన్నుడు అతని భార్యమధ్య జరిగిన సంభాషణ నిట్లు కవిగారు వ్రాసిరి.

భార్యః— మామా! యేంతిక్కోనివి?
ఆ మారాజే అడక్క ఆకడె మిస్తె
నీ మన్నెంబడి తుంటా
నే మోజుగ అడుగు తుంటె యీరా దేమే?

చెన్నుడు:— పిల్లా! దాని గ్గాదే
యిల్లాలికి సొమ్ములేంటికే! యెరి మొగమా!
యిల్లూ, వాకిలి, మొగుడూ,
నల్లగ తిననీకి వుంటె సాల్లే దేమే?

నాపాలి వున్నె మాయని,
ఆ పెద్దయ్యకు దయొచ్చి ఆయన కాయ్నె
ఆ పద్యాల్మొలాన్నే
నా పేర్మిల బెట్టు నంతు నాక్కలిగించెణా.

పోయే! అయియేకము దా
నా! యేపాటి సుగాలుగాని యేం సాన్వత మౌ
తాయూ? యివన్ని యెంటొ
స్తాయూ? పేరొగటి తప్ప తతిమా వల్లా!

చెన్నుడి వద్దకు వచ్చిన ఆ విప్రుడు 'కులవిద్యకు సాటిలేదు గువ్వలచెన్నా'! అని పద్యము వల్లించును. చెన్నుడు పొంగిపోయి బంగారు కంకణ మతనికి బహూకరించుతాడు. తరువాత మరొక బ్రాహ్మణుడు వచ్చి అదే పద్యమును మరింత కమ్మగా పాడి విని పించును. అతనికి చెన్నుడు తన జీవనాధారమైన గొడ్డలిని సమర్పిస్తాడు. దీనినంతటిని మారువేషమున నున్న రాయలు గుర్తించి చెన్ను నీవిధంగా సత్కరించును.

ధనమేల? రాజ్యమేలా?
వినయ వివేకముల తోడి వితరణ గలుగన్
అనుమాన మేల? నాకం
టెను గువ్వల చెన్నఁడొక్కఁడే కృతిపతియౌ!
అని కృష్ణదేవ రాయలు
తన కంఠమునం దమూల్యా తర హారంబున్
గొనుమోయి! 'సత్కృతిపతీ!'
యని చెన్నుని కంఠసీమ యందు నమర్చెన్.

ఇందు పాత్రానుగుణమైన భాషను, విశేష వాడుక లోనున్న నానుడులను సంభాషణ లందు వాడి దృశ్యకావ్యముగా రక్తికట్టించిరి

'సీతమ్మ' ఖండకావ్యము నందొక ఆడుపడుచు మనోవేదన చిత్రీకరింపబడినది. ఆధునిక సీతమ్మ తన కడగండ్లను పురాణ స్త్రీయైన సీతాదేవితో చెప్పు కొంటున్నట్లు వర్ణించినారు కవిగారు.

కవిగారు కన్నులార నేటి సతీమతల్లుల అగచాట్లన్నియు చూచిరి. ఆ హృదయవేదనను పద్యరూపము నందుంచిరి. ఇది ప్రతి భారత స్త్రీ పొందుతున్న సంక్షోభము. కొన్ని సంఘ దురాచారములకు, అన్యాయములకు, ఆడుది ఆహుతి యగుచున్నది. వాటిని మార్చ వలెననెడి తలంపు కవిగారికి పూర్తిగా కలదు. అందుకతడెన్నో యథార్థ విషయములను బయటపెట్టును. వారందుకు వెనుదీయ లేదు. ఆడుబిడ్డలపై తల్లిదండ్రుల అభిప్రాయ మెట్టిదోచూడుడు.

ఇది మన సొమ్ముకాదిచట నిల్లడ పెట్టిన దేరి కోసమో
గద? యెటు లెన్ని చేసినను గాని యొకయ్యకు నెట్టు నొప్పఁజె
ప్పదగిన దాడుపిల్ల యను భావనతో విధి లేక సాకు నొ
ప్పిదముగఁ దల్లిదండ్రుల గుపింతురు మాదెటు వంటి కర్మయో!

యథార్థ విషయము చెప్పిన అందరి కది చేదుగానే కనిపించును.

"ఉన్నమాటంటే ఊరందరికులుకు" అన్న సామెత సాధా రణ మైనదే. అంత మాత్రమున నిజ విషయములు దాచుట మం చిది కాదుకదా! అందుకే జోస్యం వారు, లోకపు తీరునందలి గుణ దోషములను పరిశీలించి, వ్యంగ్యముగ, సూటిగ, ఛలోక్తిగ 'ఉన్నమాట జోస్యమన్నమాట' అను మకుటముతో అనేక ప్రసంగములను 'అభినవ వేమన'వలె వెలికి నీడ్చిరి. వేమనపై గల గౌరవాదరములే శాస్త్రిగారిచే 'ఉన్నమాటలు' వ్రాయించినవి. దేవతా ప్రసంగమున జెప్పిన ఈ పద్యము జూడుడు.

ఆ.వె. దొడ్డగా శతక్రతువు లాచరింప నీ
మూడు లోకములకు తేడుగాని
యొరుల సతుల కుఱుక నొడలెల్ల గుల్లయౌ
నున్నమాట జోస్యమన్న మాట.

నీతి ప్రసంగములో: బాల భటుడు, బాల వటుడు, బాల నటుండు
బాల యతియు, బతియు బాల విధవ
కీర్తి మువ్వురు నపకీర్తి మువ్వురు గాంతు
రున్నమాట జోస్యమన్నమాట.

కళాప్రసంగములో: సంతు దొంతులు బడిపంతులకు ధనమ్ము
కాగితంపు చింపు కవికి ధనము
అల్లరుల: తగవులె న్యాయవాదికి ధన
మున్నమాట జోస్యమన్నమాట.

హరిహర తత్త్వము నిట్లు కవిగారు చెప్పిరి.
పాము నీళ్లు తనకుఁబైననో క్రిందనో?
తానె నలుపా? తనదు తరుణి నలుపా?
అలగుడి తలకట్లె హరిహర స్వరతత్త్వ
మున్నమాట జోస్యమన్నమాట.

సంస్కృత భాషాకోవిదులైన శాస్త్రిగారు కాళిదాసు రఘువంశ కావ్యమందలి 'వరతంతు కౌత్సల కథ'ను తెనుగున 'పసిడి పంట'గా తెనిగించిరి. ఇది గురుశిష్యుల మధ్యగల యుదాత్త సంబంధమును, ప్రేమాభిమానములను వెల్లడించును. శ్రీ మధునాపంతుల సత్యనారాయణగారీ కావ్యముపై తమ అభిప్రాయమ: నిట్లు వ్రాసిరి.

'సంప్రదాయ సుందరమైన వర్ణనలతో, సంస్కార ప్రౌఢమైన భాషతో, సమన్వయ ప్రియమైన భావ సంపదలతో 'పసిడి పంట'' జయఘంట' యనిపించుచున్నది.'

ఇటీవలనే శాస్త్రిగారు 'దుర్గా సప్తశతి' నిగూడా తెనిగించిరి ఉద్యోగ విరమణ చేసినప్పటినుండి వీరు తాడిపత్రి యందే స్థిర

నివాసమున్నారు. వీరి కుమారులు శ్రీవిద్యాసాగర్ కూడ రచయితే. 'రిరంస'యను గేయకృతిని వీరు వ్రాసినారు. శాస్త్రిగారు షష్టిపూర్తి మహోత్సవమునుగూడ ముగించినారు. ఎట్టి సన్మానముల కాశింపక పోయినను, వీరు తమ కృతులద్వారా ఆంధ్రి మహాకవుల మన్నన లనేకములపొందిరి. వారికదియే సంతోషము.

తమ పద్యరచనలో ఒక విశిష్ట వరవడిని వీరు పెట్టుకొన్నారు. ఆశైలి కొందరికి మాత్రిమే కలదు. అల్పపదములతో సాగిన ఆటవెలది పద్యము లందిమిడ్చిన భావములమోఘములు. ఈ కవిశేఖరుల కలమునుండి మరికొన్ని మధుర కావ్యములు వెలువడగలవని ఆశించుచున్నాము. భగవంతుడు వీరికాయురారోగ్య భాగ్యములనిచ్చి సాహిత్యకృషి మరింత ఇతోధికముగా చేయింపగలరని ఆశించుచున్నాము.



మధురకవి, రాయలసీమ కవికోకిల

## శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి

జననము:– 4—2—1910

తల్లి: శ్రీమతి సీతమ్మ తండ్రి:– శ్రీ బెళ్లూరి హనుమంతరావు

జన్మస్థలము:– తలమర్ల. పెనుకొండ తా॥ అనంతపురం జిల్లా.

మతము; కులము – హిందూ–బ్రాహ్మణులు.

రాయలసీమ నెవరో రాళ్లసీమ అన్నారు. ఈ సీమ గత వైభవమెట్టిదియో వారెఱుగరు. రత్నములను రాసులుగా పోసి, ఈ సీమలో విక్రయించినారు. వజ్రకరూరు , వజ్రములు దొరికినవి. వర్షాకాలములో ఇప్పటికికూడా, పరదేశీయులిచ్చటికివచ్చి,

ప్రతి శిలను వెదకుచున్నారు. రాయలసీమ మట్టిలో బంగారు గనులు దొరికినవి. రామగిరి ప్రాంతములో బంగారు కొఱకు, అఖండాన్వేషణము ప్రభుత్వమువారు జరుపుచున్నారు.

'రాయలసీమ 'లో చక్కని కవిత్వము చెప్పువారున్నారా? అనునది మఱొక ప్రశ్న ? ఈ సీమ పెనుకొండ. కొండలలోనే 'వసుచరిత్ర ' కావ్యముద్భవించినది. ఈసీమ కొండకోనలలో మధుర కవితాగానము వినవచ్చినది. రాయలసీమ 'రసజ్ఞత 'గుఱించి శ్రీ నండూరి రామకృష్ణాచార్యులిట్లు పల్కిరి.

క్షామము దాపురించి పలుసారులు చచ్చెను జంతు సంతతుల్
వేమరు చచ్చినారు ప్రజ వేనకువేలు చరిత్ర లోపలన్,
క్షామము లెన్నివచ్చిన – రసజ్ఞత మాత్రము చావలేదు, జ్ఞా
నామృత వృష్టికిన్ కొరతనందని రాయలసీమ లోపలన్.

ఈ పెన్నేటిగడ్డపై పుట్టిన అచ్చపు రాయలసీమ కవి కుమారుడు, ప్రకృతిదేవత నువాసించి 'మధురకవి ' యై యిట్లు గీతమును బాడుచున్నాడు.

చాల చిన్నదిరా!
నాయిల్లు – చాల చిన్నదిరా!
నామీది ప్రేమతో – నావాకిటను నిల్చి
నన్నుబిల్తువుగాని – అతిథ్యమెటుసేతురా
నాబ్రదుకు అంతటికి – నోచదయ్యెనురా!
కారు మబ్బుల లోన – కటిక చీకటిలోన
నా స్వామివగు నీవు – నా కొఱతనేతీర్ప
నా వాకిటను నిల్చి – నన్నుబిల్తువుగాని

చిన్నిదివ్వెయు లేదురా
నీరాక చిత్తమున । వెతగూర్చురా!

మిత్రమై నాతోడ — మెలగి ముచ్చటలాడ
అరుదెంతువే గాని — చిఱుచాపయును లేదురా
కూర్చుండ, శిథిల భూభాగంబురా!
కనుల నిండుగనీరు — గ్రమ్ముకొన నీచెంత
పాటలే వినిపింతురా — నాబ్రతుకు
పాటతో పయనించురా। (అమృతాభిషేకము)

శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి పేరెఱుగని వారు లేరు. వీరి కవితలు తెలుగుదేశపు నలుమూలల వ్యాపించినవి. ఇతనిని రాయలసీమలో, ఒక అగ్రశ్రేణి కవిగా నిలబెట్టినది 'భారతి' (మాసపత్రిక) "అవ్యాజ వాత్సల్యముతో భారతి భిక్షపెట్టక యున్నచో 'నాజీవితము'లో ఏనాడో, కవితాసన్యాసము స్వీకరింప యుండవలసినవాడనే" యని కవిగారు చెప్పుకొన్నారు.

ప్రకృతికన్య, 'శ్రీ బెళ్లూరి' వారిని లేత్రాయముననే వరించినది. శుకపిక శారికలు, కర్షకులు, కాపుకన్యలు పచ్చని పైరులు, పూదీగలు వారి కవితాసొత్తులు. అతనికి వాటితో పొత్తు వీడరాని బంధమైనది. అవి ప్రసాదించిన సుఖము కవిగారికి మఱెచ్చట దొరకలేదు. అందుకే అతడిట్లు చెప్పుకొన్నాడు.

పరిమళింపని దొక్కపుష్పంబు లేదు
నేను విహరింపఁజనిన వనీతలాల
సుకృత వశమునఁ గలిగిన సుఖము లందు
నోలలాడితి యౌవనోన్మీలనమున.

ప్రకృతి యొడిలోన సుఖసుప్తివడయు చుందు
కోయిలలు లేప నిదుర మేల్కొనుచు నుందు
అడవి కోనల సెలయేటి పడుచుఁగాంచి
పరమ సంతోష భరమున బలుకరింతు.

మొగ్గనై, యాకు మఱుగున బొలుతు నేమొ?
పూవుగాఁబూచి పరిమళ మొలుకఁబోతు
నో విహంగమై పరతునో? భావగీత
మగుదునో? నేను భావిజన్మములయందు

కాంక్షలేవేఱు, నా మనోగతులె వేఱు.
పూరి గుడిసెలలోనైనఁ బుత్తుగాని
గీత మల్లక బ్రదుకు సాగింపలేను;
భావగానంబె నాదు సర్వస్వమవని! (తపోవనము)

శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తిగారి జనకులు శ్రీ బెళ్లూరి హనుమంతరావుగారుకూడ సాహిత్య పిపాసకులే. వారెన్నో పద్యములల్లిరి. వారు అలోపతి, హోమియోపతి, ఆయుర్వేదాది సమస్త వైద్యశాఖలలో సిద్ధహస్తులు. శ్రీ బెళ్లూరివారు శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులకడ శిష్యరికమొనర్చిరి. అప్పటినుండి వీరు గురుకుమారులైన శ్రీపుట్టపర్తి నారాయణాచార్యుల వారికి ప్రియ మిత్రులైరి శ్రీ విద్వాన్ విశ్వంగారు వీరి బాల్యస్నేహితులు. ఈ ముగ్గురు కొన్నినాళ్లు రాయలసీమలో 'కవిత్రయముగా' వాసి కెక్కిరి.

శ్రీ బెళ్లూరివారి కవితాధార తేనెకంటెను తీయనిది. ఆయన గారి రచనలు చదువుచున్నప్పుడు పాఠకుడు తాను సెలయేటి జలత రంగాలలో నీదులాడి నట్లానందించును. ఆ పద్యములందరి రమ్య

మైన భావములు హృదయ ఫలకములపై ముద్రవేయును.

కవికి కావలసిన ప్రతిభ వ్యుత్పన్నత వీరికి కలదు. "పద్యము చదువగనే కవికి ఆర్జవగుణమెంత యుండునదియు కావ్యానుభవ రసికులకు స్పష్టముగా తెలిసిపోవును. ఈ యార్జవగుణము నిండి యుండుటను శ్రీనివాసమూర్తిగారి కవనమందు ప్రతి పద్యము నందును మనము చూడవచ్చును. ఈ గుణముచే వీరి సుందరవస్తు ప్రపంచము విశాలమైనది" (శ్రీరాళ్లపల్లి.)

శ్రీ బెళ్లూరివారు తమ 'కావ్యగంగ'లో తమ కవితాంగనను తెనుగు ప్రాంగణములోని కాహ్వానించిరి. ఆమెకు కవి, తమ తెనుగు ప్రాంగణములోని విశేషముల నిట్లు నుగ్గడించును.

తరుణీ తప్పకపోయి చూడదగు నందంబైన "లేపాక్షి" యె
వ్వరు నిర్మించిరొ దేవతాయతన మబ్బా, యేమి శిల్పంబు, మ
త్సరమున్ గాంతురు భిన్నదేశ జనులా సౌందర్యముంజూచి, ఆ
శిరసుల్ విప్పిన సర్పమో, వృషభమో, స్త్రీమూర్తులో యచ్చటన్.

•కావ్యగంగ'ను మైసూరు విశ్వవిద్యాలయమువారు బి. ఎ., బి. యస్. సి., పరీక్షలకు పాఠ్యపుస్తకముగా నుంచిరి

వీరి 'శిల్పవాణి' కావ్యమందు శిల్పవిలాసిని యొక్కతె తన స్వీయానుభవమును నివేదించుకొనును. అందు విజయనగరపు రాజైన శ్రీ కృష్ణదేవరాయల రాజ్యాంగము, సాహితీసమరాధన. నాటి సంస్కృతి సంగ్రహముగా నిక్షిప్తమైయున్నది. రాయల సాహితీ కొలువుకూట మిట్లు అలంకరింపబడినదని శిల్పవాణి తన హృదయవీణను మీటి పలుకుచున్నది.

రూపుగొన్న కవిత్వ రోచిస్సువలె పెద్ద
నామాత్యుడొక్కచో నధివసించె,

అమృత గంగాప్రవాహము వోలె నంది తి
మ్మన వచ్చి నిజపీఠమున వసించె,
పదగుంభన ప్రౌఢి పాటించు రామ కృ
ష్ణ కవీంద్రుడుచితాననమున జేరె,
గాంధర్వ కలనేర్పి కవితాకుమారిని
కై సేయు భూషణ కవియు వచ్చె,
సాహితీ పుత్రుడల్ల ధూర్జటి కవీశు
డపర తిక్కన పింగళి యరుగుదేర
వచ్చెనయ్యలరాజు, సభాస్థలంబు
మల్లనయు జేరె సభ్యుల యుల్ల మలర.

కవి హృదయమెల్లప్పుడు ఒకేరీతిగా నుండదు. అతనికి సుఖ దుఃఖములు కలవు. అతడొక్కపరి ఆనంద ఘురులందోల లాడును. ఒకొక్కసరి విషాదసాగరమున మునుగును. విషాద మావరించినపుడు భగవంతుని ముందతడు కుమిలి కుమిలి ఏడ్చును. బెళ్లూరి వారికి పుత్రికావియోగము సంభవించినప్పుడు తమ యావేదనను పద్యరూపమున నుంచిరి. ఆ విషాద జనకమగు ఆగాధకు, ఆ బాధకు మనగుండెలు కరుగును.

పానము సేయబూని మధుపాత్రిక నాయధరంబుఁజేర్చితిన్
గాని, యపారమై యచటఁగానబడెన్ విషబుద్బుదంబు లా
శా నిహతుండనైతినని స్వామి. వచింపఁగలేను నాకథన్
ప్రాణము వోసి నా హృదయభార మణంపుము నీకుమ్రొక్కెదన్.

ఎదిగిన కుమారుని కోల్పోయిన విషాద తరుణమున కూడా వారిట్లే కన్నీరు గార్చిరి. వారికి ప్రకృతిరూపము వికృతముగా గోచరించినది. కోకిలపాటలో పదును కత్తిపోటు కనిపించినది. అందుకే వారు—

పాడకు మీ ప్రభాతమున పాడకు కోకిల; నీదుపాటలో
వాడి కృపాణవర్గములు వ్రచ్చెడు నా హృదయంబు. పుత్రునిన్.
బూడిదవైచి నేశిశిరముం గనుచుంటిని జీవితంబులో
పాడకు మీ ప్రభాతమున పాడకు కోకిల ప్రేమగీతముల్

శ్రీ బెళ్లూరివారు తమ జీవితమునవిట్టి యొడుదుడుకుల నెన్నింటినో వోర్చి నిలద్రొక్కుకొన్నారు. 30యేండ్లు అనంతపురం జిల్లా బోర్డు ఉన్నతపాఠశాలలలో ప్రధానాంధ్రపండితుల పని నిర్వహించి అనేకమంది విద్యార్థులను సాహితీప్రియులుగా తీర్చి ప్రస్తుతము ధర్మవరం తాలూకా కుంటిమద్ది గ్రామమున విశ్రాంతి గైకొనుచున్నారు. ఈ విశ్రాంతి సమయములోను వారి కలము చిందులు వేయుచున్నది. ఇటీవలనే వీరి 'శిల్పవాణి' విడుదలైనది. 'రెడ్డి రాజుమల హాయుగము' ముద్రణ కావలసియున్నది. ఈ మధ్యనే అనంతపురంలో జిల్లాకలెక్టరుగారి సమక్షమున కవిగారికి గొప్పగా సన్మానము జరిగినది. వారిప్పటికి జరుపుకొన్న సన్మానమదొక్కటే. వారెన్నడు సన్మానములకు, పొగడ్తలకు ఆశించిన మనుష్యులు కారు అపర వివేకానందులు.

వారి ఖండికలన్నియు ప్రకృతి సౌందర్యమునకు ప్రతీకలే. కావ్యనిర్మాణమేదైనను జేయవలెననెడి తలంపు వారికి చిరకాలము నుండి కలదు. ఆధ్యాత్మిక జీవనమున అత్యున్నతస్థానము నందుకొన్న వివేకానందుని చరిత్రనే కావ్యవస్తువుగా దీసుకొని రమ్యమైన ద్విపదలో 'వివేకానందం' రచించి ధన్యులైరి. చికాగోలో తన్నాదరించిన సాధ్వీమ తల్లితో వివేకానందుడిట్లనుచున్నాడు.

అతిపూత చరిత భారత రత్నగర్భ
బ్రతుకెల్లదోచితీ వఱకు; నయ్యాదియె

నా జన్మభూమిః మానసము సర్పించి
పూజింతు నాదివ్యభూమి నేనాఁడు
భువనేశ్వరీమాత పుణ్యగర్భంబు
నవమానములు మోచెనన్ను; నాతండ్రి
విశ్వనాథుఁడు నన్ను బెంచె; సర్వంబు
విశ్వేశ్వరుని కృపాభిక్షగా దలఁతు
రామకృష్ణాఖ్యగుర్వాజ్ఞ, పాలింప
భూమండలి చరింతు; ప్రేమ నర్పింతు;
నాశిషంబుల నందుమమ్మ! నీపల్కు
లాశా లతిక బెంచెనమ్మ నాలోన"
అని వివేకానందుఁడాహ్వాన సరణి
జని, యామెగృహము పావనము గావించె.

శ్రీ శ్రీనివాసమూర్తిగారు వందలకావ్యములు వ్రాయలేదు కాని వ్రాసిన వన్నియు మేల్బంతులు, తెనుఁగుతల్లికి అమూల్యాభరణములవి. వీరి కృతులలో ఖండకావ్యములెక్కువ. తపోవనము—కావ్యగంగ—అమృతాభిషేకము—విశ్వపైణికుడు. జాముకోడి-మొదలగునవి వీరి ఖండకృతులు. శిల్పవాణి-వివేకానందము కావ్యములు. కవిగారు 'గీతావాణి' పత్రికకు గౌరవ సహాయ సంపాదకులుగా పనిచేసిరి. వివేకానందము గీతావాణి పత్రికయందు ధారావాహికగ ప్రచురింపబడినది.

మధురకవి-రాయలసీమ కవికోకిల-అభినవకాళిదాసు మున్నగు బిరుదులతో కవిగారిని సత్కరించుటలో సరిపోలేదు. ఇట్టి కవీశ్వరులకు ఆర్థికముగా సహాయ పడుటగూడా మన ధర్మమైయున్నది దీనిని గుర్తించినప్పుడే రాయలసీమ ప్రజలు ఆంధ్రభోజునకు దీటైన సాహితీపోషకులు గాగలరని మా విశ్వాసము.

విద్వాన్

# శ్రీ షేక్ దావూద్ సాహెబ్

జననము:— 1—7—1916

తల్లి:— శ్రీమతి ఖాదర్‌బీ తండ్రి:— శ్రీ సుల్తాన్‌సాహెబ్.

జన్మస్థలము:— 'చిట్వేలు' కడప జిల్లా.

మతము, కులము:— ఇస్లాం – ముస్లిము.

20వ, శతాబ్దమునకు మున్ను. ఆంధ్రభాషలో కృతులు వ్రాసిన మహమ్మదీయులున్నట్లు మనకు తెలియదు. మాలిక్–ఇబ్రహీమ్‌షా – అమీణాఖాన్ మున్నగు వారందరూ కృతిభర్తలు గానే పేరొందిరి. వారు తెనుగు కవులనాదరించిరి. తెనుగుకావ్యముల నంకితముగొనిరి. వారు ఆంధ్రసారస్వతము గూడ తమది గానే యభిమానించిరి. రానురాను హిందూదేశములోని మహమ్మదీయులు వారి 'ఉర్దూ'తో బాటు సంస్కృతాంధ్రభాషలను నేర్చి తియ్యతియ్యని తెలుగుకైతలు సృష్టించిరి. అది తెలుగుభాషకొక గౌరవప్రదమైన విషయము. భారతికి మతము, కులములతో బని లేదు. ఆవిడ సంస్కారవంతునితో చెలిమిచేయును. అతదిని తీర్చిదిద్దును. అట్టి భాగ్యశాలి-కవి, పండితుడు, హిందూ. మహమ్మదీయ మతసమన్వయము నెరిగినవ్యక్తి శ్రీ షేక్‌దావూద్ సాహెబ్.తనది ఇస్లాం మతము మాతృభాష ఉరూ. పుట్టినది భారత దేశము. చేబట్టినది హిందూ. మహమ్మదీయ సమన్వయము. నేర్చినది సంస్కృతాంధ్ర, హిందీభాషలు. కవితచెప్పి 'శహబాష్' అనిపించుకొన్నది ఆంధ్రమున-ఇవి దావూద్‌గారి ప్రత్యేకతలు.

పేదకుటుంబమున పుట్టిన దావూద్‌కు చిన్నతనములోనే తల్లిదండ్రులు గతించుటచే స్వస్థలమువీడి నెల్లూరుపట్టణముచేరి

సాహెబ్‌గారు సులువుగా నేర్చుకొనిరి. వారి కీర్తి కొట్టు కృష్ణ రాయల భువన విజయమట్లును మఱిపించుచుండెడిది. పలువురు కవి పండితుల గోష్ఠులతో తానును పండితులైనారు. దానికితోడు మద్రాసు విశ్వవిద్యాలయమువారి 'విద్వాన్' పట్టముతో హిందీ—తెనుగు పండితుడుగా ప్రకాశించి 1940 నుండి 49సం॥ వఱకు నంద్యాల హైస్కూలులో తెనుగు పండితుల పదవిని నిర్వహించిరి. తదనంతరము 1949లో కర్నూలు ఉస్మానియా కళాశాలలో హిందీ పండితులైరి.

శ్రీ దావూద్ సాహెబ్‌గారు తమనుగూర్చి యిట్లు చెప్పుకొనిరి.

'కవి యెట్టివాడైనను దగ్గరికి తీసి ప్రోత్సహింతును. కావ్యములు సవరింతును. వారికి బలువిధముగా చక్కిలిగింత పెట్టుదును. బాలకవులను నిరుత్సాహ పఱచుట పాపమను తలంపు నాకు గలదు. నాకు జాతి కుల, పంక్తి, ధర్మ, ధర్మేతరమను సంకుచితము మాత్రములేదు. నేను మాత్రము పదునాఱణాలు ముస్లిము ధర్మావలంబిని. శ్రీ షర్డీసాయిబాబా యందు మానసిక శ్రద్ధగలవాడను. మహాత్ములన్న శ్రద్ధమెండు"

దావూద్‌గారిని కొందరు 'తురక పండితుడని' ఆక్షేపించిరి మఱికొందఱు హేళనగా 'దావూద్‌శాస్త్రి' అని పలికిరి. కొన్నాళ్లు వారి మతస్థులు ఈసడించుకొన్నారు. వీరెవరిని లెక్కకుపెట్టినవారు కాదు. దావూద్ గారిది హిందూ ముస్లిం సామరస్యమునకు పాటుపడిన పవిత్రవంశము. వీరి అగ్రజులు హిందూ, ముస్లిం సామరస్యమునకై బలియైన మహాత్యాగి. వీరు హిందూ ముస్లిం

సంస్కృతులు సంగమించిన ప్రవంతి. అందుకే వీరి హృదయ పీఠాధిష్ఠానదేవత సాయిబాబా యైనాడు. శ్రీ షర్డిసాయిబాబాపై వీరీకృతులు వ్రాసినారు. 1) క్రీడాషర్డీశ్వరము 2) సాయిశతకము 3] సాయిబాబా దండకము 4] శ్రీసాయిబాబా ఆధ్యాత్మికశక్తిని చాటిచెప్పెడి కావ్యము 'సంస్కారప్రణయము'. ఈ కావ్యమందు శ్రీసాయి తన్నుగూర్చి తన భక్తులతో నిట్లనుచున్నాడు.

"కలకాల మార్తసంఘమువెతల్ దుల్పఁగా
మదిలో నమృత కాంక్షఁ బదిలపఱచి,
హృదయాన ననుఁబిల్చు సద సద్వివేకుల
తలఁపుల వలపించు తత్త్వమెఱిగి,
'సాయీ' యనుచుఁ గూర్మి స్వాగతమిడువారి
కష్టముల్ పోకార్చు దృష్టినొసఁగి,
భావి జీవిత చింత భయమందువారికి
చిత్తశాంతిని గూర్చు బత్తి దెలిపి,
తత్త్వ సంబంధ నిత్యనంత ప్రమతికి
గీల కమ్మగు జపమును గీలుకొల్పి
జగము గాపాడు గురుదత్త శక్తిగల్గి
షర్డి నివసింతు నాత్మ శిక్షకుఁడనగుచు"

శ్రీ బావూష్‌గారు కబీరు, రహీమ్, వృంద్ అను మువ్వురు హిందీలో వ్రాసిన కొన్ని 'దోహాలు'లను తెనుగున 'సూఫీసూక్తు' లను పేర గీతపద్యములుగా అనువదించిరి. భగవన్మహిమ ఇట్టిదని వారు నుడివిరి.

నదులెవని నమ్మి జీవనానందమందు
ఋతువు లెవనిదయస్ సఫలత భజించు

యతుల కెవ్వాఁడు శరణమో యతఁడొసంగు
మీకు శుభముల గురునాజ్ఞ మెలగునెడల.

తత్త్వమును గూర్చి యిట్లు చెప్పిరి.

మనసు మధురగ, ద్వారకా మందిరమ్ము
హృదిగఁ, కాయమ్ము కాశిగా నెఱిఁగి మఱియు
ద్వార దశకమ్ముగా దేహతత్త్వ మరసి
తత్త్వ మరయుంగఁదగును నిస్తంద్రభక్తి.

వీరి కావ్యములలో 'దాసీపన్నా' తెలుగు సాహిత్యాకాశమున నొక ఉజ్జ్వల నక్షత్రముగా వెలిగినది. రాజస్థానమున దేశ స్వాతంత్ర్యమును గాపాడుటకు తన సర్వస్వమును ధారపోసిన 'రాణా సంగ్రామ సింహు'ని వంశ చరిత్రమునకు ప్రాముఖ్యతగలదు. సంగ్రామసింహుని పుత్రుడగు ఉదయసింహుని ప్రాణరక్షణార్థము తన పుత్రుని ప్రాణముల బలినొసగిన వీరవనిత ధాత్రీపన్నా చరిత్ర మిందు గైకొనబడినది. ఇందు ద్వాదశ పరిచ్ఛేదములు గలవు. ఒక్కొక్క పరిచ్ఛేదమునకు కావ్యానుగుణముగా ఒక్కొక్క పేరు రమ్యముగా నుంచిరి.

వనవీరుడు ఉదయుని జంపవచ్చినప్పుడు పన్నా తన నిజ సుతునే యతనికి జూపినది. ఆ పసికందు నిద్రలో నన్నియు మఱచియున్నాడు. అతని నిట్లు కవిగారు వర్ణించినారు.

మాతృవాత్సల్య నిర్మల లోహ కవచ ర
క్షాధైర్యమున నిద్ర గనెడువాని,
మాత్సర్య మోహ దుర్మాయాదు లెఱుఁగని
యొక నూత్న జగము నందున్నవాని.

శత్రుమిత్రాది దుష్టప్రేత ఘాతుక
భేదంబెఱుంగని పిన్నవాని.
ఉయ్యాలయో, తల్లియొడియో, గద్దెయటంచు
నెంచి కూర్చుండి హర్షించువాని,
సకల మనముల బ్రేమసస్యములఁబెంచు
జలదరూపుని, కళ్యాణముల కొటారు
బాల చంద్రుని బోలు డింభకుని జంప
విచ్చుగత్తిని నవ్వనవీరు డెత్తె!

'కోకిల గూట దుమికెడు ఘూకమట్లు' అతడు దూకి శిశువును చంపినాడు. పన్నా 'సంగ్రామమున బుత్రశతము కాలునిఁజేర వాపోవు నంధ దంపతులకన్న' మిన్నగ శోకించినది. అది ఆమె హృదయమున యారిపోని శోకాగ్ని. ఆమె కుమారుని సంతోషముగా స్వర్గమున కిట్లు పలికి పంపినది. ఆమె యెంతటి నిశ్చల హృదయురాలో జూడుడు.

అరుగుము స్వర్గభూమి, కటనారయుమీ మన వీరభాగమా
యిరుగున గుల్మవీధి మన యేలిక సొంగుడు గానవచ్చు; నీ
వరిమురి నిచ్చటన్ జరిగినట్టి విషాద చరిత్రఁ దెల్పుమా
పరమ పవిత్ర వీరుడు కృపామతినిన్ గవుగింటఁ జేర్పగన్.

పన్నా దుఃఖమున నున్నదని తెలిసి, ఆమెకప్పుడూరట కల్గించుటకు చంద్రుడు, చంద్రికాతతులు బయలుదేరినవట. ప్రకృతిగూడ ఆమె మనోవికృతినెఱిగి దుఃఖించిన తీరున కవిగారు రమ్యముగా వ్రాసిరి. పన్నాకు ఉదయుని కాపాడుట కష్టమే యైనది. ఆమె అతనిని భిల్లుల రక్షణలోనుంచి పెద్దజేసి సమయము కొఱకు వేచినది. కొన్నినాళ్లకు ఆ వనవీరుని పరి

పాలన అరాచకముగా సాగినది. అతడు భోగలాలసుడైనాడు. జారుడైనాడు. ప్రజలకు వాని పాలనపై వెగటేర్పడినది. ఆ సమయమెఱిగి పన్నా ప్రజలలో విప్లవభావము పురికొల్పినది. అప్పటికి ఉదయుడు పెరిగి పదునారేండ్ల ప్రాయపు వీరుడైనాడు. భిల్లులు, యితర రాజులు అతనికి తోడ్పడిరి. ఆ 'భోగాలమేడలో' నున్న వనవీరునిబట్టి ఉదయుడు చంపబూనినప్పుడు పన్నా అతని వారించినది. దానినిట్లు కవిగారు పోల్చిరి.

> భారత గాథలో హృదయభారము గూర్చిన ద్రోణపుత్రు దు
> ద్వార యశోవిశాలయగు ద్రౌపది ముఃఖక్షమియించినట్లు, హృ
> త్కారుణి కత్వముం దెలుపగా వనవీరు క్షమించి. నేటి మా
> భారత ధాత్రి నేలిన కృపామతి ధాత్రియె ధన్యయియ్యెడన్.

ఈ విధముగా ఈ కమ్మని కావ్యము మన పోతుగడ్డపై ఆవిర్భవించినది. ఇది గడియారమువారి 'శివభారతము'నకు—రాజశేఖర శతావధానిగారి 'రాణాప్రతాప సింహచరిత్ర'కు ఈడైన చిరుచారిత్రాత్మక పద్యకావ్యము. 'కదాసందర్భద్యోతక సహజప్రకృతి వర్ణనలతోబాటు, మహాశిల్పి చెక్కిన కళాఖండముల వలె నున్నవి మనోభావ వర్ణనలు. ఏకిచూపుట పుస్తకము సాంతంగాచదువుచే' అన్నారు శ్రీ మరుపూరు కోదండరామరెడ్డిగారు. వారి మాటలలో అసత్యమేదియులేదు.

తెనుగు కవిత వ్రాయనారంభించి ముప్పదియేండ్లు కావచ్చినను, పరంజ్యోతి స్వరూపుని, పరమసేవానిరతుడగు ప్రవక్తనుద్దేశించి యొక్క పద్యము నెన్నడు రచింపలేకపోయితి ననెడు మనోవేదన దావూద్‌సాహెబ్‌గారికి కలుగకపోలేదు. సమయమాసన్నమైనప్పుడు భగవంతుడే ఆపనిని చేయించును. శ్రీ కే.

గోపాలకృష్ణారావుగారు (నిజాము కళాశాల ఆచార్యులు)కవిగారిని ప్రోత్సహించి, మహమ్మదు ప్రవక్తగారినిగూర్చి శతకమును వ్రాయుమనిరి. అప్పుడు కవిగారిలో మానసిక చైతన్యము గల్గినది. జగత్ప్రవక్తపేరిట 'రసూల్ప్రభు శతకము'రచించి జన్మ సార్థకతను పొందిరి. వారిట్లు ప్రభువును ప్రార్థించిరి.

చింతల తంతుబ్రుంపుము వసింతు భవత్పద పద్మచింత నా
వంతల బొంత సుంత భగవంతుడు లేడు నిరంతరూప! యా
త్మాంతర మన్ కులాయమున నంట దొకింత కృతాంతభీతి న
న్నింతకు దుఃఖకీటకమె హీను నొనర్చునహో రసూల్ప్రభూ!

కవితకు సృష్టిదేవు ననుకంపయె, సత్యము నీమహత్వముం
దవిలిన నాకలమ్ము గుఱితప్పక తావక చర్చఁదెల్పెడున్
భగవత జీవులందఱు సెబాసని మెచ్చి పఠింప రక్తి హృ
త్ప్రవిమల ముక్తిగొను బాటను దెల్పగదే రసూల్ప్రభూ!

వీరు హిందీ పండితులగుటచే కొన్ని హిందీ అనువాదము లనుకూడ తెనుగున గావించిరి. హిందీ కవి జయశంకర్ ప్రసాద్ గారి 'ఆన్సూ' కావ్యమును 'అశ్రుమాల'గా అనువదించి ముద్రించిరి. హిందీలోని 'మిలన్'ను 'ఆనందకుమార' యను పేర అనువదించిరి.

రసూల్ప్రభు శతకము తరువాత 1) అల్లా మాలిక్ శతకము 2) సఖుడా (శతకము) 3) నాగూర్ ఖాదర్వలీగారిచరిత్ర 4) ఆజాద్ చరిత్ర 5) అబ్దుల్ఖాదర్ జీలాని. గౌసుల్ ఆజమ్ దస్తగిరి గారి దివ్యచరిత్ర 6) చంద్రవదన మోహియార్ ఖండ కావ్యము (కదిరి సమాధిగాథ) మున్నగు ఇస్లాం మత ప్రబోధాత్మక రచనలను గావించిరి. ఇవి అముద్రితములుగానే నిలిచినవి.

ఇవియేగాక 'అభినవ తిక్కన కవితాసమీక్ష' — 'ఖండకృతులు'— ఆదర్శము(నవల) సాయిబాబాచరిత్ర(కావ్యము) మున్నగునవికూడ అముద్రితములు.

వీరు మంచి వక్తలు. ఉపన్యాసములలో హాస్యమును మేళవించి శ్రోతలను కడుపుబ్బ నవ్వింతురు. వీరు గ్రాంథికభాషా ప్రియులు. సరళహృదయులు. నిరాడంబరులు. వీరికి నలుగురు కూతురులు. 6గురు కుమారులు కలరు. ప్రస్తుతమువీరు కర్నూలు ఉస్మానియా కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా నున్నారు.

హిందూ మహమ్మదీయ సఖ్యతకు నిలయమైన భారత భూమిలో మతసామరస్యమును చాటిచెప్పు యిట్టి కవీశ్వరు లుద్భవించుట మన పుణ్యవిశేషము. అందులో రాయలసీమ అభాగ్యం ప్రాప్తించుట సుకృతము. కవిగారికి ఈశ్వరు డాయురారోగ్య భాగ్యంబుల నిచ్చుగాక! శుభమస్తు.

"ఈశ్వర అలా తేరేనామ్, సబ్‌కో సన్మతి దే భగవాన్".



## డాక్టర్ గుంటుపల్లి రాధాకృష్ణమూర్తి

జననము:— 25—8—1930

తండ్రి:— శ్రీ గుంటుపల్లి శ్రీనివాసరావు

స్వస్థలము:— కర్నూలు జిల్లా – బనగానపల్లె తా॥ నందవరం.

మతము, కులము:— హిందూ – బ్రాహ్మణ – నందవరీకులు.

నేటి ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక చదువరులకు శ్రీ గుంటుపల్లి రాధాకృష్ణమూర్తిగారి పేరు సుపరిచయమే. వారి

'వైద్యవిజ్ఞానం' శీర్షిక జనరంజకంగా, బహుజనుల కుపయోగ ముగా నిర్వహింప బడుచున్నది. అనంతపురం పట్టణములో వీరు సుప్రసిద్ధ నేత్రవైద్యులుగా వాసికెక్కియున్నారు. అటు వృత్తి రీత్యా వారు డాక్టర్లు. ఇటు సాహిత్యంలో 'డాక్టరేట్' బిరుదును పొందదగిన సమర్థులు. విజ్ఞానవంతులు. నేత్ర శాస్త్రాచార్యులు. పేదల పాలిటి కొంగుబంగారము. నిర్మలహృదయులు. నిరాడంబరులు సాహిత్యప్రియులతో చెలిమి నాకాంక్షించు తత్త్వమువారిది.

వీరి తండ్రిగారు కవులు. వారు 'రుక్మిణీకల్యాణము'- 'జానకీ పరిణయ' మను కావ్యములను వ్రాసిరి. శ్రీ రాధాకృష్ణమూర్తిగారు తమ అన్నగారైన శ్రీ గుంటుపల్లి శ్రీరామమూర్తిగారివద్దనే పెరిగి పెద్దవారై విద్యాబుద్ధులు నేర్చుకొనిరి. మద్రాసు పచ్చయప్ప కళాశాలలో B. Sc., డిగ్రీ 1949లో కవిగారు పొందిరి. 1954లో మద్రాసు వైద్యకళాశాలలో ఎం. బి. బి. యస్., డిగ్రీని, 1956లో నేత్రవైద్య డిప్లమాను పొందిరి.

తరువాత సివిల్ అసిస్టెంట్ సర్జనుగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ వైద్యశాఖలో చేరిరి. నేత్ర వైద్యములో ఉన్నతోన్నతమైన ఎం. ఎస్. డిగ్రీని 1961లో చేపట్టిరి. కర్నూలు, వరంగల్ వైద్యకళాశాలలో సహాయనేత్ర శాస్త్రాచార్యులు (అసిస్టెంట్ ప్రొఫెసర్ ఆఫ్ ఆప్తాల్మాలజీ)గా పని చేసిరి. 1968లో వీరి పరిశోధనా పత్రాలకు గుర్తింపుగా 'అంతర్జాతీయ శస్త్రవైద్యుల కళాశాల' చికాగో (అమెరికా)వారు రాధాకృష్ణమూర్తి గారిని సభ్యులుగా ఎన్నుకొని డిగ్రీనిచ్చి సత్కరించిరి.

1965 ఆగస్టు 15వ తేదీనాడు అనంతపురం ప్రభుత్వ ఆస్పత్రికి నేత్రవైద్యులుగా నియమింపబడిరి. తరువాత వచ్చిన

ప్రభుత్వ వుత్తరువు ననుసరించి వారు స్వతంత్రముగా ప్రాక్టీసు చేయదలచి, ప్రభుత్వోద్యోగమునకు ఉద్వాసన నిచ్చిరి. అప్పటి నుండి యిప్పటివరకు వీరు అనంతపురము కోర్టురోడ్డులో స్వతంత్ర కంటివైద్య ఆస్పత్రిని స్థాపించి పేరు ప్రఖ్యాతులు పొందిరి.

వైద్యమునందేకాక రచనావ్యాసంగములోను రాధాకృష్ణ మూర్తిగారు ఆరితేరినవారు. చిన్నతనమునుండి వీరికి తెనుగు భాష యందు మక్కువ మెండు. 1945లో వీరు మద్రాసునందు యస్. యస్. యల్. సి. చదువుచున్నప్పుడే వీరి తెనుగుపండి తులు శ్రీ గరిమెళ్ల సత్యగోదావరిశర్మగారు తరగతిలోని విద్యార్థు లకు ఛందస్సును బోధించుచు, ప్రతిపిల్లవానిని ఒక పద్యము వ్రాసుకొని రావలసినదిగా ఆజ్ఞాపించిరి. మరుసటి రోజే రాధాకృష్ణ మూర్తిగారు ఉపాధ్యాయులవారికి ఒక పద్యమును వ్రాసుకొనివచ్చి చూపిరి. తెనుగు పండితులవారు మెచ్చుకొని 'నీకు తెనుగు సాహి త్యములో మంచి భవిష్యత్తు గలదు' అని ఆశీర్వదించిరి. ఆనాటి వారి ఆశీర్వాద ఫలితంగానే ఈనాడొక గొప్ప రచయితగా వెలుగు చున్నారు శ్రీ గుంటుపల్లివారు. 'సుదినం' వీరి తొలి రచన. 1946లో శ్రీ దుర్గాబాయిగారి 'ఆంధ్రమహిళ' మాసపత్రికలో అలంకరించినప్పటినుండి వారి రచనాజీవితం సుదినంగా పరిఢవిల్లి నది. తరువాత ఆంధ్రమహిళ - చిత్రగుప్త — నవజీవన - ఆనంద వాణి - జయశ్రీ - కిన్నెర - ఆంధ్రప్రభ మున్నగు సుప్రసిద్ధ పత్రి కలలో కథానికలు, వ్యాసాలు, నాటికలు, పద్యాలు, గేయాలు ధారావాహినిగా ప్రచురింపబడినవి వీరు శతాధిక కథలనే రచిం చిరి. అందులో ప్రజామోదము పొందినవి. 1) కుబేరపుష్పకము

2) మనసు మలుపుల్లో 3) లాటరీచీటి 4) షష్టాష్టకం 5) దోమ తెర, తగాదా మొదలగునవి.

నవలారచనలో కూడా గుంటుపల్లి వారు సిద్ధహస్తులు. 1)గెలుపు 2) ప్రకాశము-ప్రేమ 3) చక్కనిచుక్కలు పత్రికలలో ధారావాహికగ ప్రచురింపబడిన నవలలు. వీరి 'ఓట్లవేట' నాటకము అనంతపురము లలితకళా పరిషత్తువారిచే అనేక పర్యాయములు ప్రదర్శింపబడి, హైదరాబాదు రవీంద్రభారతిలో ప్రదర్శింపబడి మెప్పులు పొందినది. 'టోకరా' - 'ప్రేయసి' - 'వన్‌ట్రూత్' మొదలగునవి వీరి కలమునుండి వెలువడిన ఇతర నాటికలు. ఇటీవలనే ఆకాశవాణిలో వీరి 'మరో జవహర్'అనే నాటిక ప్రసారమైనది.

1) చందమామయాత్ర 2) హాస్యకుసుమాలు 3) హక్కులు—విధులు 4) విజ్ఞాన విశారదులు (5 భాగములు) 5)కళ్లను కాపాడుకోండి మున్నగునవి వీరి ముద్రిత పుస్తకములు. వీరి రచనలకు భారత ప్రభుత్వ బహుమతులుకూడా లభించినవి. 1956లో 'ఆరోగ్యమే మహాభాగ్యము', 1957లో 'సంఘజీవనము', '1961లో 'జ్ఞానపంచమి' అనే వైద్యగ్రంథాలకు భారత ప్రభుత్వ బహుమతులు లభించినవి. వరుసగా మూడు సంవత్సరాలు భారత ప్రభుత్వ బహుమతి పొందుట వారికిగల ఘనతకు తార్కాణము. 1958లో ఆంధ్రప్రదేశ ప్రభుత్వ బహుమతి వీరి 'విజ్ఞానం' అనబడు పిల్లల పుస్తకమునకు లభించినది. 1964 లో నెల్లూరు పౌరులు జరిపిన 'కవికోకిల దువ్వూరి రామిరెడ్డి వర్ధంతి' సందర్భముగా శాస్త్రరచన బహుమతి వీరి 'వైద్యవిజ్ఞానము'నకు దక్కినది.

1960లో ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక దీపావళి సంచికలో 'తెలుగు కలాలు' శీర్షికలో రాధాకృష్ణమూర్తిగారు తెలుగు పాఠకులకు పరిచయము జేయబడిరి. సంపాదకులు రచయితను గూర్చి యిట్లు చెప్పిరి. 'సులువైన భాషలో బరువైన విషయాలను రచించగలగడం వీరి ప్రత్యేకత'. ఈవిషయమును పాఠకులు ప్రస్తుతము ఆంధ్రప్రభ సచిత్రవారపత్రికలో ప్రచురింపబడుతున్న 'వైద్యవిజ్ఞానం' వ్యాసములు చదివి తెలుసుకొనవచ్చును.

సిస్టర్ సుమతి - అన్వేషణ - నవలలు, ప్రయాణం—స్వాతంత్ర్య సమరము - సర్వోదయం - కథాసాహిత్యము మొదలైన ఇతర గ్రంథాలు అచ్చుకు వేచియున్నవి. 'గుంటుపల్లి సూక్తి గురుడ వినర' అనే మకుటంతో వీరు 200 పద్యములకుపైగా రచించిరి. వచన కవితలు పెక్కులు అముద్రితములుగా నున్నవి.

ఒకవైపు మానవకోటికి దృష్టిజ్ఞానమును ప్రసాదించుచు, మరొకవైపు సాహితీ విజ్ఞానవేత్తలకు, పామరులకు మనోజ్ఞానము నిచ్చువైద్యవిజ్ఞాన గ్రంథములను, సాహితీగ్రంథములను రచించి ధన్యతనుపొందినవారు శ్రీ గుంటుపల్లివారు. వీరు అనంతపురంలోని రోటరీక్లబ్‌కు అధ్యక్షులుగానుండి మానవ సేవాకార్యములను నిర్వహించుటగూడా ఒక విశేషగుణము. వీరికి భగవంతుడు ఆయురారోగ్య భాగ్యంబులనిచ్చి కాపాడుగాత !



అభినవ పోతనామాత్య – కవికులాలంకార

## శ్రీ వాడేల వేంకట శేషగిరిరావు

జననము: — 14—10—1905

తల్లి: – శ్రీమతి వాడేల వెంకట లక్ష్మమ్మ

తండ్రి: — శ్రీ వాడేల వెంకట్రామయ్య

స్వస్థలము — రావిపాడు – కంభంతా॥ కర్నూలు జిల్లా.

మతము, కులము:— హిందూ – నియోగి బ్రాహ్మణ – కౌండిన్యగోత్రులు.

భక్త్యావేశము ప్రోత్సహింప స్థిరుడై బ్రాహ్మీమహాదేవియే
సూక్త్యంతర్గత భావగుంభిత పదస్తోమంబునం దీర్చుచో
ముక్త్యావేశమునన్ లిఖించు ఘనుడా పోతన్నతో దీటుగా
రక్త్యానంద మెఱుంగనట్టి జడుడా వ్రాయున్ ప్రబంధంబునున్,

వాని పదరేణువుల బోలలేని నేను
భాగవత కావ్యరచనకై పాటుపడుట
దైవ నిర్ణయమే సూవె తలచి తలచి
వ్రాసితిని తోచినంత శ్రీవరుని కరుణ.

శ్రీ వాడేల వేంకట శేషగిరిరావు గారొక సాహసకృత్యమును భగవంతుని కృపతో సాగించిరి. భవబంధ విమోచనకొరకై పోతన వ్రాసిన ఆంధ్రమహాభాగవత దశమస్కంద యితివృత్తము నాధారముగా జేసుకొని వీరు 'శ్రీ కృష్ణాభ్యుదయము' ను రచించి వాసికెక్కిరి.

ఈ కార్యమును క్రితమునందు శ్రీ జనమంచి శేషాద్రిశర్మ గారు గావించి ధన్యులైరి. వారి కావ్యమునకు 'తాండవకృష్ణ భాగవతము' అని పేరిడిరి. వారు సహితము పోతనభాగవత దశమ స్కందమునే మూలముగా గొనిరి. అటే శ్రీపాదకృష్ణమూర్తి

శాస్త్రిగారు కూడ సంస్కృత వ్యాస భాగవతమును ఆమూలాగ్ర ముగా ఆంధ్రీకరించి కృతార్థులైరి. అట్టి విద్వత్కవులచే శ్రీ వాడేలవారి శ్రీకృష్ణాభ్యుదయము ప్రశంసలను పొందినది. శ్రీ వాడేలవారు తొలుత 'విజయభారతి' అను యితివృత్తమును వ్రాయ పూనుకొని అందు శ్రీకృష్ణలీలలు వర్ణించు నుత్సాహముతో ధారగా కొన్ని పద్యములు వ్రాసిరి. తదుపరి వారికి శ్రీకృష్ణుని కథనే ప్రత్యేకముగా వ్రాయు సంకల్పమును భగవంతుడు కల్గించెను. ఆ కార్యమును భగవంతుడతనితో చేయించెను, ఆ దైవనిర్ణయముం డుటవలననే రాయలసీమయందు అభినవ పోతనామాత్యుడుగా వెలిగినారు శ్రీ వాడేల వేంకట శేషగిరిరావుగారు.

కావ్యము ముగించి యేడాదియైనను ముద్రణకు ధనములేక మౌనముగానున్న తరుణములో భగవంతుడే కవిగారికి త్రోవ చూపించినాడు. ఆంగ్లములోగల 'క్రాసువర్డ్ పజిల్' నందు కవి గారు పాల్గొని ద్రవ్యమును సంపాదించుకొనిరి. ఆ ఆకస్మిక ధన లాభముతో కావ్యముద్రణ చక్కగా జరిగినది. ఇందు కవిగారు తమ వంశక్రమమును. కుటుంబచరిత్రను విపులముగా పద్య రూప మున జేర్చిరి. ఈ కవిగారి పూర్వీకులు నిరతాన్న దాతలు. సద్గుణసంపన్నులు.

'శ్రీ కృష్ణాభ్యుదయము'నందు వీరి రచన సరళముగా సాగి నది. పామరులకొకపరి చదివి విన్పించిన సులువుగా అర్థము కాగలదు. పాండిత్య ప్రకర్షకై సుదీర్ఘ సమాసములుపయోగించు నలవాటు వీరికి లేదు. ఎన్నో లోకోక్తులను, వ్యావహారిక భాషా పదములను తమ రచనలో ప్రవేశపెట్టిరి. ఇందక్కడక్కడ నాటకధోరణి కనిపించును. కొన్నియెడల భాగవతము ననుసరింపక

స్వతంత్రించి రచన సాగించిరి. వాదేలవారు పాత్రల మనస్తత్వములను గొప్పగా చిత్రీకరించిరి.

ఆరు కాన్పులన్యాయముగా కంసుని కత్తికి బలిసేసి. తుద కేడవగర్భమును ధరించిన దేవకి మనక్షోభము నిట్లు కవిగారు వర్ణించిరి.

ఉ॥ "ఇప్పటి కారుమార్లు సహియించితి; లోకమునందు నెవ్వరే
నెప్పుడుఁ జెందియుండని, భరింపని యాతన; గన్నవారినే
యప్పన జేసినాను మనసార నరాంతకు కత్తివాతకున్
జెప్పన దేమి? భూతమను, జెడ్డపిశాచిని నేను మాధవా!

శా॥ దేవా! యింక భరింపలే నుబుసు; నీదే భారమీకాన్పు నే
త్రోవన్ దీర్చెదో? యేదియెట్లయిన, నాదుర్మార్గుఁడే వచ్చి నా
జీవంబుల్ బలివెట్టనెంచిసనరే; చేజేఁత నాపాప న
య్యో వారాశిని 'త్రోయ'త్రోయ' నని యెంతో ఖిన్నయై యేడ్చుచున్!

ఆయా సందర్భములందు కవిగారు చదువరులకంట కన్నీ రొలికించిరి. కొన్నియెడల నవ్వుపుట్టించిరి. గోపికల తన్మయత్వ మెట్లున్నదో చూడుడు.

సీ. పరిగంచు చీరను సవరించు కొనులేమ
మైజారు పయ్యెద మఱచిపోయె;
బిగుతు కంచుకమును బిగియించు కొనుభామ
ముడివేసి కొనుమాట విడిచిచనియె;
నంగరాగము దిద్దు మంగళాంగి చెలంగి
పరిపూర్తిసేయుగా నరయుదయ్యె!

భూషణములదాల్చు పొన్నికొమ్మ యొకర్తు
తల్లక్రిందులుగ వాని దాల్ప దొడగె;
గనులగాటుక దిద్దెడు కనకగాత్రి
నగములోనిల్పి పయనమై సాగిపోయె;
గట్టికట్టని చీరతోఁ గదలె నొకతె
కుతుకమున రెచ్చి యన్య సంగతులు మఱచి.

ఉ॥ తల్లులు దండ్రులున్ సఖులు దత్పతులాప్తులు. నన్నదమ్ములున్
బెల్లుగ నార్చుచున్న వినిపింపనియట్లు తవేకచిత్తలై
వల్లవ కామినీమణులు పర్విడి రొక్కటి భావదీప్తిచే
నుల్లము లెంతయున్ మెఱసి యూరక శ్రీహరి జూచుచుండగన్.

గోపికలు గోపాలకృష్ణుని రాసక్రీడకిట్లు ఆహ్వానించుచున్నారు.

సీ. బిడియమా ? కౌగిటబిగియించి, వగ్రదుంచి
సొగసించి కరుణింప సుందరాంగ
తలవంపులా? ముద్దులొలికించి వలపించి
లలిముంచి పరికింప లలితగాత్ర !
సరిపోలమా ? నిన్ను మరుబంతులాడించి
మురిపించి. మెఱపించ మోహనాంగ !
పనికిరామా? సేవలొనరించి తనయించి
మనసుదీరి సుఖించ మదనమూర్తి !

ఇంతబలవంతమేలనో? కంతుకేళి
యంతుభాతరలాడి మెప్పింతువనుచు
వలచిపిలుచుటచేన? గోపాలబాల!
చాలు జాలింక బిగువులు జక్కనయ్య !

ఇందు రుక్మిణీకళ్యాణఘట్టమునుగూడ అందముగా జొప్పించిరి. రుక్మిణీ తన లేఖలో శ్రీకృష్ణునికిట్లు నివేదించుకొన్నది.

శా॥ నేనే నీసతి, నీవె నాపతివి, నింతే యెన్ని జన్మంబులం
దైనం బాయని సత్యబంధమిది నాథా ! సూక్ష్మమూహించి నీ
చానన్ నన్నుఁ బరిగ్రహింపుము దురాశావేశు లుర్వీశ్వరుల్
గ్లానిం బొందెదునట్లు రాక్షసవిధిన్ గైకొమ్ము నిక్కమ్ముగన్.

క॥ రాక్షస విధి గైకొనుటలు
సుక్షత్రియ వంశకీర్తి శోభన మౌటన్
రక్షా దక్షుడవై నీ
పక్షమునం జేర్చుకొమ్ము పావనమూర్తి!

ఇట్లే శ్రీ కృష్ణాభ్యుదయ పూర్వభాగమును రుక్మిణీకృష్ణు కల్యాణముతో ముగించిరి. ఇందు పోతన భాగవతమున కానరాని కంస, కాలయవనుల జన్మవృత్తాంతములు జేర్చబడినవి. కొన్ని పద్యములు చదువుచున్నప్పుడు పోతన జ్ఞప్తికి వచ్చును. అంత మాత్రమున కవిపోతనను పూర్తిగా అనుసరించి యున్నారనుటకు వీలులేదు. గ్రంథము పూర్తిగా జదివిన వారికీవిషయము స్పష్టము కాగలదు. శ్రీకృష్ణ చరిత్రను కవిగారు గానముచేసి ధన్యులైరి. అది వారి పూర్వజన్మ పుణ్య విశేషము.

శ్రీ వాడేల వేంకటశేషగిరిరావు గారు కవులేగాక సిద్ధాంతులు కూడ. వీరికి భగవంతుని కృపవలననే జ్యోతిషమునందనుభవము గలిగినది. వీరి కక్షరాభ్యాసము చేసిన గురువులు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు. ఉన్నత విద్యాభ్యాసమంతయు హైదరాబాదు నందలి వారి అక్క, బావగార్లయింట జరిపిరి. వీరికి ఇంగ్లీషునందు యింటర్మీడియేట్‌వరకు ప్రవేశము కలదు. వీరు 'Paradise' అను ఒక పొత్తమును ఆంగ్లమున వ్రాసిరి.

ఈకవి శ్రీశైలమల్లికార్జునిపై నక్షత్రమాల -స్తోత్రమాల, స్తోత్ర కదంబము, శ్రీశైల పంచాంగము, శ్రీశైలక్షేత్రమహిమ, శ్రీశైలేశ చరితము మున్నగునవి రచించిరి. ఆ పుస్తకములపై వచ్చెడి సొమ్మును దేవాలయమునకే సమర్పించిరి. శ్రీశైలేశ చరితమునందు మల్లికార్జునస్వామి చరిత్రను గద్యమున వ్రాయుచు అటనట కొన్ని సందర్భములందు ముత్యములవంటి పద్యములను చేర్చిరి. మచ్చునకీ పద్యము చూడుడు.

సీ. పండిత ప్రవరులు పాతాళమున నుండ
మిడిమిడి చదువరి మేడలెక్క
ముక్తుడౌ విజ్ఞాని రిక్తుడై పడియుండ
మెట్టవేదాంతి తామింటి కెగయు
సత్యమేమూలనో చచ్చినట్లొదుగుచో
కల్ల లోకమునెల్ల కలియబెట్టు
ఋజువర్తనులమాట రిత్తయై బొత్తిల
కూలంకషనిధాటి కోటగట్టు

గీ॥ ప్రకృతి తలదాచు కొనచోటు బడయకున్న
వికృతి విజయధ్వజంబు స్థాపింపగలుగు
నేమిలీలలో యివి నీకె యెఱుకగాని
తలప దుస్సాధ్యమూహింప తరముగాదు

వీరి రచనలో సీసపద్యములే మిక్కిలి రసవత్తరముగా సాగినవి. సీసపద్య రచనలో వీరిది అందవేసినచేయి.

వీరికి నంద్యాల, కర్నూలు, నెల్లూరులందు ఘనముగా సన్మానములు జరిగినవి. పెక్కు బిరుదులు లభించినవి. 2-11-60 వ తేది కర్నూలు నగరమున సంస్కృత విద్యాదాన సమాజంవారు

కలెక్టరుగారి సమక్షమున 'కవికులాలంకార' బిరుదముతో సన్మానించిరి. వీరి అముద్రిత రచనలు పెక్కులున్నవి. 1) శ్రీకృష్ణాభ్యుదయము (ఉత్తరభాగము—4200 పద్యములు) 2) గీతభాగవతము (2000 గీతములు) 3) రుక్మిణీకల్యాణము 4)సత్యభామా పరిణయము 5) కట్నపిశాచి 6) శ్రీకృష్ణదేవరాయలు 7) లీలా మల్లికార్జునీయము లేక శివలీల మొదలగునవి నాటకములు.

వీరు రావిపాడు గ్రామమున శ్రీలక్ష్మీగణేశ జ్యోతిషాలయమును నడుపుచు, కవిగా, ఆయుర్వేదిక్ డాక్టరుగా ప్రసిద్ధిపొందినారు

———o———




కవిసుధాకర

శ్రీ

## యస్. రాజన్నకవి

జననము :— 1—7—1931

తల్లి:— శ్రీమతి సాలాంబ

తండ్రి:— శ్రీ చిన్న జమాలప్ప

జన్మస్థలము :—ప్రొద్దుటూరు కడప జిల్లా.

మతము, కులము :— హిందూ — నాదబ్రాహ్మణ.

సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులవారి శిష్యపరంపరలో శ్రీ రాజన్న ప్రముఖుడు. చిన్నతనమున పెద్దతండ్రికడ సంగీతము నభ్యసించి, తదుపరి శ్రీ పుట్టపర్తి వారికడ సాహి

త్యమును, సంగీతము నేర్చిరి. చక్కని కంఠముకల్గి దానికితోడు తెనుగు సాహిత్యము నందభినివేశము పొందుట సువర్ణమునకు పరిమళమబ్బి నట్లయినది. వారికి గల మృదుమధుర కంఠమునకు, ఉపన్యాస చతురతకు తెనుగుదేశము నీరాజనము పట్టినది. ప్రస్తుతము సాహిత్య క్షేత్రమున ఎక్కువగా పారాడు రాయలసీమ యువకవి మన రాజన్న. "కాంత పదావళి, కమనీయ శైలి, రాజన్న కవితలోని రమ్యగుణాలు. కవిగా, గాయకుడుగా, రంగస్థల నటుడుగా, రాయలసీమలో పేరుమోసిన అభినవ కవితా నీరాజనం—ఈ కవిరాజ నీరాజనం" అన్నారు శ్రీ సి.నారాయణరెడ్డిగారు రాజన్నగారు రంగస్థలముపై శ్రీకృష్ణ, నక్షత్రక, చంద్రి, గయ, భవాని మొదలగు పాత్రలను ధరించిననటశేఖరులు. ఆకాశవాణిలో తమ మధురగానమును విన్పించు మధుర గాయకులు. హరికథలు చెప్పుటయందుకూడ ప్రవేశము గలవారు. వీరి 'కవిరాజ నీరాజనము'ను గూర్చి శ్రీ దివాకర్ల వేంకటావధానిగారిట్లు నుడివిరి.

"ఈ గ్రంథమున కవిచంద్రులనుగూర్చి రచింపబడిన పద్యములు లలితసుందర పదప్రయోగ శోభితములు. గంభీర భావ గర్భితములునై చదివినకొలది చదువవలెనను నుత్కంఠనావహించుచున్నది"

శ్రీ రాజన్నగారికి భగవదనుగ్రహము వలనను, గురు శుశ్రూషాప్రభావము వలనను, సరస హృదయమైన కవితాధార యలవడినది. వీరింకను రసబంధురములైన కృతులు రచించి యాంధ్రిభాషాయోష కభినవాలంకృతులు సమకూర్తురుగాక !"

కవిరాజ నీరాజనమునందు కాళిదాసు, పోతన్నల కిట్లు రాజన్నగారు నీరాజన పమర్పించిరి.

మ. అతడే ! మంజుల సాహితీ సురభిళోద్యానంబులో శారదా
సతి కంఠమ్మున నవ్యనాటక పరిష్కారంబులన్ దీర్చి–పం
డితులెల్లన్ బులకించిపోవ తన పాండిత్యమ్ము పండించి, న
త్కృతులన్ జేసిన కాళిదాసకవి సత్కీర్తిన్ ప్రశంసించెదన్.

సీ. శారద యామినీ జైవాతృక స్నిగ్ధ
శిశిర చంద్రికలు వర్షించినట్లు,
మధుమాస పరిపూర్ణ మాకంద మంజరీ
హారి గంధము ఘుమ్ముఘుమ్మనియట్లు,
తరుణీ జపారుణాధర నవ్యపీయూష
ములను కోకొల్లగాఁజిలికినట్లు
తుంగభద్రా సరిత్తోయ మృదంగ భం
గిమలెల్ల తరచుఁబల్కించినట్లు
పదములా ! భావమా ! పద్యబంధమా ! మ
హాకవీ ; రసరాజ్యమూర్ధాభిషిక్త !
ఏ తెలుంగున నిన్ను వర్ణింతునయ్య!
మాధవాధీన ! పోతనామాత్య ! సుకవి ॥

రాజన్నకవిగారు రామరాజభూషణుని వసుచరిత్రను ప్రత్యేకాభినివేశముతో అధ్యయనం చేసినారు. రామరాజ భూషణుడందు సంగీత సాహిత్యములను సమముగా మేళవించినాడు. ప్రబంధయుగములో ఈకృషి గావించినవారు మరొకరులేరు. అట్లే వసుచరిత్రలోని ఆసాహిత్య సౌరభమును, సంగీతమాధురిని, అందలి మనోహర శ్లేషవైచిత్రిని మనకుపన్యాసముల ద్వారా అందించిన ఘటికుడు రాయలసీమలో రాజన్న ఒక్కడేయని చెప్పవచ్చును. వీరు వసుచరిత్ర 'కవితావిపంచి'ని మ్రోయించిన వైణికులు

వీరు 'అవతారమూర్తులు' అను కావ్యమునందు గౌతమ బుద్ధునినిట్లు వర్ణించిరి.

మ. అరిషడ్వర్గమడంచి, యైహిక సుఖ వ్యామోహముంద్రుంచి, నీ
కరుణాదృక్కుల సర్వ భూవలయు శోకమ్మున్ నిభాళించి, యీ
ధర సర్వస్వము రోసిపోయితివి సత్యజ్యోతివై — బౌద్ధమే
పరమార్ధంబని చాటి చెప్పితివి దేవా। బౌద్ధ ధర్మాకృతీ॥

ఉ. నిద్దురపోవు ముగ్ధ తరుణీ వదనమ్మున కాంతివల్లి, నీ
ముద్దుల బిడ్డ రాహులుని పున్నమి నవ్వుల పాలవెల్లి, నీ
యద్దమువంటి డెందమున హత్తుకొనన్ గదలంగలేక నీ
వద్దమరేయి యేగతి ప్రయాణము చేసితివోయి గౌతమా!

భారతదేశమునకు చైనాతో యుద్ధము వాటిల్లిన తరుణాన మన యువక కవి రక్తము ఉక్రోషముతో పొంగినది. దేశభక్తి ప్రబోధితుడై భారతీయులను తన శంఖారావముతో నిట్లు మేల్కొలిపినాడు.

గీ. న్యాయహీన చైనారాజకీయ విదులు
సామ నన్మార్గములతోడ చక్కబడరు;
దండనమ్మొక్కటే యిక దగినతెరువు;
వీర చందనమునుదాల్చి వెడలుడనికి.

సీ. నాఁడెన్నడో కాదు నేడిదే కనుడంచు
బాలచంద్రులు నేడు ప్రబల వలయు,
నాడెన్నడోకాదు నేడు కన్గొను డంచు
తాండ్రపాపయ్యలు తరలవలయు,
నాడెన్నడోకాదు నేడిదే కనుడంచు
మహరాష్ట్ర వీరులు మసలవలయు,
నాడెన్నడోకాదు నేడు కనొను డంచు

రాణాప్రతాపులు రగుల వలయుః
నాటి యెందరో వీరులు మేటిమగలు
భారతావని బ్రదికియున్నారు నేడు
నాడు నేడును నేడైయె వాడినూవ
భరత మాతను నేడు కాపాడవలయు !!

1) కవిరాజనీరాజనము 2) వ్యాససౌరభము 3) ఖండ కావ్య సంపుటి 4) అవతారమూర్తులు 5) త్యాగరాజీయము 6) తిమ్మన కమ్మని రచన. ఇవి రాజన్నగారి ముద్రితకృతులు.

ప్రస్తుతము వీరు రివిన్యూ డిపార్టుమెంటులో రివిన్యూ ఇన్‌స్పెక్టరుగా పనిచేయుచున్నను, సారస్వత సేవమ ధ్యేయముగా నుంచుకొని తీరికవేళలలో పలుతావులకు వెళ్లి సారస్వత సభలలో ఉపన్యసించుచు, తమకుగల కవిత్వ ప్రతిభను, గానకౌశలమును యినుమడింప జేసుకొనుచుండుట ముదావహమైన విషయము. ఈ ఇరువదవ శతాబ్దపు నవయువకులకు సాహిత్యాభిరుచి ఏర్పడుట ఒక వినూత్న విషయము. అందులో ప్రభుత్వోద్యోగము చేయుచున్న వారికిట్టి విశేషాంశములపై శ్రద్ధజూపుటకు ఓర్పుండదు. చేయుచున్న ఉద్యోగమునకు, తన అభిరుచికి పొందికఉండదు. అవి హస్తిమశకాంతరములు. ఇట్టియెడ రాజన్నగారి ఓర్పు, సాహిత్యాభిమానములు అభినందనీయములు.

కడపజిల్లా పొద్దుటూరు అగ్రశ్రేణి కవిపుంగవులకు నిలయము. అదొక సాహితీ కొలువుకూటము. అందు పచ్చని తోరణమై భాసించు చుండుట రాజన్నలోగల విశేషము. వీరి కృషి మూడు పూవులారు కాయలుగా వర్ధిల్లుగాక !

---



లలితకళానిధి

# శ్రీ మైనంపాటి వేంకట సుబ్రహ్మణ్యము

జననము :– 25–8–1926

తల్లి :– శ్రీమతి అన్నపూర్ణమ్మ

తండ్రి:– శ్రీ వేంకటసుబ్రహ్మణ్యము (సుబ్బయ్య)

జన్మస్థలము :– బుడుగుంటపల్లె. రాజంపేట తా॥ (కడప జిల్లా.)

మతము, కులము:– హిందూ— బ్రాహ్మణ-ఆర్వేల నియోగులు.

మైనంపాటివారి వంశస్థులు సంగీత సాహిత్య నాట్యాభినయము లందభినివేశముకలిగి, వాటిని దైవదత్తము లొనర్చిన మహనీయులు. వీరు జ్యోతిషము, గణితములందును, వ్యవహార దక్షతలోను ప్రసిద్ధులు. రామభక్తి, కృష్ణభక్తి మిక్కుటముగా గల్గినవారు. ప్రకాశం జిల్లా మైనంపాడునందలి శ్రీ వేణుగోపాలస్వామి, మైనంపాటి వంశీకులకు కులదైవము. ఆదేవుడు మైనంపాటి వంశీకులచేత అక్కడ వెలసినాడు. వివాహపూర్వము శ్రీ వేణుగోపాలస్వామి సన్నిధిలో మైనంపాటివారు అభినయము చేయు సంప్రదాయ ముండినట్లుగా ఈక్రింది పద్యమువలన తెలియుచున్నది.

" పెండ్లి పేరంటముల మున్ను విధిగ కాళ్ళ
గజ్జె గట్టి సంకీర్తనన్ గాన భావ
బంధురమ్ముగ వేణుగోపాలు నాట
పాటలన్ గొల్తు్ర మైనముపాటివారు–"

ఈ ఆచారము మైనంపాటి వారెల్లరూ విడువక అవలంబించియున్నచో కూచిపూడి వారివలె నాట్యమునకు గొప్ప కీర్తి ప్రతిష్ఠలు దక్కెడివి. వీరిది సంప్రదాయ సిద్ధమైన నాట్యము.

సాహిత్యాభినివేశము గల్గిన మహనీయులు మైనంపాటి వారి వంశములో పెక్కుమందియున్నారు. వారందరూ సంగీత సాహిత్యసేవయే పరమార్థముగా నెఱిగి, పెక్కు హరికథలను, సంకీర్తనలను, భక్తిగేయములను, శతకములను వ్రాసిరి. వారందరూ వాగ్గేయకారులే. అట్టి పుణ్యవంశమున పుట్టినవారే శ్రీమైనంపాటి వేంకట సుబ్రహ్మణ్యముగారు.

స్వగ్రామమున ప్రాథమిక విద్య చదివి, కోడూరు హయ్యర్ ఎలిమెంటరీ పాఠశాలలో 8వ తరగతిని కవిగారు ముగించిరి. తరువాత గ్రామాధికారుల పరీక్షలు ముగించి 1949 వఱకు ఆ ఉద్యోగములను నిర్వహించిరి. శ్రీ లోకన రాఘవయ్య గారికడ సంస్కృతాంధ్రభాష అభ్యసించి మద్రాసు విశ్వవిద్యాలయము వారి 'విద్వాన్' పట్టమునొంది, పండిత శిక్షణ ముగించిరి. కొన్నాళ్ళు చిత్రలేఖనమునందలి Free hand out line & Model drawing, పెయింటింగు హైయరు పరీక్షలందును, డిజైన్ పరీక్షలోను ఉత్తీర్ణతపొంది శిక్షణ ముగించిరి. 1950లో కోడూరు (R. S.) ఉన్నత పాఠశాలలో చిత్రలేఖనోపాధ్యాయుడుగా పని చేసిరి. తరువాత 1958లో ఆంధ్రభాషాధ్యాపకులైరి.

శ్రీ మైనంపాటివారి తొలి ముద్రిత కృతి 'త్రిలింగభారతి' ఈ కావ్యమునందలి ప్రతి పద్యము ఆంధ్రప్రదేశపు చరిత్రాంశమును దెల్పును. దీనిని 'ఆంధ్రుల పురాణము'గా శ్రీ వేదం వేంకట కృష్ణశర్మగారు పేర్కొనిరి. ఆంధ్రుల శిల్పకళనుగూర్చి కవి యిట్లనుచున్నాడు.

అల్లదె కొండకోనల మహాద్భుత శిల్పకళానివేశముల్
కొల్లఁగ నిల్చియున్నవట, కోరికనుంగొను 'మెల్లొరా' గుహ
లెల్లను బౌద్ధచైత్యము లనేకములున్న వఖండ చిత్రముల్
చల్లనితల్లి! పాప్మటుల జాలముగాదు త్రిలింగభారతీ!

ఉర్విని దేవళంబులె మహోన్నతికెక్కెను శిల్పశాలలై
పూర్వము తెల్గుభూధవుల పోషణలోన విశేషభక్తియే
సర్వము చిత్రశిల్పముల సంపదకెల్లను హేతుభూతమౌ
గర్వము తెల్గుజాతికది కారణమౌను త్రిలింగభారతీ!

'త్రిలింగభారతి' తరువాత వీరి ముద్రిత గేయకృతి 'శ్రీ కృష్ణతాండవము-గోపికాలాస్యము. కవిగారు భాగవతమును మథించి కృష్ణతత్త్వము నవగతముచేసుకొని ఆనందోత్సాహముతో ఈ గేయకృతిని వ్రాసినారు. ఆధునిక ఆంధ్రభాషలో గేయ కృతులు కొలదిగానున్నవి. అందులో పుట్టపర్తివారి 'శివతాండవము' ఉజ్జ్వలముగా వెలిగినది. కవిగారు శివతాండవ పఠనాభిలాషు లగుటచే వీరి శ్రీకృష్ణతాండవము ఆ పోకడలోనే సాగినది. కాని వారెన్నో క్రొత్తమార్గములు త్రొక్కినారు. కవిగారికి సంగీత సాహిత్య నాట్యాలంకారాది శాస్త్రపాండిత్యము వంశక్రమముగా సంక్రమించుటచేతనే వారీకృతిని వ్రాయగల్గిరి. లేకున్నచో యిట్టి కావ్యరచన యెల్లరు చేయజాలరు. వారికులదైవము శ్రీవేణుగోపా

లుడే, వారి మనోవేదికపై తాండవనృత్యమాడినాడు. కవిగారు కావ్యారంభమున తమ నమస్సుమములనిట్లు పాఠకుల కర్పించినారు.

భాగవతార్థముల్ మధుర భావములందు దరంగ తాండవో
ద్వేగము గూర్చగా మహిత విష్ణుకథాశయలీల జొక్కు శ్రీ
భాగవతోత్తముండు కవి బమ్మెరపోతన కావ్యగానమి
ట్లీగతి సత్కృతిఁ వెలసె నియ్యది తాండవకృష్ణరూపమై !
ఆ త్రిపురాంతకోద్ధత మహానటనాకృతిలో 'సరస్వతీ
పుత్ర' విచిత్రరీతుల నపూర్వముగాఁ గృతిదీర్చుటన్న నే
మాత్రమొ పూర్వపుణ్యఫల మాధురిగాక; మఱొండుఁగల్గునే ?
మిత్రుల! మోలనుంచితి; క్షమించుచు గావ్యరసమ్ముగ్రోలుడీ!

ఈ గేయకృతిలో తొలుత శ్రీకృష్ణతాండవము, తరువాత గోపికాలాస్యము వర్ణింపబడినది. నాట్యకళలో లాస్యము, తాండవము అను రెండు భేదములున్నవి. తాండవము ఉద్ధృతమైనది. దానిని పురుషులకుద్దేశింపబడినది. లాస్యము సుకుమారమైనది. అది స్త్రీలకుద్దేశింపబడినది. వీటికి అధిదేవతలు శివపార్వతులు. శ్రీకృష్ణుడు బాల్యమున కాళీయుని పడగలపై భరతశాస్త్ర పద్ధతిలో తాండవమాడినాడు. గోపికలు శ్రీకృష్ణునితో రాసక్రీడ సల్పినారు. ఈ సన్నివేశముల నాలంబనముగా చేసికొని 'శ్రీకృష్ణతాండవము, గోపికాలాస్యము'ను సృష్టించినారు కవిగారు. అందలి తీరును కొంత గమనింతము.

అందము — ఆనందము
బృందావనమున — ఏమందము !
ఏమానందము !
ఆ యమునాజలముల ఆ యహిరాట్ఫణముల
తాండవమట !— కృష్ణుని తాండవమట !

లాస్యమ్మట! – గోపిక లాస్యమ్మట !
కొండెపు సిగముడి – నిండగు పింఛము
ముత్తెపు సరములు – గుత్తంపుదాయెతు
లంగగు మురుగులు – బంగరు టందెలు
ముక్కున ముత్తెము – చక్కనిపోగులు
మెళ్ళోదండలు – మొల్లోగజ్జెలు
సొగసులుగుల్కగ – నగవులు నల్లెడు
గోపకిశోరుని – రూపము ముద్దుగఁ
దీర్చినదెవ్వరు ? – కూర్చినదెవ్వరు?
శంభుడో ! మఱి – స్వయంభువుడో నట !
ఔనట! – ఔనట! ఔనట ! ఔనట!

కవిగారి రచనలోని విశేషమునకొకదానిని పరిశీలింతము.

ఆకారమై త్రిగుణ సాకారమైకన. ని
రాకారమైనిలిచి శ్రీకారమై వినని
హుంకారమై కదలి ఝాంకారమై వెలయు
టంకారమై వెడలి ఢంకారమై తెలియు
హంకారమై కలభ ఘీంకారమై యళుల
ఝుంకారమై కేకి క్రేంకారమై సిరుల
ప్రాకారమై కలికి హ్రీకారమై చెలగు
ణాకారమై లలిత క్లీకారమై వెలుగు
అంకారమై రసాలంకారమై పలికి
శంకారమై నిత్యమోంకారమై కులికి
ఆడెనమ్మా ! కృష్ణుడు
పాడెనమ్మా ! విష్ణువు.

ప్రతి పుటలోని విశేషాంశముల కన్నింటికినీ పుట దిగువన
సూచీపట్టికలో వివరములగు అర్థములిచ్చుటచే కవిగారు ప్రయో

గించిన పెక్కు శబ్ద, క్రీడ, భరతనాట్య, సంగీత, శృంగార, అభినయ ఆంగిక విషయములు చదువరులకు తెలియుచున్నది. లేకున్నచో పతితలు. నర్తకులు. సంగీతప్రియులుకూడ చాల యాతనల ననుభవించెడివారు. కావ్యరచనకంటె టిప్పణి రచనకే ఎక్కువకాలము కవిగారికి పట్టినదనుటలో సందేహము లేదు. పద్మశ్రీ వేదాంతం సత్యనారాయణశర్మగారన్నట్లు 'కావ్యటిప్పణములు రెండును 'మణినావలయం, వలయేన మణిః' అన్నట్లు పరస్పర భూషణ భూష్య భావము నొందుచున్నవి. అర్థాలంకారములు, శబ్దాలంకారములు సమముగా నుపయోగింపబడినవి. తేట తెనుగు పదములు కొన్నిచోట్ల- సమాసభూయిష్ట సంస్కృత పదములు కొన్నిచోట్ల రసానుకూలముగా భావానుగుణముగా వాడబడినవి.

వెన్న కడవల వెన్న తిన్నగా గాజేయ
చిన్నికృష్ణుడు వంగి చిటికెలో దా, దాయ
'అమ్మ! చిక్కితి' వంచు నడుగులో నడుగిడుచు
నెమ్మదిన్ జని వెన్కనిక్కు గుబ్బలఁగ్రుచ్చి
'అందుకో, యీముద్ద తొందరేలర?' యంచు
నందిచ్చి పాదువుకొని 'విద్దకమ్మిది' యంచు
నాడినది గోపికా!– మధురముగ పాడినది రాధికా!

ఇట్లనేక శృంగారచేష్టలను గోపికలు బాలకృష్ణునియెడ జూపినారట. చదువరి నొక నిమిషమేనియు వదలనివ్వని గేయ కావ్యమిది. సంగీత నాట్యములు, దెలిసిన పాఠకుడి మనసు చిందులువేయకమానదు. పెక్కు నూత్న విశేషాంశముల నతడు గ్రహించును. కవులు చిత్రకారులగుటచే అటనట చక్కని నాట్య భంగిమలను దెల్పు చిత్రములనుగీచి, ముద్రించి కావ్యమునకు మరొక విశిష్టతను చేకూర్చిరి.

కవిగారు ఈ కృతిని 30–8–1975 వసం॥న కార్వేటి నగరమందలి శ్రీ వేణుగోపాలస్వామివారికి అంకితమొసగి ధన్యులైనారు. ఆనాడు జరిగిన మహాసభలో కవిగారు 'లలితకళానిధి' బిరుదముతో సత్కరింప బడిరి. వీరి పెక్కు కృతులు అముద్రితములుగానే నున్నవి. వీరు నాటకములు. నవలలు, శతకములు, ఖండికలు, అనేకములు వ్రాసియున్నారు. 'బాలమిత్ర' పిల్లల కథల మాసపత్రికలో వీరి 'ఆకులు చెప్పిన అరవై నాలుగు కథలు' కొన్ని ఏండ్లనుండి సీరియల్‌గా ప్రచురింపబడుచుండుట ఒక విశేషము.,

ఇట్టి కవులెందరో రాయలసీమయందు అజ్ఞాతముగా నున్నారు. వారెన్నో విలువైన గ్రంథములను వ్రాసినారు. ముద్రింవ ద్రవ్యసహాయములేక అవి క్రిమికీటకాదులచే నాశనమగుచున్నవి. శ్రీ సుబ్రహ్మణ్యముగారి 'శ్రీకృష్ణ తాండవము— గోపికాలాస్యము' కృతి ఇప్పటికైనను వెలుగును జూచుటకు తోడ్పడిన సాహితీపోషకులకు, ఉదారహృదయులకు ధన్యవాదములు తెలుపవలసినదే. కవిగారిపై శ్రీ వేణుగోపాలస్వామి కృపాకటాక్షములు సర్వదా ప్రసరించుగాక !



సాహిత్య సరస్వతి

## శ్రీ రాచర్ల తిప్పయ్యగుప్త

జననము:— 30—5—1908

తల్లి:— శ్రీమతి తిప్పమాంబ; తండ్రి:— శ్రీ దొణ తిమ్మప్ప

జన్మస్థలము: — బెళుగుప్ప – కల్యాణదుర్గం తా॥ అనంతపురం జిల్లా.

మతము, కులము:— హిందూ – వైశ్య.

శ్రీ రాచర్ల తిప్పయ్యగుప్తగారిది పండితవంశము. వీరి తాత రామప్పగారు ఆంధ్ర గీర్వాణభాషలందు ప్రజ్ఞానిధులు. వారు శ్రవణపేయముగ పురాణపఠనము గావించు నేర్పరులు. తండ్రి దొణ తిమ్మప్ప వేదాంతమందు చక్కని అనుభూతి గలవ్యక్తి, అతడు సారస్వతప్రియుడు, దైవభక్తి పరాయణుడు, సాధు స్వరూపుడు.

శ్రీ గుప్తగారు బళ్లారియందలి శ్రీ యాదాటి నరహరి శాస్త్రిలవారికడ సంస్కృత, వేదాంత విద్యల నభ్యసించిరి. మహా కవులుగ మండల విద్యాశాఖాధికారులుగ అనంతపురంజిల్లాలో ప్రసిద్ధిపొందిన శ్రీ కల్లూరు వేంకటనారాయణరావుగారికడ వీరు లక్ష్యలక్షణగ్రంథముల బెక్కింటి నభ్యసించిరి. వారు తిప్పయ్య గుప్తగారికి సాహిత్య గురువులైరి. వారిని నాటికిని, నేటికిని మఱవక, భక్తిభావములతో నిత్యము స్మరించుచుండుట శ్రీ తిప్పయ్యగుప్తగారి సద్గుణవిశేషము.

ఈ కవిగారు తమ 15 సం॥ వయస్సునందే కవితాకన్యను చేబట్టిరి. బళ్లారి వార్డ్లా హైస్కూల్ నందున్నతవిద్య చదువు తరుణమునసే వీరి రచనలు భారతి మాసపత్రికలో అలంకరింపబడినవి. వీరి తొలి రచన 1925 భారతి మాసపత్రికలో వెలువడినది. ఆ యుక్తవయస్సున వీరి కవితారచన సాగినతీరును గమనింతము.

సీ. ఆల భవిష్యద్వసంతాగమంబు వచించు
పరభృతగాన ప్రవాహమందు ;
అలరు కెందామరలందు జుంజుమ్మని
రొదసేయు యెలదేటి కదుపులందు ;
నరవిరి మొగ్గల విరియించి సౌరభం

బుల గ్రోలు శీతలానిలములందు;
నెలమావి పూపపిందెలమెక్కి మనసార
యలరు చిల్కలముద్దు పలుకులందు;
గీ॥ భవ్య కమనీయ వన, సుసౌభాగ్యమందు
జెలఁగి యుదయించుచున్న లేజిగురులందు
బెక్కుచందంబులఁ దాండవించుచున్న
ప్రణయదేవతకిదె! యభివందనంబు.

తదనంతరము వీరు సాగించిన సాహిత్యకృషి మెచ్చ దగినది. పద్యరచనయందేకాక నాటక, నవల, చరిత్రగ్రంథ రచనలందారితేరిరి. వీరి చరిత్ర గ్రంథములలో 1) విద్యారణ్యచరిత్ర 2) విద్యారణ్యవిజయము ప్రశస్తి నందినవి. శ్రీ విద్యారణ్య పీఠాధిపతులచే నవి ప్రశంసింపబడినవి. ఆ గ్రంథములందలి కొన్ని భాగములు త్రిలిజసమదర్శిని పత్రికలలో ప్రకటింపబడినవి.

21—5—1934వ సంవత్సరమున ఈ రెండు గ్రంథములను పరిశీలించి డాక్టర్ శ్రీ చిలుకూరు నారాయణరావుగారు తమ యభిప్రాయమిట్లు తెలియజేసిరి. "రాచర్ల తిప్పయ్యగారు రచించిన విద్యానగర నిర్మాణము, విద్యారణ్యచరిత్రము నీరెండు గ్రంథములను ఆమూలాగ్రముగ చదివినాను. ఈరెండును గొప్ప పరిశ్రమ జేసి వ్రాసినవి కాని సాధారణ గ్రంథములుకావు.———

............ ............ ............

మృదుమధురములగు పదములతో వ్రాయబడి చదువుటకింపుగనున్నవి. చరిత్ర గ్రంథములలో యీ గ్రంథములు ఉత్తమస్థానము పొందగలవని ఆశిస్తున్నాను."

ఈ రెండు చారిత్రక గ్రంథములేకాక 1) కంపిల విజృంభణము 2) కాకతీయ జీవనసంధ్య వీరి కలమునుండి వెలువడినవి.

1) అమృత స్రవంతి 2) బదులుకు బదులు వీరు వ్రాసిన నవలలు.

వీరు వ్రాసిన నాటకములు 1) మోహినీరుక్మాంగద 2) ఛత్రపతి శివాజీ. ఛత్రపతి శివాజీయందొక పద్యము జూడుడు.

సీ. ఎవ్వాఁడు హైందవు లెలమి సుఖింపగ
జేసె తదాచార శిష్టరక్ష ?
యెవ్వాఁడు మ్లేచ్ఛులనెదిరి దహించెను
కానన్యుగ్ర శిఖిశిఖావిధంబు ?
యెవ్వాఁడు పూర్వ రాజేంద్ర పద్ధతి నిల్పె
నాశాంత దివ్య గజాంసపీఠి ?
యెవ్వాఁడు శిరసావహించి దేశికు నాజ్ఞ
వర్తించి జన్మపావనత గాంచె ?
అట్టిమహిమాఢ్యుఁ డున్నతుఁడౌ శివాజి
మహిత మహరాష్ట్ర లక్ష్మినిజ మనుచుచుండె
అలరుగాత శివాజి రాజ్యంబు రామ
రాజ్య విఖ్యాతి నాశాంత పూజ్యమగుచు.

మోహినీరుక్మాంగద నాటకమునందు రుక్మాంగదుడు మోహినీ రూపలావణ్యముల నాత్మగతమునందిట్లు భావించుచున్నాడు.

సీ. అలివేణి జిలిబిలి పలుకుల బలుప్రేమ
నాలకించెడు మోహనాంగు డెవడొ ?
కలవాణి సొగసు చెక్కులనంటి ముద్దాడి
సంతసంబును గాంచు నరసు డెవడొ?
రమణితో నానందరాజ్యాభిషేక సం
ప్రాప్తికై బుట్టిన మదను డెవడొ?
జలజాక్షి యడుగులజాడలో వర్తింప
నవతరించిన సుందరాంగు డెవడొ?

గీ॥ యెవని పున్నెము బూచునో యీమెవలన
ఆత్మసుఖమెవనిది చరితార్థమగునొ
బ్రహ్మసంకల్పమందు నెవ్వాడుగలడొ
యింత పుణ్యావకాశమే నెటులగాంతు.

తెనుగుసాహిత్యముతో తనకు చెలిమిగావించిన శ్రీమాన్ కల్లూరు వేంకట నారాయణరావు గురుదేవులను నిత్యము వారిట్లు స్మరింతురు.

కల్లూర్వంశపయఃపయోధి విలసద్రాకాసుధాంశుం శుభం
ఆంధ్రక్ష్మాతల పండితాఖిలజన ప్రస్తూయమానోజ్జ్వలం
బోధార్థి ప్రతినామసిద్ధపురుషం జ్యోతిర్విదామగ్రణీం
శ్రీ మద్వేంకటపూర్వకం గురువరం నారాయణం భావయే.

ఈ గురుకృపాకటాక్షమువల్లనే శ్రీ గుప్తగారు 'సాహిత్య సరస్వతి' అని పిలువబడిరి. పెద్దలయెడ భక్తి, గురువులయెడ నమ్రత, సాహిత్యపోషణయెడ ఉదారత, సాహితీప్రియులయెడ ప్రేమ వీరికి వెన్నతోపెట్టిన గుణములు. వీరికి తండ్రిపై భక్తి ఎక్కువ. వారి సంస్మరణార్థము 116 రూ. గ్రంథమాలకిచ్చినారు. తండ్రి కొమారుల చిత్రములు ప్రకటింపబడినవి.





# శ్రీ లంకా కృష్ణమూర్తి

జననము :— 9–9–1925

తల్లి :— శ్రీమతి దుర్గా లక్ష్మమ్మ

తండ్రి :— శ్రీలంక వెంకటరామప్ప

జన్మస్థలము:— పెనుకొండ

అనంతపురం జిల్లా.

మతము, కులము:— హిందూ

బ్రాహ్మణ — వెలనాడు.

శ్రీలంకా కృష్ణ మూర్తిగారు రాయలసీమలోని అనంతపురం జిల్లాకు చెందినవారు. వీరు ఉద్యోగరీత్యా 1950 నుండి కర్ణాటక రాష్ట్ర రాజధాని నగరమైన బెంగళూరులో హైకోర్టునందు డిప్యూటి రిజిస్ట్రారుగా పనిచేయుచున్నారు. వీరు సంస్కృతాంధ్ర భాషలలో రచనలు చేయగల దిట్టలు. హిందీ, కన్నడ, ఆంగ్లభాషలెఱిగి అందభిమానము. అభినివేశము కూడ గలవారు. కన్నడదేశపువారికి తెనుగుసాహిత్య సౌరభముల నందించిన ఆంధ్రులలో వీరొక్కరు. బెంగళూరులోని 'తెలుగు సాహితీ సమితి'కి వీరుపాధ్యక్షులు. వీరి తెలుగు ఉపన్యాసములు, కవితలు, బెంగళూరు ఆకాశవాణినుండి ప్రసారము చేయబడినవి. కన్నడప్రాంతమున జరుగు తెనుగు సాహిత్యసభలలో, అవధానక్రియలలో వీరికి ప్రథమస్థానముకలదు.

శ్రీకృష్ణమూర్తిగారు మద్రాసు యూనివర్సిటీ బి. యస్. సి. పరీక్షలో ఉత్తీర్ణులై, పిదపరి మైసూరు యూనివర్సిటీలో

బి. యల్. పట్టమునొందిరి. 1950 నుండి – 59 వరకు వీరు న్యాయవాదులు. తరువాత కర్ణాటక హైకోర్టులో డిప్యూటి రిజిస్ట్రారు పదవిని చేబట్టిరి.

ఈ కవిగారి 'దానయజ్ఞము' 1958లో ముద్రింపబడినది. ఇందులో కరుణాప్రేరితమగు దానమత్యుత్తమ మనియు. దానిని యజ్ఞముగా నాచరించినచో నేటి మానవు డున్నతస్థానమునందుట కవకాశమేర్పడగలదనియు చెప్పిరి. ఇందు భారతమందలి సక్తుప్రస్థ చరిత మితివృత్తముగా గ్రహింపబడినది. ధర్మరాజు గావించిన అశ్వమేధయాగమును కవిగారిట్లు వర్ణించిరి.

సీ॥ యజ్ఞమంత్రములకుఁ బ్రాజ్ఞ భూసురశాస్త్ర
చర్చ,వ్యాఖ్యను సమకూర్చుచుండ;
భూసురాశీర్వాదములకు, రాజన్యుల
జయనినాదంబులు జయముఁనొసఁగ;
హోమధూమములతో నొక్కటై యరుదగు
ధూపముల్ క్రొత్తావి జూపుచుండ;
దగజెప్ప పనసల ధాటికి మంగళ
తూర్యశబ్దంబులు తోడ్పడంగ;
గీ॥ ధర్మజుఁడొనర్చు నశ్వమేధమ్ము వింత
చెలువముల గల్గి యెల్లర చిత్తములను
వివిధరీతుల జెలగించె, వేడుకలకు
మేర లేదయ్యెఁ నెల్లెడ శ్రీరహించె.

శ్రీ కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారీ కృతిని పరిశీలించి తమ యభిప్రాయముల నిట్లు వెల్లడించిరి.

'...................... వీరికి సంస్కృతాంధ్రములయందు చక్కని పాండిత్య కలిమియు, పద్యరచనాకౌశల్యము కలదని గ్రంథము వలన దెలియుచున్నవి. ఇంతటి రచనా శక్తితో వీరు మహాకావ్య రచనయు చేయగలరు.అట్టి కావ్యరచన కిక గడంగుదురని, యాశించుచున్నాడను'

కవిసామ్రాట్ గారు ఆశించిన విధముగనే శ్రీకృష్ణమూర్తి గారు 1958–59 సం॥లలో 'త్యాగ శిల్పము' అను మహాకావ్యమును వ్రాసిరి. అందు లేపాక్షి దేవాలయమును కట్టించిన విరుపణ్ణ కథ వ్రాయబడినది. విరుపణ్ణ కళాయోగమున జీవన్ముక్తుడగుట విపులముగా వర్ణింపబడినది. అతడు యోగసిద్ధుడగుటచే తన కన్నులను తానే త్యాగము చేయగలిగినాడు. కళాయోగమును వర్ణించుచు కవి ప్రేమ చైతన్యపు సమగ్ర స్వరూపము నీక్రింది పద్యమున వర్ణించినాడు.

సీ॥ విష్ణుపదోద్భూత విమల మందాకిని
దేవ లోకాలకు దీప్తినిచ్చి
శివజటాజూట రంజిత సుస్థితినిగాంచి
ఆవేశమున భూమి కట్టెదుమికి
సాగరంబులనింపి జగతి నోముచునుండి
జీవకోటికి నెల్ల జీవనమిడి
సృష్టిస్థితుల మూలపుష్టియై యొప్పిన
ముద్రబంధమునకు బొదిగియుండి

గీ॥ అస్థిరంబగు జగతి లయంబునందు
వేళ శివనాట్య చలితమై వేలమీరి

పొంగి తేజోమరుద్భావములను బొంది
విష్ణు పదమందు గంగయై ప్రేమవెలయు.

ఇట్టి ధ్వని మయములగు శిల్పములీ కావ్యము నందచ్చ టచ్చట గలవు. దేవాలయ నిర్మాణమును వర్ణించుసీ క్రింది పద్యము కవిగారి ప్రౌఢ రచన కొక యుదాహరణము.

చిల్చుచుఁ జీల్చుచుః జనగఁ జేతికి లొంగెను గండశైలముల్
తొల్చుచుఁ దొల్చుచుః జన గతుల్గని రూపములః ధరించుచుః
మల్చుచు, మల్చుచుః జనగ నవ్యవిలాసము బెంచుచుః శిలల్
నిల్చుచు నిల్చుచుః గనియె నిశ్చల నిత్య సురాలయస్థితిః.

ఈ కావ్యము త్వరలో ముద్రింపబడుగాత !

వీరి రెండవ ముద్రితకృతి 'శ్రీవిలాసము' దీనిని రాయల కళాపరిషత్తు-మడకశిర వారు ముద్రించిరి. 'శ్రీ'యన్న పదము నకు సర్వసాధారణముగా ఎల్లరూ ధనమను అర్థమునే గ్రహించి నారు. కాని వేదమున నీపదమున కుద్దేశించిన యర్థము వేరు. ఆ యర్థమును వివరించుటకే ఈ శతకము ప్రవృత్తమైనది. ఇందెట్టి కథా వస్తువునులేదు.

'కవి తాను వివరింపదలచిన ధర్మ రహస్యమును సూటిగా. సులభముగా. అర్థవంతములైన పదములతో, జాతీయములైన నుడికారములతో హృదయంగమములైన లోకోక్తులతో వివరింప గల్గెను. ఇదియే శతకమునకు కావలసినది. ఈ గుణములన్నియూ ఈ శతకమునకు గలవు' అని శ్రీ రూపావతారం నారాయణశర్మ గారు కృతియందు తమ అభిప్రాయమును వెల్లడించినారు. ఈ శతకమునకు కవిగారెట్టి మకుటము నుంచలేదు. దీనిని ధర్మప్రబో ధకముగా నెంచవచ్చును.

'శ్రీ' యొక్క రూపమును, సుగుణములను కవిగారిట్లు తెల్పుచున్నారు.

శాంతి, ముదము, సత్యసంధత, ధైర్యంబు
దమము, తృప్తి, సమత, దైవభక్తి
భూతదయ, విశాలబుద్ధి, ధర్మశ్రద్ధ
మున్నుగాగ సుగుణములును నీవ!

ప్రతిభ, కవిత. వాక్పటుత. కార్యకౌశల
మందు, కళలయందు నభిరుచియును
నైపుణంబు, విద్య, రూపంబు, శక్తియు
నీదు రూపులుగ గణింతు నేను.

ధనము కొరకు బండచాకిరి చేసెడి పేదలను. నిశ్శక్తుల కష్టములను జూడుమని కవిగారు 'శ్రీలక్ష్మి'కిట్లు నివేదించుకొనుచున్నారు.

సీ॥ ఎప్పుడో విధిలేక నప్పుసేసిన నద్ది
పెరుగుచుండగఁ దీర్ప వెసవులేక
ఋణదాత కోరినరీతిఁ బత్రంబుల
వ్రాసియిచ్చుచు వాని దాసు లగుచు
కొనకు వాడాస్తులెల్లను దోచుకొని పోవ
నాలుబిడ్డల సాక వీలుగాక
కలవర మందు కంకాళ రూపులఁజూడు
మమ్మ లక్షలకొద్ది యగపడెదరు
గీ॥ మేని చెమటలూడ్చి పూసిక సేవింప
గూలి యివ్వ తిట్టు కొనెడివారి
యడుగు లాశ్రయించి కడుపుకై మానంబు
విడిచి బతుకు వారిఁజూడుతల్లి!

కన్నడ సాహిత్యమునకు వీరొనరించిన కృషి కడు ప్రశంసింప దగినది వీరి కలమునుండి వెలువడిన 'కౌడెయగోపాల' కన్నడ నవల ప్రస్తుతము కన్నడప్రభ దినపత్రికలో ప్రతిదినము ధారా వాహికగా వెలువడుచున్నది. 'త్యాగశిల్పి' కన్నడ నాటకము, 'అత్తెయఎత్తర' కన్నడ ప్రహసనము. వీరి అముద్రిత రచనలు.

శ్రీలంకా కృష్ణమూర్తిగారు నిరాడంబరులు. బిరుదములకు సన్మానములకు ప్రాకులాడు స్వభావము వారికిలేదు. ఇతోధికముగ సాహిత్యసేవ చేయుట వీరి ప్రధానాశయము. తమ 'శ్రీవిలాసము'ను రాయల కళా పరిషత్తునకు సర్వహక్కులతోబాటు, ముద్రణకగు ఖర్చులనుకూడ నొసంగి తమ నిస్వార్థ సారస్వత సేవను ప్రకటించుకొనిరి. కవిగారుత్తరోత్తర తమకుగల సంస్కృతాంధ్ర,కర్ణాటక భాషాపాండిత్యప్రతిభలతో అమూల్యగ్రంథములను రచించి కర్ణాటకాంధ్ర కవిశేఖరులుగా విఖ్యాతి నొందుదురు గాక ★



## శ్రీ పప్పూరు రామాచార్యులు

జననము :– 8–11–1896

నిర్యాణము :– 21–3–1972

తల్లి :– శ్రీమతి కొండమ్మ

తండ్రి :– శ్రీ పప్పూరు నరసింహాచార్యులు

జన్మస్థలం :– అనంతపురం.

మతము, కులము :– హిందూ బ్రాహ్మణ – శ్రీవైష్ణవులు.

పుట్టుచున్నవెపుడు పుస్తకంబులు కోట్లు
చదువదగిన వందు చాల కొలది
పుట్టుజనులలోన పూజ్యు లెకొందరో
విశ్వ వినుత నామ వినుము రామ. (రామయ్యపద్యాలు)

పుట్టిన ప్రతిమనిషి పూజ్యుడు కాలేదు. వ్రాసిన ప్రతి పుస్తకము సాహిత్యములో తలమానికము కాజాలదు. 'మలయ జంబు వలన వనము వెలిగిన రీతి' ఒక పుణ్య పురుషునివలన ఆమండలమునకు కీర్తి ప్రతిష్టలు పెరుగును. పూజ్యులైన శ్రీ పప్పూరు రామాచార్యులవారిని అనంతపుర మండలమున ఎఱుగని వారు లేరు. ఒక వైపు రచనావ్యాసంగమును చేబట్టి సామర్థ్యముతో ఒక పత్రికను నిర్వహించుచు ప్రజలలో రాజకీయ చైతన్యమును కల్గించిన ప్రజ్ఞాశాలురు శ్రీ ఆచార్యులవారు.

శ్రీ రామాచార్యుల తండ్రిగారైన శ్రీ నరసింహాచార్యులు కూడ పేరుమోసిన పౌరాణికులు. వీరి పురాణ ప్రసంగములందు హాస్యధోరణి అధికము. ఆఛాయలే కుమారునిలోను పొడసూపినవి. ఆచార్యులవారు తండ్రికడనే సంస్కృతాంధ్రములునేర్చి. అనంతపురము మునిసిపల్ హైస్కూలులోచేరి, స్కూలుఫైనల్ పరీక్షను రాజమహేంద్రవరమున ముగించిరి. తరువాత 1914 లో మద్రాసు పచ్చయప్ప కళాశాలలో ఇంటర్మీడియేట్ చదువు సమయమునందే వీరు రాజకీయరంగములో ప్రవేశించిరి. అప్పటిలో రాయలసీమ ప్రజానీకమును జాగృతమొనర్చిన నాయకులలో పద్మశ్రీ కల్లూరు సుబ్బరావుగారు, గాడిచెర్ల హరిసర్వోత్తమరావు గారు ముఖ్యులు. కల్లూరు సుబ్బరావుగారివెంట పల్లెటూర్లకు వెళ్లి ప్రజలలో స్వాతంత్ర్య సముపార్జనా కాంక్షను రేకెత్తించిరి. ఆ సమ

యము నందే ఆచార్యులవారికి సుబ్బరావుగారితో కడు సన్నిహిత మేర్పడినది. గ్రామములలో మద్యనిషేధము, ఖద్దరు వస్త్రధారణ, హరిజనోద్ధరణ, గ్రామపారిశుభ్రత మున్నగు జాతీయ కార్యక్రమములను చేబట్టి, అనంతపురమండలమున బహుళ ప్రచారము గావించిరి. 1921లో గాంధీజిగారిని తాడిపత్రిలో కలుసుకొని, ఉప్పు సత్యాగ్రహములో పాల్గొనిరి. ఆకారణమున వారొక ఏడాదిపాటు బళ్ళారిలో కారాగారవాస మనుభవించిరి.

తరువాత 1923లో శ్రీ ఆత్మారామప్పగారి సహకారముతో ఆచార్యులవారు 'పినాకినీ' పత్రికను ప్రారంభించిరి. మూడేడులా పత్రిక సాగిన తదనంతరము 1926లో ఆచార్యులవారే 'సాధన' యనుపేర మరొక పత్రికను నడిపిరి. ఆ పత్రికనంతపుర మండలమున ఎఱుగని వారులేరు. ఇప్పటికినీ ఆ పత్రికను ఆచార్యులవారి కుమారులు శ్రీ శేషాచార్యులవారే నడుపుచుండుట ముదావహము. శ్రీరామాచార్యులవారి కలమునకు పదును మెండు. పత్రికా సంపాదకత్వములో వీరనేక విషయములను కడు విచక్షణతో విమర్శించిరి. తెనుగుదేశమున వీరొక ప్రముఖ సంపాదకులుగా గుర్తింపబడిరి.

1942లో జరిగిన 'క్విట్ ఇండియా' ఉద్యమమున ఆచార్యులవారు పాల్గొనిన కారణమున, మరొకసారి కారాగారమునకు వెళ్లి వేలూరు, తంజావూరు జైళ్లలో రెండేళ్లు గడిపిరి. అప్పుడు వీరితోబాటు శ్రీయుతులు అర్. బి. రామకృష్ణరాజు, కల్లూరు చంద్రమౌళి, కల్లూరు సుబ్బరావు, ఉ కూ రు సుబ్రహ్మణ్యము మున్నగువారుకూడా ఉండిరి. ఆచార్యులవారు తమకుగల సహజ పౌరాణిక ప్రవచనములతో తోటి డెటిన్యూలకు భారత, కాళిదాస కావ్యములలోని రమ్యభావములను వినిపించుచు, సత్కాలక్షేపము

చేయుచుండిరి. వారి ప్రవచనాపాండిత్యమునకు రాజకీయ ఖైదీలు వెలుగుపడి. జైలునందే వారికి పండిత సత్కారములు నెరవేర్చిరి

జైలునుండి విడుదల జరిగిన పిదపకూడ ఆచార్యులవారు పురాణపఠన కార్యక్రమమును కొనసాగించుచు తమ జీవితమును గడుపుచుండిరి. బళ్లారి ప్రజానీకము వీరి పురాణపఠన కార్యక్రమమునకు జోహారులొనర్చిరి. నాటక కళాప్రపూర్ణ బళ్లారి రాఘవాచార్యులవారు ఆచార్యుల వారినా సందర్భమున బంగారుపతకముతో సత్కరించిరి.

ఆచార్యులవారి రచనాపాటవమునకు 'వదరుబోతు' వ్యాసములు మచ్చుతునకలు. ఆవ్యాసములన్నియు హాస్యవ్యంగ్య ధోరణిలో, నిర్దుష్టమైన భాషలో, ధారాళమైన శైలిలో సంఘ సంప్రదాయములను విమర్శించుచు వ్రాయబడినవి. ఈవ్యాసములు భాషాభివృద్ధికేకాక సాంఘిక దురాచార నిర్మూలనకుకూడ తోడ్పడగలవు. ఈ వ్యాసములు కొన్ని విద్యార్థుల పాఠ్యగ్రంథములలో చేర్చబడినవి.

ఆచార్యులవారు తమ జాతీయోద్యమమున మద్యనిషేధము రూపుమాపదలచి, అటనట గ్రామీణ ప్రజలకు దృశ్యరూపముగా ప్రదర్శించి తెలియజేయుటకు వీలుగా, వ్యావహారిక భాషలోనే 'కల్లుపెంట' నాటకమును రచించిరి.

ఆచార్యులవారికి శ్రీరామునిపై భక్తిమెండు. రామనామము విశ్వవినుతమైనదగుటచే వారు తమ పద్యములను 'విశ్వవినుత నామ వినుము రామ' అను మకుటముతో 40 పద్యములు వ్రాసిరి.

అవి ఇటీవల వెలుగులోనికి వచ్చినవి. ఆ పద్యములలో మచ్చునకివి.

గండ్ల శిలలనైన ఖండింప గలిగిన
ఉక్కునీటి చెమ్మ తుక్కుపట్టు
ఎంత శూరుడైన కాంత చేతికి చిక్కు
విశ్వ వినుత నామ వినుము రామ.

చెట్టు మీద కోట్లు చిగురాకు పువ్వులు
ఒకటి తోడ నొకటి యొరసి కొనవు
నీతిపరుల బ్రతుకు రీతులిట్లుండురా
విశ్వ వినుత నామ వినుము రామ.

ఆచార్యులవారితో సన్నిహితులుగానున్న శ్రీ విద్వాన్ విశ్వంగారు వారినిగూర్చి ఇట్లు వ్రాసిరి.

"——— ఆయన హాస్యంలో కాస్త ఘాటుపాలెక్కువ గనుక కొంత వ్యతిరేకత సంపాదించుకొన్నారు. జిల్లా కాంగ్రెస్ రాజకీయాలలో యువకులుగా మేము (నేను, నీలం సంజీవరెడ్డి, తరిమెల నాగిరెడ్డి వగైరాలు) ప్రవేశించినప్పుడు వ్యతిరేకంగా ఆయన చాలా వ్రాసేవారు. నేను సమాధానాలు అదే 'సాధన' లోనే వ్రాసేవాణ్ణి. ఇద్దరం ఆ ఆఫీసులోని పట్టమీద కూర్చునే వ్రాసేవారం. ఒకరి చిత్తశుద్ధి నొకరు శంకించి ఎఱుగము. వాదం వాదమే. స్నేహం స్నేహమేగా ఉండగల సంస్కారం వారికున్నది."

ప్రస్తుతం లోకసభ స్పీకర్గారైన శ్రీ నీలం సంజీవరెడ్డి గారికి వీరు ప్రవేటు ఉపాధ్యాయులుగా మూడేళ్ల పని చేసిరి. ఇట్టి శిష్యు లాచార్యులవారి కెందరో కలరు. 1955లో ఆచార్యులవారు

ఆంధ్రప్రదేశ్ శాసనసభ్యులుగా ఎన్నికైరి. అనంతపురం మునిసిపల్ ఛేర్మనుగా పనిచేసిరి. అనంతపురము జిల్లా సహకారకేంద్ర బ్యాంకు అధ్యక్షపదవినలంకరించిరి. సాధన పత్రికతోబాటు 'సహకారపత్రిక' కు సంపాదకత్వము వహించిరి. దక్షిణ భారత హిందీ ప్రచారసభవారి 'స్రవంతి' పత్రిక సంపాదవర్గమున నుండిరి.

వీరికి ముగ్గురు కుమారులు. ఏడుమంది ఆడుబిడ్డలు. పెద్ద కుమారుడు శ్రీ శేషాచార్యులవారు ప్రస్తుతము 'సాధన' పత్రికను పట్టుదలతో నడుపుచున్నారు.

పండినమనసు. వయసుగల ఆచార్యులవారు జీవితమును నిండుగా అనుభవించి వెళ్లిరి. వారు ధన్యజీవులు. ★



## శ్రీ కగ్గల్లు సుబ్బరత్నము

జననము :– 8–8–1920

తల్లి:– శ్రీమతి సంజీవమ్మ

తండ్రి :– కరణము శ్రీ గోపాలరావు

మతము – కులము : హిందూ బ్రాహ్మణ–స్మార్త నందవరీకులు శ్రీవత్సనగోత్రము.

వీరు స్వయంకృషితో. భారత భాగవత రామాయణాదులను. భక్తి శ్రద్ధలతో పఠించి, కవిత్వమును నేర్చిరి. సాధు

సన్యాసులన్న ప్రీతి ఎక్కువ. శ్రీ నరహరి సద్గురువుల వారి శిష్యులై. ఆత్మ ప్రబోధమును పొందియున్నారు. స్వాములవారి నిట్లు కొండా

సీ. శ్రీ ప్రబోధానంద – జీవిత లక్ష్యంబు
నద్వైత మర్మంబు – నరయదెలిసి
గుణరూప వర్ణాది గణభేదములు లేని
బ్రహ్మంబు సెలుగంగ – బలికినారు
జ్ఞాన సంపదరూప – సౌందర్య మబ్బిన
గురుసేవ యొక్కటే – గూర్చుముక్తి
పరిపూర్ణ భావంబు – ప్రణవస్వరూపంబు
నిలుచు నెప్పుడనుచు – బలికినారు

ఆ. బ్రహ్మమెఱిగి, మదిని బ్రహ్మర్షి తానౌచు
సత్యధర్మ నిష్ఠసాధనముల
శాంతి వచనములను – సంతాపములదీర్చు
గురువరేణ్య మిమ్ము – గొలుతు సతము.

సీ. నిష్కామ యోగంబు – నిర్మలాంతఃకర
ణంబు, ముక్తికి – కారణంబు దెలియ
శివకేశవుల గొల్వఁజిత్తంబు వికసించి
భేద భావంబులు – వెడలిపోవు
సంసార బంధంబు – సమయుంగ, నేకేశ్వ
రోపాసనంబె, విద్యుక్తమగును
ఆత్మయొక్కటె స్థిర – మస్థిరంబగు దేహ
మనెడు, శంకరుమార్గ –మరయ వలయు

గీ. బ్రహ్మ విద్యను సాధింప – పరముదక్కు
అరయ, నిశ్చల జ్ఞానోదయంబె వలయు

నంచు, నరహరి గురువర్య! యరసిదెల్పి
నావు; కైకొమ్ము; మా వందనములు ఆర్య!

వీరప్పుడప్పుడు వసంత ఋతువును వర్ణించుచు, కొన్ని పద్యములను వ్రాసినారు. చిగురుబోండ్లు వసంతకాలము నందుద్యాన వనములలో తిరుగు సందర్భమున.

సీ. అందమే సొమ్మని — హాయిగా నిదురించె
చెట్ల నీడల నొక్క చిగురుబోడి
పందెమే నాదని — పంతంబు లాడెను
దాయలొడ్డుచు నొక్క — తమ్మికంటి
చందమియ్యాదియని — సఖియలతో గూడి
మధురాన్నములదినె — మగువ యొకతె
వందల ఖర్చుతో — వచ్చినదీచీర
నంగతేమనిపల్కె — నకియయొకతె

గీ. గిలుకు మెట్టెలు రవళింప — కులుకులొలుక
పసపు పారాణి పాదాల మిసిమిగూర్ప
చంద్రవదన మొయ్యారంపు — సొరుతోడ
వనవిహార మొనర్చిరి — జనులుపొగడ

సంక్రాంతి నిట్లు వర్ణించిరి.

గీ. రంగుముగ్గులు — ముంగిళ్ల — రాజ్యమేలె
క్రొత్తయల్లుండ్ర రాకలు గూర్చెశోభ
అత్తవారిండ్ల — యానంద మతిశయించె
పచ్చ పచ్చగ సంక్రాంతి — వచ్చునపుడు

క్రమక్రమముగా ఈకవిగారు ఖండికలనేకాక కావ్యములను కూడ వ్రాయుదురుగాక!



'సరసకవయిత్రి'

## శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ

జననము: 20—12—1920

తల్లి:– శ్రీమతి సుబ్బలక్ష్మమ్మ తండ్రి:– శ్రీకజ్జారామశర్మ

జన్మస్థలము: తిరుపతి—చిత్తూరు జిల్లా

మతము, కులము:– హిందూ–బ్రాహ్మణ–ద్రవిడవంశము.

రాయలసీమ మహిళామణులుకూడ, కవిత్వము చెప్పుటలో వెనుదీయలేదు. మొల్ల, తరిగొండ వెంకమాంబ, తాళ్ళపాక తిమ్మక్క వీరందరూ ప్రాచీనులు. పుట్టపర్తి కనకమ్మ, గంటి కృష్ణ వేణమ్మ మొదలైనవారు ఆధునికులు. వీరు తమ కవిత్వమును ఛందోబద్ధముగా వ్రాసినవారే. స్వాతంత్ర్యానంతరము దేశములో పద్యరచన తగ్గి, వచన రచనలధికమైనవి. స్త్రీలు నవలలు వ్రాసి పేరుదెచ్చుకొన్నారు. ఇప్పటి రచయిత (త్రు)లకు పత్రికలధికము. పాఠకులు అధికమే. అప్పటిలో భారతి–గృహలక్ష్మి వంటి కొన్ని ప్రముఖ పత్రికలు విద్యావంతులను మాత్రమే ఆకర్షించుచుం డెడివి. మద్రాసునుండి వెలువడుచున్న డా॥ కె. యస్. కేసరిగారి 'గృహలక్ష్మి' మాసపత్రిక ఆనాటి స్త్రీ రచయితలను ప్రోత్సహిం చినది. ప్రతి ఏడాది గృహలక్ష్మి 'స్వర్ణ కంకణము'ను ఉత్తమ శ్రేణి మహిళల కందించెడిది. ఆ పత్రిక యిచ్చిన ప్రోత్సాహ ముతో కొందరు స్త్రీలు తమ కాలమును రచనావ్యాసంగమునకు వెచ్చించి. పత్రికాముఖమున మంచి పేరు ప్రఖ్యాతులను సంపా దించుకొనిరి. అట్టి మహిళలో రాయలసీమకు చెందిన కవయిత్రి శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారొకరు.

శ్రీ కృష్ణ వేణమ్మ తాతగారందరు దివాన్, పెష్కారు ప్లీడర్లు, ఆస్థానపండితులుగాను పనిచేసిన వారు. వీరి తండ్రి కట్టా రామశర్మగారు పోలీసుఇన్‌స్పెక్టర్‌గా పనిచేసిరి. వీరి తల్లి శ్రీమతి సుబ్బలక్ష్మమ్మ కవయిత్రి. 'చంద్రికళా విలాసము' అను ప్రబంధమును ఈమె రచించినది. ఆగ్రంథము విద్వాన్ పరీక్షకు పాఠ్యగ్రంథముగా నుండెడిది. కృష్ణవేణమ్మగారి భర్త శ్రీగంటి వెంకటసుబ్బయ్యగారు బి. ఏ. వీరుకూడ మంచి పండితులు. కవిత్వము వ్రాయగలిగినవారు. వారు 'కవులుట్ల చెన్నకేశవ' శతకమును వ్రాసిరి. వారు బొంబాయిలో జనరల్ మోటార్సులో ఉన్నతోద్యోగులై యుండిరి. 1940లో వీరు కాలగర్భములో కలసిపోయిరి. అప్పటికి శ్రీమతి కృష్ణవేణమ్మగారికొక కుమారుడుండెను.

ఈ కవయిత్రి బహు విద్యావంతురాలు కాకపోయినను తాతగారైన నాగపూడి కుప్పుస్వామయ్యగారివద్ద తెనుగులో కొంత పరిచయము కలుగజేసుకొన్నది. ఒంటిమిట్టలో శ్రీ వావిలికొలను సుబ్బరావుగారు జరుపుచున్న పరీక్షలలో 3, 4 పరీక్షలను చిన్నతనములోనే ముగించిరి. హిందీ, వార్ధా విద్యాపీఠమువారి 'భాషా కోవిద' పరీక్షవరకు చదివి పట్టముపొందిరి. ఆంగ్లమున కొంత వరకు పరిచయము కలదు. కన్నడభాషలో ప్రవేశమున్నది.

బాల్యదశలోనే ప్రాప్తించిన వైధవ్యముతో జీవితాంతము బాధచెందక, మనోల్లాసమునకు, దైవభక్తి కనుకూలమార్గమైన కావ్యపఠన, కావ్యరచనలను చేబట్టి వివిధఖండికలు వ్రాసి గృహలక్ష్మి మాసపత్రికకు పంపిరి.

1947 జనవరినుండి వీరి 'సైరంధ్రి' పద్యకావ్యము వరుసగా గృహలక్ష్మిలో ముద్రింపబడినది. విధి వక్రించిన పాండవులు ద్రౌపదితోబాటు విరటు కొలువున అజ్ఞాతవాసము గడుపవలసి వచ్చినది. ద్రౌపది సైరంధ్రిగా విరటుని అంతఃపురము జేరినది. ఒక నడిరేయి ఆమె గతమును గూర్చి తనకు తానే చర్చించుకొన్నది. ఆమె కౌరాజ సౌధమున నిద్దురపట్టలేదు. ఆమె నాళనాళము లుద్రేకముతో జొంగినవి. ఆమె అక్కడ 'బోనులోపలి పులియట్లు ప్రొద్దుపుచ్చు' చున్నది.

మనుజుఁడేకాకి యైపోవు మసలుచున్న
మనసదెప్పుడు దాల్చదు మౌనముద్ర
తనకుదా జెప్పికొను; వినుతానె మఱల
అనృత మాడ్డదు మానస మట్టిపట్ల.

కవయిత్రి, మనస్తత్వమును చిత్రీకరించుటలో నేర్పరురాలు. నాడు కురుసభలో ద్రౌపది చెందిన మనోవేదన నిట్లు కవయిత్రి చిత్రీకరించినది.

' నాడటు పాండవాత్మజులు నన్నును, తమ్మును రాజ్యమెల్లదా
నోడి మహార్తి నున్నతరి నుద్యతులై ధృతరాష్ట్ర నందనుల్
పాడి దొఱంగి వల్వలొలువన్ గని సూతసుతుండు కొల్వులో
నాడిన మాట లకటా! తలపోయ మనంబు వ్రయ్యదే!

కురుపతి, భీష్ముడున్, గృపుడు, కుంభజ ముఖ్యులు గల్గుకొల్వులో
నరసి వచింపరైరకట! యాడుది వేడిన ధర్మసంశయం
బెరుఁగరె? ధర్మ శాస్త్రముల నేటికిగాల్పనె! పెద్దవారలం
దురుగద, యేటి పెద్దలిక నేటికి వారల గౌరవింపగన్?

ఆ ద్రౌపది మనోపరితాపమును రచయిత్రి అతిచక్కగా వర్ణించెను. ద్రౌపది హృదయాంతరాళములో గూడు కట్టుకొన్న మనోవేదనే ధారగా ఆమె కనులలో స్రవించినది. ఆ నాడు నిండు కొలువులో తన్నవమానించిన దుష్టులందరూ సమరాంగణమున తన భర్తలతో చచ్చుట తాను చూడవలెనని పట్టుబట్టినది.

1951 జూలై గృహలక్ష్మి కృష్ణవేణమ్మగారి 'విర్వేదన' యను ఒక ఖండికను ప్రచురించెను. అందలిభావములన్నియు నామె స్వయముగా జీవితమున నెదుర్కొను వేదనా పరంపరలే.ఆమె వేదన ఇట్లున్నది.

దుఃఖమయమైన లోకమ్ము దొలగి పోవ
మిగుల జింతించి చింతించి, మేరలేని
సంశయాబ్ధిని మున్గుచు జావులేక
బ్రదుకు లేకిట్లు వెఱ్ఱినై పాడుచుంటి

వీరి 'వృథా'— 'గాలిపటము' మున్నగు ఖండికలుగూడ ఆవేదనా భరితములే. వీరి యితర కృతులలో 'గిరిజాకల్యాణము' శృంగార రస ప్రధానమైనది. ఈ యితివృత్తమును మనోహరముగా నవ్య రీతిలో తీర్చిన నవీన కావ్య కుసుమమిది. 'పవనదూత్యము' వీరి మరొక సందేశ కావ్యము. ఇందలికథా వస్తువు రాధాకృష్ణుల ప్రణయము. రాధ మాధవుని పైగల విరహవేదన నిక సహింపలేక పవనునితో రాయబారము పంపుటకు యత్నించును. ఈ రెండును ప్రాచీన తెనుగు మహా కవుల కావ్యముల కేమాత్రము తీసిపోవు. చక్కటి కవితాధార, భావగంభీరత ఈ కావ్యములందు కాన్పించును శ్రీ రాజరాజేశ్వరీ శతకము—కామాక్షీ శతకము కవయిత్రి గారి ముద్రిత రచనలు.

శ్రీమతి కృష్ణ వేణమ్మగారు గృహలక్ష్మి పత్రికాధిపతులతో స్వర్ణకంకణమును, 'సరసకవయిత్రి' యను బిరుదమును పొందిరి. ఇంతటి ఉన్నత స్థాయిని పొందుటకు ఆమె భర్తగారి తోడ్పాటే మూల కారణము, దానికితోడు జ్ఞాన ప్రసూనాంబిక వరప్రసాదము కూడ కవయిత్రికి లభించినది. అందులకే వారిట్లు వ్రాసుకొన్నారు.

అందముగ రసిక హృదయా
నందంబుగ గవిత జెప్ప నాకలవియె? బా
లేందుధరు కూర్మిసతి నా
యందు నిలిచి బలుకు మన్న, యంత పలికెదన్ (నిర్వేదన)

కవయిత్రి అత్తగారిల్లు కడపజిల్లా ప్రొద్దుటూరు తాలూకా యర్రగుంటపల్లె. మామగారు గొప్పభూస్థితి గలిగిన శ్రోత్రియం దారులు. వీరి కుమారులు శ్రీ గంటి దత్తాత్రేయగారు, ప్రముఖ న్యాయవాదులుగా నున్నారు. ప్రస్తుతము కవయిత్రి ప్రొద్దుటూరు నందు వాసము చేయుచు తీరికవేళలందు కావ్యరచన చేయుచు, తాను నేర్చిన హిందీ భాషను విద్యార్థినులకు బోధించుచు, సమాజ కార్య క్రమములందు పాల్గొనుచు కాలము బుచ్చుచున్నారు. కవయిత్రికి జ్ఞాన ప్రసూనాంబిక సతతమిండగానుండి రక్షించుగాత! *

రాయలసీమ రచయితల చరిత్ర

రెండవ సంపుటి సమాప్తము.

# శ్రీ పింగళమూర్తి

## ఉగాది కానుక 20-3-1977

రచన:— కవిభూషణ—కవితిలక కల్లూరు అహోబలరావు

సీ. బంగారు రంగుల—రంగారు జివురుల
సింగారముగఁజెట్లు జేమ లలరె
మంద మందంబుగ—మలయానిలంబులు
కమ్మ కమ్మగ, వీవగా దొడంగె
శుకపిక, శారికల్, సుకముగాఁబాడుచు
ప్రియముగా, వీనుల—విందొనర్చె
వాసంత మన్మథుల్ — స్వాగత సుమమాల
లర్పింపవేచిరి — యాదరమున

గీ. శ్రీ యుగాది, వేంచేసెను — శ్రీకరముగ
రమ్మ! పింగళమూర్తి! రారమ్మ వేగ
పిండి వంటల భుజియించి — ప్రీతితోడ
మంగళమ్ముల మాకు నొసంగుదేవ! ౧

కం. గళమున, గరళముగల, పిం
గళమూర్తి! శంకరాఘనా శంకర! బె
బ్బులి చర్మాంబరధారీ!
మలకొమరిత నేలినట్టి — మంగళమూర్తీ! ౨

గీ. తీవ్ర ఝంఝానిలంబును — దెచ్చిపెట్టి
భారతము, నల్లకల్లోల — పఱచినావు
శ్రీ ప్రజాస్వామ్య వాదంబు — శ్రేయమంచు
బలికినావు — పింగళమూరి వర్య! నేడు 3

ఆ. అలహాబాదుకోర్టు — యానతి దప్పి, సు
ప్రీముకోర్టుకేగి — రీతిదప్పి
దప్పిగొంచు. తప్పిదంబుల నొనరించె
అమ్మ! ఇందిరమ్మ — అనువు దప్పె ౪

ఆ. కాలదోషమొకటి — కర్మదోషమురెండు
గ్రహము పాటు మూడు — గల్గెగాక!
నిన్ను గెల్చువారు — నిఖిలలోకంబుల
రారు; లేరు — ఇందిరమ్మ నిజము. ౫

గీ. జనతపార్టి — యేతెంచెను — సంతసంబు;
శ్రీమొరార్జి, దేశాయి, విశిష్టగుణుని
ధీరవరుని. ప్రధాన మంత్రిగ వరించె
లోకసభ, హర్షమొందిరి లోకజనులు. ౬

గీ. జాతి, మత, కులభేద ఈర్ష్యలు నశించి
దేశమందు హింసాకాంత నాశనంబు.
గాంచి, సోదరత్వము మేళవించి, మంచి
బెంచి, సాధుల రక్షించి. మించుసౌఖ్య
ములను సాధించి. జనతప్రభుత్వమెల్ల
వారి రక్షించి, పింగళ వత్సరమున
యశము జెందెడిగావుత! యహరహంబు. ౭

గీ. బహుగుణుండు జగ్జీవన ప్రతిభవరుడు
అతిరథులు, మహారథులు సీయండనున్న
వారు; మూరార్జి దేశాయి! మీరుప్రజల
కిచ్చినట్టి వాగ్దానముల్, హెచ్చరికతో
పాలనమొనర్చి కాంగ్రెసువారికంటె

మిన్నయనిపించు కొనుటయే మేలు: పింగ
ళుండు మీబుద్ధి కనిపెట్టి యుండుగాన
'జనత ప్రభుత' శోభిల్లుచు — దనరవలయు ౮

గీ. రాజు రవిగాన, ప్రభులలో — పర్రిబలు వైర
ములు; బుధుడు మంత్రి — మణి సైన్యములను నడపు
గాన, పింగళమూర్తియు — గన్నువిప్ప
చిచ్చుబడి, శత్రుమూక — నశింపకున్న? ౯

చం. నవ, నవధాన్యముల్ వెలసి—నాణేముగా జలదంబు లెల్లెడ≡
నవిరళభంగిగాఁగురిసి, యప్పుల కూపతటాక జాలముల్
జవు లలరంగ నిండి. పశుజాలము, భూప్రజ సంతసింప, గా
రవమున పింగళాక్షు డవురాయన కీర్తినిఁబొందగావలె≡ ౧౦

కం. పింగళమూర్తీ! భువిలో
మంగళముల్ గల్గజేసి — మానితముగ, రా.
జ్యాంగము తిద్దిదీర్చుము
వెంగలివిత్తుగ జరింప — వృథయగు బ్రతుకు≡ ౧౧

కం. జిలిబిలి పలుకుల గులుకుచు
తెలుగు కవిత — మంజులముగ — తేట దనమున≡
విలసిల్ల వలయు; శ్రీపిం
గళనామక వత్సరమున గల్గు శుభంబుల్. ౧౨

ఓం—శ్శాంతి—శ్శాంతిః

# 19-11-75 ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక 'కొత్తపుస్తకాలు' శీర్షికలో ప్రచురింపబడిన పత్రికాభిప్రాయము.

## రాయలసీమ రచయితల చరిత్ర-ప్రథమ భాగము

గ్రంథకర్త: కవిభూషణ, కవితిలక కల్లూరు అహోబలరావు, ప్రచురణ: శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల, హిందూపురము క్రౌను 28 + 144 పుటలు వెల: రు. 8–00

ఎన్నో శతాబ్దాలనుంచీ రాయలసీమ మహాకవులకూ, మహా పండితులకూ పేరుపడింది. రాయలవారి ఆస్థానంలోని అష్టదిగ్గజాలను గురించి ఎరగని ఆంధ్రులుండరు. ఆ సంప్రదాయం అనుస్యూతంగా వస్తూనే ఉన్నది. వారిలో కొందరి చరిత్రలే చరిత్రల కెక్కినవి. ఈ గ్రంథకర్త 20వ శతాబ్దపు రాయలసీమ కవి రత్నముల చరిత్రలను వారి కవితలతో, చిత్రపటములతో ఏర్చికూర్చి గ్రంథరాజాన్ని తెలుగు తల్లికి సమర్పింప నిశ్చయించారు. అందలి మొదటి భాగం ఇది. ఇందులో ఇరవై మంది విద్వత్కవుల చరిత్ర లున్నవి.

ఈ శతాబ్దిలోని రచయితలను గురించిన చరిత్రలు ఇదివరకే ఎన్నో ఉన్నవి, రచయితల చిత్రాలతో, వారి కవితా విశేషాలను ఉదహరిస్తూ వ్రాసిన చరిత్రలలో ఇది మొదటిగా కానవస్తున్నది. ఆయా రచయితల కుటుంబ చరిత్రకు కూడా ప్రాధాన్య మివ్వడం ఇందలి మరొక విశేషం.

సుప్రసిద్ధ నాటక కర్తలు శ్రీధర్మవరం వారు, కోలాచలం వారు, వాల్మీకి రామాయణాంధ్రీకర్తలు శ్రీవావిలికొలను వారు,

జనమంచివారు, 'శివభారత' కర్త శ్రీగడియారం వారు, 'ప్రతాప సింహ' చరిత్రకారులు శ్రీ దుర్భాకవారు, విద్వత్కవి వతంసులు శ్రీ గాడేపల్లి వారు, మద్దులపల్లి వారు 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహ ' కర్తలు శ్రీ కల్లూరి వారు ఇంచలి రచయితలలో ముఖ్యులు. వీరిని గురించి చాలా మందికి తెలుసు. ఇతర రచయితలను గూర్చి కొందరికి మాత్రమే తెలుసు. అట్టి వారి చరిత్రలను ఇందులో ఇచ్చి శ్రీ కల్లూరు అహోబలరావు వాఙ్మయాని కెంతో ఉపకారం చేశారని చెప్పవచ్చు. ఆయా రచయితలను గూర్చి విషయాన్ని సేకరించుటలో గ్రంథకర్త పరిశ్రమ ప్రశంసనీయం.

శ్రీ రాళ్ళపల్లి వారు, విద్వాన్ విశ్వం, పుట్టపర్తివారు, బెళ్ళూరి వారు, సుబ్బన్న శతావధానిగారు, తిరుమల రామచంద్ర మున్నగు సుప్రసిద్ధులను గురించి తర్వాతి భాగాలలో ఉండుననుకుంటాను.

మధురకవి బెళ్ళూరి శ్రీనివాసమూర్తిగారి ' మెప్పు ' ఈ గ్రంథానికి శోభను కలిగిస్తున్నది. ఇందులో శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల సంగ్రహ చరిత్ర, గ్రంథకర్తగారి గ్రంథాంతరం 'ఉగాది స్వర్ణభారతి' కృతి స్వీకరణ వృత్తాంతం, కల్లూరి వెంకట నారాయణరావు గారి 'మున్నుడి' కూడా ఉన్నవి.

ఈ శతాబ్దంలోని రాయలసీమ రచయితలను గురించి తెలుసుకొనగోరేవారు దీనిని చదవడం మిక్కిలి అవసరం.

—ఆయాన్య

(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక సౌజన్యముతో)

———o———

# శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల—హిందూపురం.
## వారి ప్రచురణలు

1. స్వార్థత్యాగము—నవల—శ్రీ ఘూళీ కృష్ణమూర్తి
2. భావతరంగములు—ఖండికలు—శ్రీ కల్లూరు అహోబలరావు
3. ప్రేమసుందరి భా I—నవల—శ్రీ హెచ్. దేవదానము
4. ప్రేమసుందరి భా II— ,, ,, —
5. వేమభూపాల విజయము—శ్రీ రావాడ వేంకటరామశాస్త్రులు
6. విప్రనారాయణ నాటకము—శ్రీ రూపనగుడి నారాయణరావు
7. మాధవాశ్రమము భా I—నవల—శ్రీగుంటి సుబ్రహ్మణ్యశర్మ
8. మాధవాశ్రమము భా II— ,, — ,,
9. కుముదవల్లి—నాటకము—శ్రీ శీరిపి ఆంజనేయులు
10. పూదోట—పద్యఖండికలు—శ్రీ కల్లూరు అహోబలరావు
11. రాయలసీమ రత్నరాశి—కవితాసంకలనము— ,, —
12. స్వప్నవల్లభుడు—పద్యకావ్యము—,, హెచ్. దేవదానము
13. జ్ఞానవాశిష్ఠ రత్నములు—పద్యములు—,, కిరికెర భీమరావు
14. భక్తమందారము—ద్విశతి పద్యములు—,, కల్లూరివారు
*15. అమృతాభిషేకము—ఖండికలు—,, బెళ్లూరి శ్రీనివాసమూర్తి
16. షాజహాన్—పద్యకావ్యము—,, కల్లూరువేంకటనారాయణరావు
17. తపోవనము—పద్యఖండికలు—,, బెళ్లూరి శ్రీనివాసమూర్తి
*18. మయూరప్రహసనము—హాస్యము—,, డి. బాబన్న
*19. భక్తపోతరాజీయము—నాటకము—,, మద్దులపల్లి వారు
*20. వివేకానందము—ద్విపదకావ్యము—,, బెళ్లూరిశ్రీనివాసమూర్తి
*21. ఉగాది స్వర్ణభారతి—పద్యసంపుటి—,, కల్లూరివారు
*22. రాయలసీమ రచయితల చరిత్ర—౧ — — కల్లూరు
*23. రాయలసీమ రచయితల చరిత్ర— 2వ సంపుటి—కల్లూరు

* ఈగుర్తుగల పుస్తకములు మాత్రము లభించగలవు.

# మారాబోవు ప్రచురణలు

## 1. దేవుడికి నేతిదీపాలు

పసందైన పన్నెండు కథల సంపుటి.
రచయిత: శ్రీ సనగరం పార్థసారథి.

## 2. రాయల సీమ రచయితలచరిత్ర-3వ సంపుటి

రాయలసీమలోని ప్రసిద్ధ రచయితల జీవితచరిత్రలతో
ఏర్చికూర్చి తీర్చిన గ్రంథరాజము.
గ్రంథకర్త: శ్రీ కల్లూరు అహోబలరావు.

## 3. శ్రీరామకర్ణామృతము
## 4. శ్రీకృష్ణ కర్ణామృతము

సంస్కృత శ్లోకములకు చక్కని తెనుగుపద్యములు

గ్రంథకర్త:— శ్రీ కల్లూరు అహోబలరావు.